# ఇద్దరు వైద్యులు

## ప్రపంచ విఖ్యాతమైన నవల

రచన

హాజెల్ లిన్

అనువాదం

బి. వి. సింగరాచార్య

వెల : రు. 1-8-0

జాతీయ జ్ఞాన మందిరము
64, గాంధీనగరం, మద్రాస్ 20.

First Edition:
1000 Copies.

# ID[illegible]I VAIDYULU

Telugu version of
*The Physicians*

*By*



**Hazel Lin**

*Translated By*

**B. V. Singaracharya**

Price : Re. 1-8-0

Jatheeya Jana Mandir
64, Gandhinagar Madras-20.

# పరిచయం

వర్గా జాతీయ జ్ఞానమందిరము ప్రచురిస్తున్న జాతీయ, సాంస్కృతిక గ్రంథాలను, బాల వయోజన సాహిత్యమును, శాస్త్రగ్రంథాలను విశేషముగ ఆదరిస్తున్న ఆంధ్ర ప్రజానీకానికి యూరప్, ఆసియా ఖండాల లోని బహు భాషలలోనికి అనువాదం చేయబడి విశేష ప్రఖ్యాతి పొందు చున్న ఈ నవల మా క్రొత్త కానుక.

చైనా ప్రాచీన వైద్యపద్ధతిలో అసమానఖ్యాతి పొందిన వంశంలో జన్మించి ఉన్నత పాశ్చాత్య విద్య అభ్యసించి, ఆ వైద్య విధానంలో అపూర్వ పరిశోధనలు సాగించిన ఒక చైనాదేశపు యువతియొక్క రమ ణీయ చరిత్ర ఈ నవలలోని ప్రధానవస్తువు.

జాతీయ జ్ఞానమందిరము నవలలు ప్రచురించడానికి ఇదే ప్రథమం అవడం వల్ల, ఇట్టి విశ్వవిఖ్యాతి చెందిన గ్రంథాన్ని మాతొలి నవలగా మా ప్రియపాఠకులకు అందించే అవకాశం మాకు కలిగినందులకు ఆనం దిస్తున్నాము.

ముందు ముందు ఇంకా ఇటువంటి వినోద విజ్ఞానప్రదములైన నవలలను ఇతర అంతర్జాతీయ సారస్వతమును ప్రకటించ దలచు కున్నాము. జాతీయ విజ్ఞాన వికాసాభ్యుదయ ప్రియులైన ఆంధ్ర ప్రజా నీకం, విద్వల్లోకం మా ప్రచురణలను యథాప్రకారం ఆదరించగలరని విశ్వసిస్తున్నాము.

ఇట్లు,

మాగంటి బాపినీడు,

సంపాదకుడు.

మద్రాసు,
23-11-55

# ఇద్దరు వైద్యులు

## ప్రథమ భాగం

వైద్యశిరోమణి వాంగ్ ఆవలిస్తూ, మహాగని కర్ర పందిరి మంచంపైన కొంచెం ఒత్తిగిలి, ఒళ్ళు విరుచుకున్నాడు. అతడి కుడిచేయి ప్రక్కకి గాలిలోకి సాచుకొని ఉంది. ఆయన హృదయంలో ఏదో సన్నని నులినొప్పి బయలుదేరింది. ఏడాదినాడు భార్య పోయినప్పటినుండి ఆ గదిలో ఏకాంతవాసం చేస్తున్నానన్న తన దారుణస్థితిని ఆ శూన్యవాతావరణం మరల ఆయనకు స్మరణకు తెచ్చింది.

తెల్లని మెత్తని బాలీసువంక చూస్తూ, "అన్లాన్! నా అన్లాన్!" అంటూ నిట్టూర్చాడు. చివరికి మనుమణ్ణి ఎత్తకుండానే నువ్వు దాటిపోయావు. నిర్భాగ్యుడైన నీ కొడుకు నేటికీ నీ మనోరథం సఫలం చేయనే లేదు."

వాంగ్ కంగ్ కూతుళ్లు నలుగురికీ పెళ్లిళ్లు అయినవి. నలుగురికీ సంతానం ఉంది. ఆ శాపతు వాంగ్ కంగ్ కి మొత్తం ముగ్గురు మనుమలు, ఐదుగురు మనుమరాళ్ళూ ఉన్నారు. కాని, వీళ్ళెవరూ వాంగ్ వంశాన్ని నిలబెట్టే వారు కాదుగద! అలాంటి వాళ్ళెందరు ఉండి ఏమిలాభం? కొడుకు వాంగ్ పిన్ కి వివాహమయి ఆరేళ్లుదాటినా, కోడలు

చిన్‌లీన్‌లో ఇంతవరకు అలాంటి సూచనలు ఏమీ కని పించలేదు. వాంగ్ కంగ్‌ని తన వంశాభివృద్ధిని గురించిన కీతి చాలా కలత పెడుతూంది.

లేచి మంచం మీదే కూచుని గొంతు సవరించు కున్నాడు. అది కోడలికి ఆహ్వానం. చిన్‌లీన్ ఈ వాంగ్ వంశంలో అడుగు పెట్టినప్పటినుండీ, ఆమె దినచర్యలలో ఇది ఒక సంతోషకరమైన పని. ఆ ఇంట్లో నౌకర్లు లేక కాదు. వాంగ్ కంగ్‌కి సేవకుల పరిచర్య రుచించదు.

చేతిలో ట్రే (పళ్ళెం) వయ్యారంగా ఊగులాడించు కుంటూ, చల్లగా చలిచలిగా వీస్తూన్న ప్రభాత పవనాలను ఆస్వాదించుకుంటూ, చకచకావచ్చి రకరకాల నగిషీపని చేసిన తన మామగారి గదితలుపు మెల్లగా తట్టింది.

"లోపలికి రా అమ్మా!" అన్నమాట వినిపించగానే తలుపు త్రోసుకుని లోపల ప్రవేశించి, ఆ "ట్రే"ని మంచం ప్రక్కనున్న ఎర్రలక్కతో నగిషీపని చేసిన గుండ్రబల్లమీద పెట్టింది. వాంగ్ కంగ్ మళ్ళీ ఒకసారి ఆమెవంక ప్రశంసా స్ఫోరకమైన ఒకచూపు చూచి ఆమెయెడ తనకుగల అపార వాత్సల్యాన్ని సమీక్షించుకొన్నాడు.

ఆమె ముందుగా దంతధావనం నిమిత్తం వేడినీళ్లు అందించింది. తరువాత ఆయన ఘుమఘుమలాడే "టీ" అందుకొని ప్రేమపూరితంగా ఆమె వంకచూస్తూ, కొంచెం కొంచెంగా చప్పరిస్తూ త్రాగుతున్నాడు. మామగారు టీ

త్రాగడం పూర్తికాగానే ఆమె గాలికప్పుల్ని మళ్లీ ట్రేలో పెట్టుకొని, ఆయనకు వంగి నమస్కరించి వెళ్ళిపోయింది.

ఆ ఇంటికి పెద్ద నౌకరయిన చాంగాన్ తన యజమానిని నిరంతరం వేయికళ్లు పెట్టుకొని కాచుకొనిఉంటాడు. కోడలు బయటికివచ్చి తలుపు మూయగానే అతడు లోపల ప్రవేశించాడు. వాంగ్ కంగ్ పైజామా తొడుగుకొని మంచం అంచుమీద కాళ్ళూపుతూ కూచున్నాడు. చాంగాన్ రెండు శాటిన్ చెప్పులు తీసుకొనివచ్చి యజమాని పాదాలకు తొడిగాడు.

యాభైగేళ్ళ పైబడిన వయస్సు, మందగించిన దృష్టి, స్ఫుటంగా కనిపించే నక్క గల చాంగాన్ పదిహేనేళ్లుగా అక్కడ పనిచేస్తున్నాడు.

బల్లపరుపుగా ఉన్న చప్పిడిముక్కుతో, ఒకదాని నొకటి దూరంగా నెట్టివేసినట్టు ఉన్న కళ్ళతో, తళతళ మెరిసే అతడిముఖంలో ఎడతెగని ఒక వికృతహాసం కరడు కట్టుకొని పోయింది. ఇతర నౌకర్లందరిలాగే అతడికి తన యజమానిపట్ల విశేషమైన ప్రేమగౌరవభావాలు ఉన్నవి. ఆ యజమాని కూడా, నౌకర్లపైన అప్పుడప్పుడు మండిపడినా, మొత్తంమీద మంచివాడూ, దయాపరుడూ అనే చెప్పాలి.

వాంగ్ కంగ్‌కి సరిగా యేభై యెన్మో యేడు వెళ్ళింది. అయితే, చైనావారు లెక్కచూచేపద్ధతి ప్రకారం అతనికి ఇప్పుడు యాభై రెండేళ్లు. ఇప్పటికీ, చెవులప్రక్కన నాలుగు

పోచలు తప్ప మిగిలిన జుట్టంతా తుమ్మెదరెక్కలలాగ నిగ నిగలాడుతూ అతడి దర్జాకు, అందానికీ వన్నె పెడుతూంది. బాగా పొడుగ్గా, నాజూకుగా ఉంటాడు. జుట్టు "పాంప డోర్" పద్ధతిలో వెనక్కి దువ్వుతాడు. అందువల్ల నుదుటి సువిశాలత స్ఫుటంగా కనిపిస్తూంది.

మామగారి పరిచర్య పూర్తికాగానే చిన్‌ లిన్‌ భర్తను నిద్ర లేపడానికి తన గదిలోకి వెళ్ళింది. "లేవండి! లేవండి! మామగారికి ఈవేళ ఉదయం చెప్పవలసిన విష యం మాత్రం మర్చిపోకండి" అంటూ వాంగ్‌ పిన్‌ని నిద్ర లేపింది.

ఈ హెచ్చరికతో వాంగ్‌ పిన్‌కి వెంటనే పూర్తిగా మెలకువ వచ్చింది. మంచంమీద నుంచి ఒక్కసారిగా క్రిందకిదూకి ప్రేమతో భార్యను గాఢంగా కౌగలించు కున్నాడు. అతడికి అత్యంత ఆనందహేతువైన ఆ రహ స్యాన్ని గతరాత్రే ఆమె అతడికి చెప్పింది. ఆ రహస్యాన్ని తన తండ్రికి తెలియ జేయడమనే శుభకార్యాన్ని ఈ ఉదయం అతడు నిర్వర్తించాలి. ఉదయం ఉపాహారాలవేళ తాను తన తండ్రికి ఈ రహస్యం తెలుపగానే ఆయన ఎంత పొంగిపోయేది అతడికి తెలుసు. త్వరలో అవతరిస్తాడని అత డాశిస్తూన్న "మనుమడు" ప్రజ్ఞావిశేషాల్లోను, ఉన్నతా శయాల్లోనూ, మూర్తిమంతులా తాతగారిని పోలిఉండాలని కూడా అతడు భగవంతుణ్ణి ప్రార్థించాడు.

భోజనాల హాలు విశాలంగా, గాలి ఆడడానికి వీలుగా

ఉంది. ముందువైపు గోడకు నాలుగు పెద్ద కిటికీలు, మధ్యగా ఒక ద్వారం ఉన్నవి. ఎదురుగా ఉన్న గోడపైన గాలిపోయే రెండు చిన్న కిటికీలు మాత్రమే ఉన్నవి. హేమంతఋతువు. ప్రభాతవేళ. ముందువైపు కిటికీలగుండా ధగధగలాడే సూర్య రశ్మి లోపల ప్రవేశిస్తూంది. వెనుకఉన్న కిటికీలలోంచి చిరు చలిగాలి కొడుతూంది.

వాంగ్ కంగ్ టేబిలుకి మధ్యగా కూచున్నాడు. కొడుకు, కోడలు రెండు ప్రక్కలా కూచున్నారు, పెద్ద నౌకరు భార్య చాంగ్మా "ఇంక వడ్డించొచ్చు బాబూ!" అని కేకవేసింది. వెంటనే వంటమనిషి – బల్లపరువు ముఖం – నలభై యేళ్ళ వయస్సుగల – పొట్టిగా – బొద్దుగా ఉన్న వ్యక్తి – ట్రేలో ఉపాహారాలతో ప్రవేశించి, చిరు నవ్వుతూ, ముందుగా యజమానికి, తరువాత ఆయన కొడుక్కి వంగి నమస్కరించాడు. తరువాత వారిద్దరిముందూ, చివరికి చిన్ లీన్ ముందు పొగలు గ్రక్కుతూన్న వరిగంజి గిన్నెలు పెట్టాడు. టేబుల్ మధ్య నంచుకునేందుకు – ఉడికబెట్టిన గుడ్లు, ఎండబెట్టిన ఎద్దుమాంసపు రేకులు, ఉప్పుచల్లి వేయించిన వేరుశనగ పప్పులు, దోసకాయ ఊరగాయ ముక్కలు– రకరకాల రుచులుగల నాలుగు పదార్థాలు ఉంచాడు. పిమ్మట చాంగ్మా ఆవిరి మీద ఉడికబెట్టిన రొట్టెలు తీసుకు వచ్చింది.

చిన్ లీన్ తన ఉపాహారం వేగంగా ముగించింది. కాని, వాంగ్ పిన్ తాను చెప్పినమాట మరచి పోయాడని

నిశ్చయించుకోనడంలోనే. దగ్గరకు వెళ్ళి అతడి కుడికాలు గోకింది. పాపమతడు ఉలిక్కిపడి వెంటనే జ్ఞాపకంవచ్చి, "నా...న్నా! నువ్వు త్వరలో తాతవు కాబోవుతున్నావు తెలుసా?" అని గట్టిగా చెప్పాడు.

వాంగ్ కంగ్ ఒక్కక్షణం తేరిపారజూచి, "ఏమిటీ!" అంటూ తన గంజి గిన్నె క్రిందపెట్టి చిన్ లీన్ వంక శ్రద్ధగా సాలోచనగా చూచాడు. ఆమె సిగ్గుతో తలవంచుకుంటూ, ఆ తలవంపుతోనే ఆ శుభవార్తను ధ్రువపరచింది. వెంటనే వాంగ్ కంగ్‌కి భార్య జ్ఞాపకం వచ్చింది. కొడుకువైపు తిరిగి, "మీఅమ్మ బ్రతికిఉంటే ఎంత సంతోషించేదిరా!...ఈ వార్త వినాలని పరితపించిపోయింది....ఇది ఇంక కొంచెం ముందు జరుగకూడదూ?" అన్నాడు. అకస్మాత్తుగా అతడి గొంతులో ఒక ఉండ పైకి ఉబికింది. ఆయనకళ్ళు ఎర్రబడినవి. ఇదంతా వాకళ్ళ కంటబడనీయకుండా వెంటనే ఆ గదిలోనించి లేచి వెళ్లిపోయాడు. వాంగ్ పిన్ చేతులు చిన్ లీన్ బుజాలపైనవేసి, చెవిలో రహస్యంగా "మరేమీ లేదు! కంగారు పడకు! సంతోషం పట్టలేక లేచివెళ్ళాడు." అన్నాడు.

ఉదయం ఉపాహారం పూర్తికాగానే, చాంగాన్ తన యజమాని వద్దకు వైద్యానికై వచ్చేరోగులందరికీ స్వాగత మిచ్చి, గేటు ప్రక్క ఇంట్లో కూచోబెడుతున్నాడు. అందులో కొందరు పాపం తెల్లవారకముందే వచ్చి కూచు న్నారు. వైద్యానికి ప్రథమ పర్యాయం వచ్చిన వారివద్ద

వసూలుచేసే ఫీజు వారిస్థితిగతులను బట్టి యాభై సెంట్లు మొదలు అయిదు డాలర్ల వరకూ రకరకాలుగా ఉంటుంది. తరువాత వచ్చినప్పుడలా వారు అందులో సగం చెల్లిస్తే చాలు. ఫీజు వసూళ్లు జరుగుతోన్న సమయంలో వాంగ్ కంగ్ విశాలమైన తన ఆఫీసు గదిలోని పెద్ద మహాగని డెస్కు వద్ద కుర్చీలో పడుకొని పొడుగుపాటి తన నెమరు గొట్టపు పైపు బిగించి పొగ పీలుస్తున్నాడు. ఈ స్థితిలో అతడి మనస్సు వానికొచ్చేకు చెప్పిన శుభసందేశాన్ని సంతోషంగా సమీక్షించడం ప్రారంభించింది. చివరికి, తన పైపు కుండీలోని బూడిదనంతటినీ దులిపివేశాడు. రోగులను చూడడానికి సిద్ధమైనాని తయారుగా ఉన్నాడని చాంగాన్ గ్రహించడానికి ఈశబ్దం ఒక సంకేతంగా కూడా ఉపయోగపడు తూంది. వెంటనే చాంగాన్ తన అధికారం, హోదా పూర్తిగా చెలాయిస్తూ "నంబరు ఒకటి రావచ్చు" అని సాధికార స్వరంతో కేక వేశాడు.

రైతు దుస్తులలో ఉన్న ఒక యువకుడు ద్వారం వద్దకువచ్చి నిలబడ్డాడు. లోపలికి రావడానికి అతడు కొంచెం సంశయించాడు. తనకంటె పెద్దవాళ్ళెందరో అవతల గదిలో వేచి ఉండగా వాళ్లకంటె ముందుగా తాను రావడం అతడికి సిగ్గుగా ఉంది. పైగా, వైద్యుడి ఎదుటికి రావడానికి భయ పడి. కొన్ని నెలలుగా అతడాపని వాయిదా వేయగా, వేయగా, చివరికి ఆనాడు ఉదయం అతడి తండ్రి బలవంతం చేసి పంపించాడు.

'రా బాబూ! రా! కైమంతా ఇట్లా పాడుచెయ్యి మోకు" అని చాంగాన్ కేకపెట్టాడు.

"వస్తున్నా పెద్దయ్యా!" అంటూ భయంగా ఆ కుర్రవాడు వంగి నమస్కరిస్తూ మండువా దాటి ఆఫీసు గదిలో ప్రవేశించాడు. వెంటనే, వైద్యుడు తనను తేరిపార జూచేసరికి వణికిపోతూ వంగి మూడుసార్లు నమస్కరించాడు. "కూచో" అన్నాడు వాంగ్ కంగ్, ఎదురుకుండా ఉన్న కుర్చీ చూపుతూ.

రోగిని నఖ శిఖ పర్యంతం శ్రద్ధగా పారజూచాడు వైద్యుడు. పిమ్మట కుడివైపు డ్రాయరు తెరిచి టూన్-ఛు-చింగ్ రచించిన సుప్రసిద్ధవైద్యగ్రంథం "సత్ప్రవర్తనకు దివ్యమార్గదర్శి" అనే సంపుటాన్నితీసి, ఆ యువకుడి కుడి చేతిని ఆ గ్రంథంమీద పెట్టాడు. మొదట చేతిని తేలికగాపట్టు కొని, పిమ్మట కొంచెం ఒత్తి పట్టుకుని, చివరికి హెచ్చుగా-రక్తప్రసరణాన్ని నిలిపివేసేటంతగా ఒత్తిపట్టుకుని నాడీపరీక్ష చేశాడు. ఆపైన, రోగి ఎడమచేతి నాడినికూడా ఇలాగే పరీక్షించాడు. తరువాత రోగిని నాలుక సాచమని, వివిధ కోణాలనుండి శ్రద్ధగా పరిశీలించాడు. రోగి కనులు విప్పుకొని విస్మయంతో వైద్యుడి వంక చూస్తున్నాడు.

కొంతసేపు మౌనం. తరువాత..."నీ జబ్బు శీతపైత్య జ్వరం. ముందుగా శైత్యం ప్రవేశించి, తదుపరి పైత్య ప్రకోపం జరగడం వల్ల ఈ వ్యాధి ఏర్పడింది. నీవు పాలిపోయి నట్టు ఉండడానికీ, పెదిమలు నల్లబడడానికి అదే కారణం.

నీకు అప్పుడప్పుడు వచ్చే చలిగుబులు కూడా, వేడిచేసే మందులు తింటే తగ్గిపోతుంది,'' అన్నాడు వైద్యుడు.

ఈ పరీక్ష పొడుగునా రోగి నోరు విప్పి ఒక్కమాట మాట్లాడలేదు. చివరికి కూడా తలమాత్రం ఊచి తన అంగీకారాన్ని ప్రకటించాడు. వాంగ్ కంగ్ నల్లసిరాకడ్డీ తీసి పింగాణీ పలకమీద నాలుగు నీళ్ళ చుక్కలువేసి రంగరించి సిరా తయారుచేశాడు. బ్రష్షులు ఉండే ఇత్తడిగొట్టం లోంచి ఒక బ్రష్షు బయటకు లాగి తాజాగా తయారుచేసిన ఆ సిరాలో మెదిపి, చికిత్సాక్రమం వ్రాశాడు :

| | | |
|---|---|---|
| జపాన్ వార్నిషు వృక్షం వేరు | 1/2 | ఔన్సు |
| టీ మూస్ | 1 | ఔన్సు |
| శొంఠి కొమ్ములు | 1/10 | ఔన్సు |
| ఎండిన సినామన్ ఆకులు | 1/10 | ఔన్సు |
| మెట్ట తామర బోటి చిప్పలు | 1 | ఔన్సు |
| ఎండబెట్టిన ఎర్రమిరియాలు | 1 | ఔన్సు |
| లికోరిస్ వేరు | 1 | ఔన్సు |

సూచన : వీటిని ఒకగంటసేపు నీటిలో ఉడకబెట్టి,
ఎర్రపంచదారతో కలిపి పుచ్చుకొనవలెను.

రోగి భయపడుతూ, ఆ చికిత్సాసూచన పత్రాన్ని తీసికొని సగౌరవంగా వంగి నమస్కరించి వెళ్ళిపోయాడు. పిమ్మట, ఆ ఉదయం వరుసగా రోగులు వస్తూనే ఉన్నారు. దాదాపు పన్నెండు గంటలయింది. "నెంబరు ఇరువై నాలుగు'' అని కేకవేశాడు చాంగాన్. ఇతడే చిట్టచివరి

రోగి, చాలా జబ్బుగాఉన్నాడు. అతడిని సోదరు లిద్దరుచెరొక వైపునా పట్టుకొని నడిపించుకొని వస్తున్నారు. వయస్సు ముప్ఫయ్యేళ్ళలోపు ఉంటుం దేమో. కుణకుణాకీ మూలుగు తున్నాడు. చెక్కిళ్ళు వేడిగా పొంగి ఉన్నవి. కళ్ళు గుంటలు పట్టి ఉన్నవి. వైద్యుడు మామూలు ప్రకారం నాడి, నాలుకా పరీక్షించాడు. నాడి బాగా నీరసంగా కొట్టుకుంటూంది. నాలుకపైన తెల్లని పొరఉంది. నోట్లో చివుళ్ళన్నీ పుళ్ళుపడ్డాయి. రోగికి తనమాట వినిపించుకొనే ఓపికకూడా లేకపోవడం చూచి, వాంగ్ కంగ్ తక్కిన ఇద్దరితో ఇలా అన్నాడు. " మీ సోదరుడికి షాన్ - హాన్ (టైఫాయిడ్ జ్వరం) పట్టుకుంది. ఈ వ్యాధి వేడివల్ల వస్తుంది. ఉష్ణతి బాగా ఎక్కువయి జీర్ణశక్తిని క్షీణింప జేసింది. చలువచేసే మందులవల్ల ఈ ఉష్ణాన్ని ఉపశమింప చేయాలి." ఈమాట లంటూనే ఆయన ఎండ బెట్టిన ఆపిల్ పళ్ళు, పియర్స్ పళ్ళు, టర్నిప్పులు, మెలాన్ పళ్ళు, సిటికోళ్ళ ఎండుపాదాలు వేసి ఔషధం తయారుచేసే విధానం వ్రాసియిచ్చాడు. ఈ ఔష ధానికితోడు, " ఈ రోగానికి పథ్యం చాలా శ్రద్ధగా పాటిం చాలి. మీ వాడికి మాంసంగాని, కూరలుగాని ఏమాత్రం పెట్టకూడదు. వరిగంజిలో కొంచెం ఉప్పుమాత్రంవేసి యివ్వండి," అని హెచ్చరించాడు.

ఆ సోదరులు వైద్యుడు వాంగ్ కంగ్‌కి వంగి నమస్క రించారు. అందులో చిన్నవాడు రోగి పాదరక్షలు విప్పే శాడు. పెద్దవాడు అతణ్ణి ఎత్తుకొని బయటికి తీసుకు వెళ్ళాడు.

మధ్యాహ్న భోజనానంతరం ఇళ్ళకువెళ్ళి చూడవలసిన రోగులవద్దనుండి వచ్చిన చీట్లను చాంగాన్ తీసుకు వచ్చాడు. బాగా జబ్బుగా ఉండి తనవద్దకు రాలేని రోగుల ఇళ్ళకు, ఘోషా స్త్రీల ఇళ్ళకు మాత్రమే వాంగ్ వెళతాడు. యజమాని మళ్ళీ తన హుక్కా–కుంకీలోని బూడిద దులిపి వేసిన సవ్వడి వినిపించగానే చాంగాన్ వెనుకవేపు దొడ్డిలోకి వెళ్ళి "ఏమర్రా! అయ్యగారు బయలు దేరుతున్నారు," అని కేక వేశాడు.

కండలు తిరిగి ఉన్న నలుగురు యువకులు భోజనాల బల్లదగ్గరనుంచి లేచి, తమ యజమాని సవారీకుర్చీ తీసుకు రావడానికి పరుగెత్తారు. ఎవడికి వాడు తన మామూలు కొమ్ములదగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు. నలుగురూ ఆ కుర్చీకి నాలుగు వైపులా ఉన్న బొంగులను బుజాల కెత్తికొని కర్చీతీసుకువచ్చి గుమ్మందగ్గర దించారు. చాంగాన్ ద్వారపు తెర తొలగించాడు. వాంగ్ కంగ్ మెల్లగావచ్చి కుర్చీలో కూచున్నాడు.

చాంగాన్ తెచ్చిన చీటీలలో ఒక దాంట్లో ఇలా ఉన్నది: "హ్యూటంగ్ లో వూ–లియాంగ్–టూ–జెన్ 52 వ నెంబరు ఇంట్లోని మాడెమ్ టూ అమ్మగారు వైద్యశిరోమణి వాంగ్ మహాశయుణ్ణి ఒక పర్యాయం తమ భవనానికి దయ చేయవలసినదిగా కోరుతున్నారు."

చాంగాన్ యీచిరునామాను చదవగానే వాహకులు ఆకుర్చీని బుజాలపైకి ఎత్తుకొని బయలుదేరారు.

ఈ టూ అమ్మగారు పెకింగ్‌లోని మహైశ్వర్యవంతులలో ఒకరైన నగరపాలక సంఘాధ్యక్షునిభార్య. వాంగ్ కంగ్ సవారీకుర్చీ పెద్ద ఇనుప గేటులోంచి ఆవరణను దాటి రెండవ ఆవరణలోనికి వెళ్ళగానే నగరపాలక సంఘాధ్యక్షుడు టూ వచ్చి వాంగ్‌కి స్వాగతమిచ్చాడు. వాంగ్ సవారీకుర్చీలోంచి దిగి స్త్రీల విభాగంలోకి వెళ్ళాడు. టూ మాత్రం అయనతో వెళ్ళలేదు.

వాంగ్ కంగ్ మసక చీకటిగాఉన్న ఒక శయనాగారంలోకి ప్రవేశించాడు. ఆ గదిలో వెలుగుతూన్న రెండు కొవ్వొత్తుల వెలుగే వెలుగు. గదిలో ఎడమప్రక్క మూలగా సన్నని నగిషీ చెక్కడపు పనిచేసిన కొయ్యపందిరి మంచం ఒకటి ఉన్నది. దానిచుట్టూ దోమతెర, పైన కుట్టుపని చేయబడి ఉన్న ఎర్రపట్టు చాందినీ ఉన్నవి.

ఒక పడుచుపిల్ల వైద్యునికోసం చిన్నబల్ల తీసుకు వచ్చి మంచం ప్రక్కన వేసింది. పిమ్మట పందిరి మంచం తెర కొంచెంగా రెండు వైపులకు ఒత్తిగించుకుంటూ అందమైన చేయి ఒకటిబయిటికివచ్చింది. ఆచేతి ఐదువేళ్ళకూ వజ్రవైఢూర్యాదులు పొదిగిన బంగారపు టుంగరాలు ఉన్నవి. వాంగ్ కంగ్ ఆహస్తాన్ని పట్టుకొని మూడురకాల ఒత్తిడితో నాడిని శ్రద్ధగా పరీక్షించాడు. పిమ్మట, రోగి తన కుడిచేతిని లోపలికి తీసుకుని ఎడమచేతిని తెరలోంచి బయటికి సాచింది. రెండవచేతి నాడిని కూడా పరిశీలించడం పూర్తికాగానే, శ్రీమతి టూ తెరలోంచి ఒక చిన్న దంతపు బొమ్మను బయ

టికి అందించింది : ఆ బొమ్మ వంటిమీద వెన్నెముక చివరి పూసమీద ఒకటి, నడుముమీద ఒకటి – నల్లసిరాతో పెట్టిన రెండు చుక్కలు ఉన్నవి.

ఆ విధంగా ఆరోగి తనకు ఆ రెండు ప్రదేశాలలోను నొప్పిఉన్నట్టు వైద్యుడికి తెలియజేసింది. అయితే, అతడి నాడీ పరీక్షవలన ఆమె మూత్రపిండాల వ్యాధితో బాధపడు తూన్నట్టు తేలడంచేత, మూత్రపిండాలు సరిగా పనిచేయక పోవటమువలన ఏర్పడిన నడుమునొప్పి అని వ్యాధిని నిర్ధారణచేశాడు. అనేక మూలికలతో తయారుచేసే ఒక మందును వ్రాసియిచ్చాడు, మూత్రపిండాలను అద్భుతంగా చక్కబరచగల ఒక రకమైన గడ్డిమొక్కనుకూడా అందులో చేర్చాడు.

అనంతరం, తిరిగి వాంగ్ ముందు వాకిలిలోకి వెళ్ళే సరికి, మేయర్ టూ ఇతడికోసం నిరీక్షిస్తున్నాడు. వాంగ్ కంగ అతడి భార్యశరీర స్థితిని ఆయనకు వివరించి చెప్పాడు. మేయర్ విశేష సంతృప్తిని ప్రకటించి, ఎర్ర కాగితంలో చుట్టి ఉన్న కొన్ని నోట్లను వైద్యుడికి అందించాడు. వాంగ్ కంగ్ సంతృప్తిని వెల్లడించాడు. నిజానికి ఆ మొత్తం అతడి సామాన్యరోగులు ఐదారుగురిచ్చే మొత్తం ఫీజుకంటె ఎక్కువ.

మే నెల పెకింగ్ ప్రజలకు మనోహరమైనకాలం; లిలాక్ పీచ్ పువ్వులు కోకొల్లలుగా పూచే నెల.

రోజూ సాయంకాలం భోజనం పూర్తికాగానే వాంగ్

పిన్ భార్యతోకూడా తోటలోకి షికారువెళ్ళి, అనటి వసంతశోభను ఆమెకు వివరిస్తాడు. ఎర్రనిదిండ్లుగల ఒక పేము కుర్చీకూడా అతడు తనతో తీసుకువెళ్ళాడు. చిన్‌సెన్ ఆకుర్చీలో విశ్రాంతి తీసుకుంటూఉంటే, అతడు ఆకుర్చీ ఎడమ చేతిమీద కూచుని తన ప్రియురాలి సాన్నిహిత్య సౌఖ్యాన్ని, ప్రకృతి సౌందర్యదర్శన సౌఖ్యాన్ని, ఏకకాలంలో తనివి తీర అనుభవిస్తూండడం మామూలు.

ఆ మే నెలలో ఒకనాటి సాయంకాలం, ఆనాటికి నూరోసారో, నూట ఒకటోసారో భార్యను, "ఏమే? నీ వంట్లో బాగా కులాసాగా ఉంటూందా?" అని ప్రేమతో ప్రశ్నించాడు. ఎప్పటిలాగానే అతని పడుచు భార్య సిగ్గు పడుతూ, మెల్లగా రహస్యం చెపుతూన్నట్లు, "చాలా కులాసాగాఉంది. ఇక ఆట్టే కాలం వేచిఉండవలసిన అవసరం లేదనుకుంటాను" అన్నది.

ఆరాత్రే బాగా ప్రొద్దుపోయిన తరువాత చిన్‌సెన్‌కి నెప్పులు ప్రారంభమయినవి. అవి ప్రసవవేదనకు సంబంధించిన నెప్పులే అని సందేహ నివృత్తి చేసుకున్నమీదట, ఆమె భర్తను పిలిచింది. అతడు మంచంమీదినుంచి దిక్కు గంతుపెట్టి, "ఏమీభయంలేదు. ఉండు. మానాన్నను పిలుస్తాను." అంటూ గబగబా పరుగెత్తుకొనివెళ్ళి తండ్రి గదితలుపుగట్టిగా తడుతూ "నాన్నా! నాన్నా? నీకోడలు కష్టపడుతూంది," అని కేకపెట్టాడు.

వాంగ్ కంగ్ లేచి తలుపుదగ్గరకు వచ్చాడు. కుడి

చేయి కొడుకు భుజంమీదవేసి, "కంగారు పడకు నాయనా! ఇలాంటి పరిస్థితి నాకు అయిదుసార్లు అనుభవమయింది. చాంగ్మాను పిలు. ఆమెకు ఎప్పుడేమి చేయవలసినదీ సర్వం తెలుసు," అన్నాడు.

"ఆ పనేదో నువ్వే చూడు నాన్నా!" అని సణుగుతూ వాంగ్ పిన్ తండ్రి గదిలోని ఎర్రముఖమల్ సోఫాలో చతికిల బడ్డాడు.

చాంగ్మా తోటి నౌకర్లు చేయవలసిన పనులన్నీ వారిచేత ముందుగానే రెండు మూడు పర్యాయాలు అభ్యాసం చేయించింది. చిన్ లీన్ ఇప్పుడు బాగా బాధపడుతూంది. శరీరమంతా మెలికలు తిరిగిపోతూ, ముచ్చెమటలుపోస్తూంది. ఆమె పాపం చాలా భయపడుతూంది. చాంగ్మా ఆమెకు ఓగ్గరగా కూచుని మెల్లగా నుదురు నిమురుతూంది. "కొంచెం దపికపట్టు చిందొరసాని! మొగబిడ్డపుడితే బాదంతా పోతది. పెద్దొరగోరు ఎంతో సంతోషిత్తారు," అంది. "మగబిడ్డ" అనేమాట వినపడగానే చిన్ లీన్కి ఎక్కడలేని ఉత్సాహం వచ్చి, బాధను కొంతవరకు సహించగలిగింది. భర్తవచ్చి ప్రక్కన కూచుంటే బాగుండునని ఆమె కోరిక. కాని, అక్కడికి పురుషులకు ప్రవేశం లేదు.

కొద్దిసేపటికి క్రొత్త మంత్రసాని వచ్చింది. లాయ్మా అనే ఆమెకు గిరాకీ ఎక్కువగా ఉంది. భాగ్యవంతుల ఇళ్లల్లో పురుళ్లన్నిటికీ ఈమెనే పిలుస్తారు.

బయట వాంగ్ పిన్ ఆందోళనగా అటూ ఇటూ

పచార్లు చేస్తున్నాడు. పురుడు రావడానికి కొంత వ్యవధి అవసరమని చెప్పి, తండ్రి అతడి ఆందోళనను తగ్గించడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని, చివరకు వాంగ్ కంగ్ తన ఆదుర్దాను అణచిపెట్టుకోలేక పోయాడు. "మీ అమ్మ" బ్రతికి ఉంటే ఎంత ధైర్యం చెప్పేదిరా!" అని, వెంటనే ఇలా అన్నాడు: "రారా! మీఅమ్మ చిత్రఫలకానికి ధూపం వేసి, ఆమె ఈరాత్రి తిరిగివచ్చి తన కోడలిని చల్లగా చూడాలని ప్రార్థించు; రా!"

తండ్రి, కొడుకు ముందు దొడ్డిలోకి నడచివెళ్ళి, ఆ వంశంలో మరణించిన వారి చిత్ర ఫలకాలన్నీ ఉండే ప్రార్థన మందిరంలోకి వెళ్ళారు. వాంగ్ పిన్ భక్తి శ్రద్ధలతో తల్లి చిత్ర ఫలకంవద్ద మూడు అగరు వత్తులు వెలిగించి, మూడు సార్లు మోకరిలి మ్రొక్కాడు. ఇదంతా జరిగే సమయంలో ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు.

వెనుకకు తిరిగి వచ్చేటప్పుడు నిశ్శబ్దంగా ఉన్న ఆ గాలిలోంచి, "ఇంగ్రార్ ఇంగ్రార్" అంటూ అకస్మాత్తుగా చిత్రమైన నూతన స్వరం వినిపించింది. "పాప! పాప!" అని అరిచాడు వాంగ్ పిన్. అలా అరుస్తూ తటాలున పురిటి గదిలోకి వెళ్ళబోతూండగా, తండ్రి పట్టుకుని ఆపు చేశాడు. ఇద్దరు అక్కడే నిరీక్షిస్తున్నారు.

మరొక గంట గడిచింది; లోపల నుంచి ఎవరూ బయటకు రాలేదు. లోపలి శబ్దమేమీ బయటికి వినపడడం లేదు. వాంగ్ పిన్ తమాయించుకోలేక ఏడవడం మొదలు

పెట్టాడు. తండ్రికి ఏమీతోచక మధ్యదొడ్డికి వెనుకదొడ్డికీ మధ్య ఉన్న గోడ వద్దకు వెళ్ళి, "గిన్ హువా! ఇలా రా" అని పిలిచాడు. ఆ నౌకరుపిల్ల పరుగెత్తుకుంటూ వచ్చింది. పాపం ఆ పిల్లకూడా విషయమేమీ తెలియక లోపలినించి వార్తకోసం ఆదుర్దాగా ఎదురుచూస్తూంది. వచ్చి, "ఏంటయ్యగారూ?" అంటూ నమస్కరించి నిలబడింది.

"చాంగ్మా దగ్గరకు వెళ్ళి, ఆ గదిలో ఏమి జరుగుతున్నదీ కనుక్కు రా!" అని ఆదేశించాడు వాంగ్ కంగ్. గిన్ హువాకు ఇలాంటి విషయాలంటే అమితమైన కుతూహలం. కాని, ఆమెకు పెళ్ళికాలేదు; అందుచేత ప్రసవసమయంలో చూడకూడదంటారని కొంచెం వెనకాడింది.

"త్వరగా వెళ్ళిరా" అని గర్జించాడు వాంగ్ కంగ్, దాంతో ఆ పిల్ల నియమాలన్నీ విస్మరించి వెర్రిదాని లాగ పరుగెత్తింది. ఆమె తన నూనెదీపం వెలిగించుకొని పురిటిగది ద్వారం ముందుఉన్న మూడు రాతి మెట్లమీద ఊగులాడుతూపోయి, ఒక్కసారిగా ఆ కొయ్య తలుపు లోపలికి నెట్టింది. ఆ తలుపు కొంచెం కిరకిరలాడింది. మసక వెలుతురుగాఉన్న ఆ గదిలో, చిన్నదొరసాని అ ప్రక్కమీద పెద్ద రక్తపు మడుగులో చైతన్యం లేకుండా, తెల్లగా పాలిపోయి, శవాకృతిలోపడి ఉండడంచూచింది. చాంగ్మా, లాయ్మా మోకాళ్ళమీద కూచుని ఆదుర్దాగా ఇటూఅటూ వంగుతూ, మతిలేనివాళ్ళలాగ ఏదో గుసగుసలాడుకుంటున్నారు. గది మధ్యగాఉన్న ఎర్ర లక్కతొట్టిలో గోధుమరంగు ముతక

కాగితాలకు మధ్య చిన్నచిన్న కాళ్ళు. చేతులు ఎడతెరిపి లేకుండా ఇటూ అటూ కొట్టుకుంటున్నని.

గిన్ హువా పెద్ద కేక పెడుతూ వెనుదిరిగి టొన్లోకి పరుగెత్తుకొని వచ్చింది. ఈ కేకవిని వాంగ్ కంగ్, వాంగ్ పిన్ పురిటిగది వంకకు పరుగెత్తారు.

చిన్ లీన్ మరణించింది. వాంగ్ పిన్ ఆమె ప్రక్క వద్దకు దూకి, ఆ నిర్జీవశరీరాన్ని చేతుల్లోకి తీసుకొని ఇటూ అటూ ఊగులాడించి చూశాడు.

వాంగ్ కంగ్ అప్పుడు దుఃఖించలేదు. అనంతరం ఎలాగూ తప్పదని అతడికి తెలుసు.

ఇప్పుడు వాంగ్ పిన్ అనుభవిస్తూన్న దారుణ దుఃఖం రెండేళ్ళ క్రిందట తాను అనుభవించాడు. భార్య మంచం ప్రక్కన కూలబడి వెక్కి వెక్కి ఏడుస్తున్న కుమారుణ్ణి చూచి అతడి మనస్సు వికలమైపోయింది.

కాని, శిశువు మగబిడ్డా, కాదా అనే సంశయం తీర్చుకొనడానికి తాతగారి హృదయం తహతహ లాడు తూంది. ఆచారంకాదని ఏమాత్రం సందేహించకుండా వేగంగా, ఆ ఎర్రలక్కతొట్టె దగ్గరకు వెళ్ళాడు, ఎడమ చేతి రెండు వ్రేళ్ళతో రక్తంలో తడిసిన ఆ కాగితాలను లాగి వేశాడు. ఆ చూపుతో అతడి అనుమానమే ధృఢపడింది. తన వంశోద్ధారకుడు పుట్టలేదు.

గుండెలు చీల్చుకొని వస్తున్నకుమారుని ఆక్రంద

నాన్నికూడా గమనించకుండా, కోపంతో చరచర గది లోంచి బయటికి వెళ్ళిపోయాడు. ఇప్పుడాయనకు తాను మ్రొక్కిన దేవుళ్ళందరిమీదా, తన భార్యమీదా కూడా అమితమైన కోపంవచ్చింది. ఎంత ఆర్తితో ప్రార్థించినా వారు తనయెడ ప్రసన్నులు కాలేదు. తన కుటుంబంలో ఆడ బిడ్డ పుట్టింది. పైగా, నిర్భాగ్యురాలైన ఆ ఆడకూన తన కోడలి ప్రాణాలు బలిగొన్నది.

ఆ తల్లిలేని గుడ్డు సంగతి జ్ఞాపకమువచ్చి చాంగ్మా, ఆనుర్దాగా శిశువును మెల్లగా చేతులలోకి తీసుకొని తన గదిలోకి తీసికొనిపోయి నీళ్ళుపోసి, ప్రక్కవేసి పడుకో బెట్టింది.

మూడు పగళ్ళు, మూడు రాత్రులు వాంగ్ పిన్ తన గదిలో తలుపులు బిగించుకొని, నిద్రాహారాలు లేకుండా విలపించాడు. నాల్గవరోజున తండ్రికి అమితమైన భయంవేసి, కొడుకు గదివద్దకువెళ్ళి తన పిడికిళ్ళతో తలుపులు గట్టిగా కొడుతూ, "నాయనా! ఒకసారినన్ను లోపలకు రానియ్యి! ఒక్కసారి తలుపుతియ్యవు బాబూ!" అని ప్రాధేయపడు తున్నట్టు అరిచాడు. కొడుకు తలుపుదగ్గరకు రాకపోవ డంతో, ఆయన చాంగాన్సే తన సవారీమోసే నలుగురు నౌకర్లను కేకవేసి, తలుపులు పగలగొట్టించాడు, గదిలో వాంగ్ పిన్ స్పృహలేకుండా పడిఉన్నాడు. కొడుకు నీరస స్థితి క్షీణించి పోతుండడంచూచి వాంగ్ కంగ్ గాభరా పడ్డాడు. వెంటనే ఆయన తన పొడుగైన గోధుమవన్నె

పట్టు అంగీ అంచులను పైకెత్తిపట్టుకొని, నౌకర్ల గదుల వంకకు స్వయంగా పరుగెత్తాడు. "చాంగ్మా! వేడివేడి కోడిపిల్లమాంసపు పులుసు కొంచెం ఒక గిన్నెలోపోసి తీసుకురా!" అని కేకపెట్టాడు.

చాంగ్మా ఆపులుసును తీసుకురాగానే, కొడుకు దగ్గరకూచుని, "నాయనా! నీ తండ్రి హృదయావేదన తగ్గించడానికైనా ఈ రసం కొంచెం చప్పరించు బాబూ!" అంటూ బ్రతిమాలాడు. చాంగాన్ వాంగ్‌పిన్ నోరు తెరిచి ఉంచడానికిగాను, వెండిచెంచా నొకదానిని అతడి పళ్ళ సందున అడ్డంగాపెట్టి పట్టుకుని ఉండగా, తండ్రి ఆద్రవాన్ని కొంచెం కొంచెంగా అతడి నోట్లో పోశాడు. ఆ నీరస స్థితిలో కూడా వాంగ్‌పిన్ నిరాకరించి, "నేను చచ్చిపోదలచుకున్నాను. నాకర్మాన నన్ను చనిపోనివ్వండి!" అని ఆక్రోశించాడు.

"హుష్! ఏం ఆగాయిత్తెం చిన్నబాబూ! 'తదాస్తు దేవతలు' తిరుగుతూంటారు! ఊరుకోండి!" అని కసిరాడు చాంగాన్. రవంత ఆహారం లోపలికి దిగిన మీదట వాంగ్ పిన్‌కి కొంచెం సత్తువ కలిగింది. ఆ సాయంకాలం అతడు లేచి ఆగదిలోనే కొంచెం ఆహారం తీసుకున్నాడు. మరునాడు ఉదయం లేచి చక్కగా గడ్డంచేసుకొని, బట్టలు మార్చుకుని ఉపాహారాల బల్లదగ్గరకు స్వయంగా వచ్చి, తండ్రికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూచోటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

వంటవాడు ఆగదిలోంచి వెళ్ళిపోయి తండ్రి కొడుకు లిద్దరే ఉన్నప్పుడు వాంగ్ పిన్ తన ఉపాహారపు పరికరాలతో (కత్తి ఫోర్కులకు బదులుగా చైనా దేశస్థులు కొయ్యతోగాని, దంతంతోగాని చేసిన పరికరాలను ఉపయోగిస్తారు) ఆడుతూ కూచున్నాడు. ఆకస్మాత్తుగా, జ్యోతుల్లాగ ఉన్న కన్నులు విప్పి తండ్రి ముఖంలోకి చూస్తూ ఇలా అన్నాడు ;

"నాన్నగారూ! దయచేసి ఈ నా అఖరికోరిక శ్రద్ధగా వినండి, భగవంతుడు మనకు ఎంత ఆయుర్దాయం నిర్ణయించాడో, అంతకాలం తల్లి దండ్రు లిచ్చిన ఈ శరీరాలను మనం కాపాడుతూ ఉండాలనీ, లేకపోతే మళ్ళీ జన్మలో దానికి ప్రతిఫలం అనుభవించవలసి ఉంటుందనీ నాకు తెలుసు. నిన్నరాత్రి నేను చనిపోవడానికి నిశ్చయించుకున్నాను. ఏదైనా విషం తాగుదామనుకున్నాను. మళ్ళీ ఆత్మహత్య చేసుకున్నవాళ్ళు అష్టాదశ మహానరకాల్లో యమయాతనలు అనుభవించాలన్న విషయం జ్ఞాపకం వచ్చింది. నేను నరకానికి పోతే అక్కడ చిన్‌లీన్ నాకు కనుపించదు. అది అతి పవిత్రురాలు. ఉత్తమురాలు, కనుక స్వర్గంలో ఉంటుంది. అందుచేత ఈ విషయాలన్నీ ఆలోచించిన మీదట సన్యాసం స్వీకరించడానికి నిశ్చయించుకున్నాను,"

వాంగ్ కంగ్ చేతిలోని గంజిగిన్నెను ఆలాగే వదిలివేసి, నోరు తెరుచుకుని కొడుకుకేసి చూస్తున్నాడు.

"నాన్నా! దయచేసి ఈ శరీరానికి బంధవిమోచనం ప్రసాదించు. నేను పడమటి కొండలలో ఉన్న బౌద్ధసన్యాసా

శ్రమంలో చేరిపోదలచుకున్నాను. అక్కడికి స్వర్గము, నా చిన్ లీన్ కూడా ఇక్కడికన్న కొంచెం సమీపంలో ఉంటారని నా విశ్వాసం; అని మళ్ళీ గుక్క తిప్పుకోకుండా అనేశాడు.

వాంగ్ కంగ్ కి కొడుకు తత్వం బాగా తెలుసు. ఆత్మ హత్య చేసుకొనడానికన్న సన్యాసం పుచ్చుకొనడమైనా మేలే అనుకున్నాడు. చాలాసేపు మౌనంగా ఉన్న తరు వాత, "నాయనా! ఇదే నీ దృఢ నిశ్చయమైతే నేను అభ్యం తరం చెప్పను. కాని, ఆ ఆశ్రమంలో నీ జీవితం సుఖంగా గడపడానికి వీలుగా నన్ను కొంత డబ్బు మాత్రం పంప నియ్యి," అన్నాడు.

వాంగ్ పిన్ ఆందోళన చాలావరకు ఉపశమించింది. చివరికి అతడి హృదయంలో శాంతికి స్థానం దొరికింది. ఇక భగవంతుడి నుండి అతడు సమాశ్వాసం సంపాదించాలి.

తెల్లవారగానే తండ్రి కొడుకు లిద్దరు పడమటి కొండ లకు బయలుదేరారు. ఇరుగు పొరుగు వాళ్ళ నోళ్ళకు వెరచి వాళ్ళిద్దరు చెరొక రిక్షాలో ఎక్కారు. వాంగ్ పిన్ విలాస వస్తువులన్నీ వదిలివేశాడు. ఒక నీలపుధోవతీ మాత్రం కట్టుకొని, గుడ్డతో తయారుచేసిన పాదరక్షలు వేసుకున్నాడు.

ఆ రెండు రిక్షాలూ పడమటి కొండల మొగదల ఆగినవి. చిక్కి పాలిపోయి ఉన్న వాంగ్ పిన్ దిగాడు. తండ్రి తనయెడ చూపిన వాత్సల్యశ్రద్ధలకు కృతజ్ఞతా సూచకం గాను, ఆ వార్ధక్యదశలో ఆతణ్ణి విడిచిపెట్టి పోతూన్నందుకు

క్షమాభిక్ష నర్థించడానికీ వాంగ్ పిన్ మూడుసార్లు నేల కొరిగి తన తండ్రికి నమస్కరించాడు. పిమ్మట, చంకలో ఉన్న పుస్తకాల కట్టను గట్టిగానొక్కి పట్టుకొని, పైకి ఆపాల రాతి స్తంభాల వైపుకి ఎక్కిపోవడ మారంభించాడు.

పంచమ చాంద్ర మాసంలో ముప్ఫయ్యవరోజుకి, ఆ అడ శిశువుకు ఏడాదినిండింది. అప్పటికీ ఆ పిల్లకు నామ కరణం జరుగకపోవడం చాంగ్గాకు సంతాపం కలిగించింది. ఆరోజు ఉదయం భర్తదగ్గరకు వెళ్లి, "ఇలాసూడు! మన సిట్టి దొరసానమ్మకు బగమంతుడి దయవల్ల యేడాదినిండినా, ఇంకా పేరైనా పెట్టలేదు. పెద్ద దొరగోరు ఆ మాటే మరిసి పోయారు. ఈ యేలైనా ఈ సంగతి ఆర్ని అడుగుతే బాగుం టది. కాత్త దైర్రెంచేసి దొరగోరికి మనవిసేయగలవా?" అన్నది.

ఆ రోజున, ఉదయం ఉపాహారాలు వడ్డించిన తరు వాత చాంగాన్ మెల్లగా వినయవిధేయతలతో "దొర గోరూ! వెనుక ఇంట్లో నాయింటిది పెంచుతూన్న తమ మనుమరాలికి ఈ యేలతో ఫడాదినిండి రెండోయేడు కూడా వొత్తూంది. సిన్న దొరసానికి ఈ యేలయినా పేరు పెట్టిం చండి దొరా?" అన్నాడు.

అప్పటికి వాంగ్ కంగ్ ఉపాహారాల బల్లదగ్గరనుండి లేచి పోబోతున్నాడు. తనకోడలు మరణించీ, కొడుకుసన్యా సం పుచ్చుకునీ అప్పుడే సంవత్సరం అయిందన్న విషయం

జ్ఞాపకం రావడంతో ఆయన కళ్లు చెమ్మగిల్లినవి. గోధుమ వన్నె కన్నులను మెల్లగా పైకి ఎత్తి చాంగాన్ ముఖంలోకి సూటిగా చూస్తూ, ఇలా అరిచాడు : "ఏదో మీ ఇష్టం వచ్చిన పేరుతో పిలవండి! మీయిష్టం! పియావో-చెన్ (ధూళికణం) అని పిలవండి. దురదృష్టవంతురాలు! దాని పుటకే మావంశానికి మహాకష్టాలు తెచ్చిపెట్టింది. నువ్వు, నీభార్య దయదలచి దాన్ని శ్రద్ధగా పెంచుతున్నారు. మీరే పెంచుకోండి!"

పియావో చెన్ చాంగ్మా మనుమడు చాంగ్ టేతో పాటుగా ఆ నౌకర్ల ఇళ్లవద్దనే ఆడుకుంటూ క్రమంగా ఎదుగుతూంది. తన తల్లి, ముత్తవ తల్లుల ప్రేమలో పియావో చెన్ భాగం పంచుకోనడం చాంగ్ టేగాడికి కోపంగా ఉండేది. అందువల్ల అప్పుడప్పుడు వాళ్లిద్దరూ తగూలాడుకొనేవాళ్లు. ఆమె ఆ పిల్లవాడి ముఖం గోళ్లతో పీకేది. వాడు ఆ పిల్ల జడ పట్టుకులాగేవాడు. తక్కిన వేళల వాళ్లిద్దరూ బాగానే ఆడుకొనేవాళ్లు.

పియావో చెన్‌కి దాదాపు ఐదేళ్లు వచ్చిన మీదట, ఒక సాయంకాలం చాంగ్మా దీర్ఘంగా ఆలోచించి ఆలోచించి తనభర్త వద్దకుపోయి, "ఇలా సూడాశ! నీతో ఒక యిసయం సెప్పాలి. మనసిన్నదొరసానిని ఇకమీదట ఇలా నౌకర్ల ఇంట్లో పెంచగూడదు. ఆ బిడ్డ దొరలబిడ్డ. అంచేత పెద్దదొరగోరిదగ్గరే పెరగాలి. పైగా, పెద్దదొరకు, వొంటరి తనం వల్ల ప్రొద్దోవటం లేదన్న యిసయం నేను సాలా

కాలంనించీ కనిపెడ్తున్నాను. అంచేత దొరగోరు కూడా ఇప్పుడు ఒప్పుకుంటారనుకుంటాను,'' అంది.

చాంగాన్ తల ఊపి, "జానాను... కాని, దొర గోరితో యీయిసయం మాట్లాడడానికి సరైన సమయం (దొరికేదాకా) ఓపికపట్టు. ఈ మధ్యదొరకి కోపం బాగా ఎక్కువయింది,'' అన్నాడు.

అందుచేత, ఆ తరువాత కొన్నాళ్లకు చాంగాన్ తన యజమాని వాంగ్ కంగ్ మధ్యాహ్నవేళ విశ్రాంతి తీసు కుంటున్న సమయంలో మెల్లగా దగ్గరకువెళ్లి నమస్కరించి, గబాగబా ఇలా మాట్లాడేశాడు: "దొరగోరూ! తమరి మనుమరాలికి అయిదేళ్లు వచ్చేశాయి. ఇంక ఆమె మంచి శెబ్బరలు మీరు సూడాలి. దేవుడి దయవల్ల మాసిన్నదొర సాని రూపం, బుద్ధి కూడా బంగారం లాంటివి. ఈ మధ్యనే చిన్నదొరసాని నా మనుమడితో ఆడుకుంటూ, ఇద్దరూ పోట్లా డుకున్నారు. ఆ పోట్లాటలో నా యింటిది అమ్మాయిగోరికి నిజంగా అవ్వ కాదని ఆ యెదవ సెప్పేశాడు. దాంతో పాపం ఆ పసితల్లి గుండెతరుక్కుపోయేట్టు యేడ్చింది. దొరా! తమరు కోపగించుకోకుండా ఉంటే ఒక్కముక్క సెపుతాను,'' అని కొంచెం తటపటాయించి, "ఆ యమ్మని యీ ఇంటో ఉంచి, ఇక్కడే పెంచడం మంచిది దొరా!'' అన్నాడు.

ఈ మాటలు వినేటప్పుడు యజమాని వైఖరి చాంగాన్‌కి ఆశ్చర్యం కలిగించింది. ఆయన కోపగించుకో లేదు సరిగదా, విచారంతో తనకేసి చూస్తూ, "జానురా!

అవును. ఆ పసిది ఇక్కడే ఉండాలి. రేపు దాన్ని తయారు చేసి తీసుకు రమ్మని నీ భార్యతో చెప్పు. నువ్వు ఇంక వెళ్లి నా సవారీ కుర్చీ పంపించు,'' అన్నాడు.

ఆ మరునాడు ఉదయోపహారాల తరువాత పియాన్ చెన్ తాతగారికి నమస్కరించి, ఆ ముందు వాకిట్లో తిరుగుతూ ఆడుకోనడం ప్రారంభించింది. అదే ఆమె క్రొత్త ఆటస్థలం. నీలపు పింగాణీ చేపలకుండీని చూచేందుకు నెమ్మదిగా మెట్లు ఎక్కింది. కొంచెం సేపటికి చాంగ్మా బయటికి వచ్చి, ఒక కూజానిండా నీళ్ళుపోసి, ఆ నీటిని అక్కడ చుట్టూ పూతమీంద ఉన్న చామంతినుడుల మీంద చల్లమన్నది. ఆమె మొక్కలకు నీళ్ళు పోస్తూ ఉండగా, పియాన్ చెన్‌కి ఎవరో బాధతో పెట్టిన పెద్ద మూలుగు వినిపించింది. అది ఆమె తాతగారి ఆఫీసుగదిలోంచివచ్చింది. వెంటనే ఆమె భయంతో వణుకుతూ, చాంగ్మా చెంగుగట్టిగా పట్టుకుని, ''మనం ఇక్కల్నించి పోదాం పద! ఇక నేనిక్కల ఉండను బాబూ! ఆ తాత అందలినీ లోజూ ఊలికే ఏలిపిత్తాడని లే నాకు చెప్పాడు. ఒక్కొక్కప్పుడు వాళ్లు పాపం ఏలవటం కూడా మనకు వినపలుతుంది.'' అంది.

''లేదు సిట్టితల్లీ! మీం తాతయ్యగోరు ఎవరినిబాద మెట్టరు. అందరికీ సాయం సేత్తారు,'' అన్నది చాంగ్మా. ఇంతలో ఆమెకొక ఉజ్వలభావమేదో స్ఫురించింది. ''సూడు సిట్టిదొరసానీ! మనం లోపలకెల్లి మీం తాతయ్య గోరేం సేత్తున్నారో సూద్దామా?'' అన్నది.

"వద్దు! వద్దు! నేను లోపలికి లాను బాబోయ్! నాకు భయమేస్తుంది," అని వెనక్కులాగింది పియవ్ చెన్.

"అయ్యో! నా ఆణిముత్యం! నానుకూడా నీతో వత్తానమ్మా!" అంటూ చాంగ్మా భయపడుతూన్న ఆ పసిపిల్లను తనతో లాగుకొని పోయింది. నిజానికి ఆ కేకతో ఆ ముసలిదానికి కూడా కొంత భయం వేసింది. అయితే, లోపల ఏమిజరుగుతున్నదో చూడాలనే కుతూహలంకూడా ఆమెకు ఉంది. జాగ్రత్తగా, ఆ దళసరి ఎర్ర పట్టుతెర చీలికలమధ్య సందుచేసుకొని తల లోపలకు దూర్చి, "దొరగోరూ! చిట్టి దొరసాని మీ ఆపీసుగది సూడాలంటూంది," అంది.

"రా! లోపలికి తీసుకురా! అన్నాడు వాంగ్ కంగ్ సౌమ్యంగా.

చాంగ్మా ముందుగా పియూవ్ చెన్‌ని ఆ తెర చీలికల మధ్యనుండి లోపలికి నెట్టింది. ఆ పసిపిల్ల చురుకైన చూపు పుస్తకాల అరలలో ఒకదానిపైనించి మరొక దానిపైకి పరుగెత్తింది; తరువాత చుట్టూ గోడల నానుకొని ఉన్న పింగాణీ జాడీలపై ప్రసరించింది; చివరికి, తన తాతమీదికి మళ్ళింది. సౌమ్యంగా ఉన్న ఆయన ముఖం చూడడంతో ఆమె ఆందోళన పూర్తిగా ఉపశమించింది. పిదప, ఆ కేక వేసిన వ్యక్తిని కూడా చూచింది. అతడొక కుర్చీలో కూచుని ఎడమకాలు ఒక స్టూలు బల్లమీదసాచి ఉంచాడు. పియూవ్ చెన్ జాలిగా అతని వంకకు చూడటంతో అతడు

ఆమెతో ఇలా అన్నాడు : "ఇప్పుడంతా బాగయిపోయింది చిట్టితల్లీ ! నాకాలు ఎంతో నెప్పిపెడుతూ ఉండేది. ఆ బాధను భరించలేకపోయేవాణ్ణి. తాతయ్యగారు మందు ఇచ్చి నాబాధ చాలాభాగం తగ్గించారు."

అతడు ఆ విపరీతాసనానికి స్వస్తిచెప్పి, కాలుక్రిందికి దించుకొని లేచి నిలబడడానికి ప్రయత్నిస్తూ శ్రమపడుతూ ఉండడం చూచి వాంగ్ కంగ్ లేచి అతనివద్దకు వెళ్ళి చేయి ఆసరా ఇచ్చి లేవదీసి గుమ్మం దాకా సాగనంపి వచ్చాడు.

వాంగ్ కంగ్ వెనక్కి తిరిగివచ్చి, చాంగ్మా ఉపాయంగా పిల్లనక్కడ వదిలిపెట్టి వెళ్ళిపోయిన సంగతి గ్రహించాడు. ఆయన వెళ్ళి సొరుగు బల్లదగ్గరకూచుని, "షియావో చెన్ ! ఇలా రా అమ్మా ! చూశావా నా ఆఫీసు ? ఎలా ఉందో చెప్పు !" అన్నాడు.

ఆమె నమస్కరించి, "తాలా బావుంది తాతగాలూ! నేను లోజూ ఇక్కలికి లానా ?"

"తప్పకుండా రా అమ్మా !"అన్నాడు సంతోషంగా.

వారిద్దరు భోజనానికి వెళ్లినప్పుడు షియావ్ చెన్ తన అన్నపు పళ్ళెం తీసుకుని, తాతగారికి దగ్గరగా వచ్చి కూచుని, ఉత్సాహంగా మెరిసే కళ్లతో, "నేను మీా దగ్గల కూచోనా తాతగాలూ? ఆ చివల కూచుంతే చాలా దూలం," అంది.

తాత సంతోషంతో, "తప్పకుండా రా తల్లీ! రా! ఇంకా దగ్గరగా వచ్చి నాప్రక్కనే కూచో!" అన్నాడు.

పియావో చెన్ అసాధారణమైన తెలివితేటలు గలదని అనుదిన సంభాషణల్లో వాంగ్‌కంగ్ గ్రహించాడు. దాంతో ఆయనకు ఎంతో ఆనందం కలిగింది. ఆమె చదువుకి ఏదో ఏర్పాటు చూడాలని కూడా ఆయన అనుకుంటున్నాడు. ఇంటికివచ్చి చదువుచెప్పే ఉపాధ్యాయుణ్ణి పెట్టాలని నిశ్చయించాడు. కాని తనకు తీరుబాటు లేకపోవడం వలన, ఆ పని చూడమని చాంగాన్‌ని ఆదేశించాడు. మామూలుగా, ఎప్పటిలాగే చాంగాన్ ఈ సమస్యను వెంటనే తన భార్యకు నివేదించాడు: "ముసిలి! పెద్దదొరగోరికి మన మంటే ఒల్లమాలిన యిశ్వాసం. ఆరి మనమరాల్ని మనం పెంచాం. ఇప్పుడాపిల్ల సదువు సంగతి కూడా మన్నే సూడమన్నారు పెద్దదొర."

చాంగ్మా ముసిముసి నవ్వులు నవ్వుతూ, "ఇంతకీ మనసిట్టి దొరసానికి నిన్నే సదువు సెప్పమన్నారంటావా పెద్దదొర?– కొంపదీసి! అమాంబాపతు పట్టుమని పది ముక్కలైనా రావే నీకు!"

"ముసిలీ! నువ్వు నాతో ఎకసక్కాలాడడం కాదు. వచ్చని ఎవరన్నారేం? నాకు పదిముక్కలు కూడా రాని మాట ముమ్మాటికీ నిజమే, నేనేం పంతుల్నంటే నాకు వచ్చేటందుకి? ఊల్లో కెల్లి మంచి పంతుల్ని పట్టుకురావాలి," అన్నాడు.

నిజానికి దీనికి కూడా తనభార్య ఏదో మంచి ఉపాయం చెప్పగలదని అతడికి తెలుసు. అందుచేత, ఆమె వెంటనే అందుకొని, "అలాంటి పంతుల్ని నాకు తెలుసులే. మన పిల్లోడికి ఉత్తరాలు రాసిపెట్టే పంతులు లేడూ! ఆయనంత మంచోడు లేనేలేడు!" అంది.

చదువు మొదలుపెట్టేరోజున ఉదయోపహార సమయంలో షియావ్‌చెన్ ఉత్సాహానికి మేరలేదు. తినపని పూర్తికాగానే చాంగ్మా దగ్గరకు పరుగెత్తి, "నాయ్! నాయ్! మా పంతులుగారేరీ? వచ్చేశారా?" అని ప్రశ్నించింది.

మొదటినెల జీతంతో అవీ ఇవీ కొనుక్కోడానికి వెళ్లి ఉంటాడు," అంది చాంగ్మా. (ప్రైవేటు మేష్టరుకి నెల ముందుగానే జీతం ఇవ్వడం ఆరోజుల్లో ఆచారం.)

ఒక గంట కష్టంమీద గడచిన తరువాత, ఒక్క పలచని ఒక వ్యక్తి మధ్య చావడిలోకి వచ్చాడు. వెంటనే చాంగాన్ ఆయనను వీధిగదిలోకి తీసుకువెళ్ళాడు. ఈలోగా చాంగ్మా షియావ్‌చెన్ చేయిపట్టుకొని వాళ్ల వెంట తీసుకు వెళ్లింది.

పంతులు నీలపు రంగుగుడ్డ దస్త్రంవిప్పి పలచని కాగితపు పుస్తకం ఒకటితీసి షియావ్ చెన్‌కి చూపించాడు. అది మొదటి వాచకం. అందులో ఒక మనిషి బొమ్మ ప్రక్కన వ్రాసి ఉన్న అక్షరాలను వ్రేలుతో షియావ్‌చెన్‌కి

చూపించాడు. ఆ మాట "జెన్" అని చెప్పాడు. ఆ పిల్ల కూడా ఆ మాటను ఉచ్చరించింది. తరువాత అలాగే, మరి రెండుమాటలను ఆయన చూపించాడు. "సో" అనే మొదటి మాట ప్రక్కన చేయిబొమ్మ వేసి ఉంది. అలాగే "చియావో" అనేమాటి చదివి ప్రక్కనున్న కాలిబొమ్మ చూపించాడు. తరువాత ఈ మూడు పేర్లు వ్రాసిన ఒక తెల్ల కాగితాన్ని ఆమె ముందుపరచి, ఆమె కొక కుంచెయిచ్చి ఆ మాటలనుచూచి అలానే క్రింద వ్రాయమన్నాడు.

మధ్యాహ్నం వాంగ్ కంగ్ తన కచేరీపనులు ముగించుకొన్న పిదప, షియావోచెన్ పరుగెత్తుకుంటూ తాతగారి దగ్గరకు వచ్చి, "నాకు చదవడం, వ్రాయడం కూడా వచ్చేసింది," అని అమితానందంతో చెప్పింది. చెప్పి, ఆయన జవాబుకోసం ఆగకుండా, తాతగారి కుంచె ఒకటి తీసి, ఆయన రోగులకు చికిత్సాప్రక్రియ వ్రాసియిచ్చే ఒక తెల్ల కాగితం తీసుకుని, ఆ రోజున తాను నేర్చుకున్న మూడు మాటలూ వ్రాసేసింది. అక్షరాలు అందంగా లేకపోయినా, స్పష్టంగా తెలుస్తున్నవి.

అమితానందంతో వాంగ్ కంగ్ ఇలా అన్నాడు : "నువ్వు ఎంత చదువు చదువుకోగలిగితే అంతా నేను చెప్పిస్తానమ్మా, నువ్వు మా వాంగ్ వంశంలో ఉన్నంతవరకు నీ యిష్టం వచ్చినంత చదువు చదువుకోవచ్చు."

ఒక రోజున షియాలో చెన్ తన తలను చాంగ్మా తొడమీద ఆన్చి, "నాయ్! నాయ్! నాతలలో నెప్పి పుడుతూంది," "అంది. చాంగ్మా ఆమె కణతలపైన చేయి పెట్టి చూచింది. వేడిగా మసిలిపోతూంది. వెంటనే ఆ బిడ్డ దుస్తులను విప్పి, మంచంమీద పరుండబెట్టి గబగబా మందు గొడ్డిలోంచి పరిగెత్తింది. "ఇదిగో ఇలా చూడు! పెద్దదొర ఏడ ఉన్నారు? - చిట్టి దొరసానికి జ్వరం తగిలింది", అన్నది తొందరగా ఆయాసపడుతూ.

వాంగ్ కంగ్ రోగులనుచూచి రావడానికి వాళ్ళ ఇళ్ళకు వెళ్ళాడు. ఆ సమయంలో ఆయన ఎక్కడ ఉండేదీ నిజానికి ఆ నౌకర్లెవరికీ తెలియదు. కాని, చాంగాన్ తన అజ్ఞతను నగ్నంగా వెల్లడించలేక, "దొర ఇప్పుడో ఇంకాసేపటికో వచ్చేస్తారు," అన్నాడు.

చాంగ్మా చేతులు నలుపుకుంటూ, మళ్ళీ వెనక్కి పరుగెత్తుకుపోయింది. హేమంత ఋతువైనా ఆనాటి అపరాహ్ణం చాలా వేడిగాఉంది. ఆమె కిటికీలన్నీ మూసివేసింది: బరువైన బూర్నీసు తెచ్చి కప్పింది. పెద్దగేటు తెరుచుకోనగానే, ఆమె మళ్ళీ పరుగెత్తింది. సవారీ కుర్చీని లోపలికి తీసుకువచ్చి దించారు. వాంగ్ కంగ్ దాంట్లోనించి బయటికి అడుగుపెడుతూనే, "షియాలో చెన్ ఏదీ?" అని ప్రశ్నించాడు. "ఆమెకు సుస్తీసేసింది బాబూ! మీకు మనవిసేసి పిలుసుకెళ్ళడానికే వొచ్చాను," అన్నది చాంగ్మా.

ఆయన, క్రిందదాకా వ్రేలాడే తన గౌనును పైకి ఎత్తిపట్టుకొని, త్వరత్వరగా పడక గదివంకకు నడిచాడు. షియావోచెన్ నిద్రపోతూంది. కాని, ఆమె ముడుచుకొని, విశాలమైన ఆ ప్రక్కమీద ఇటూఅటూ దొల్లిగింతలు పెడుతూంది. ఆమె కుడిచేయి పట్టుకొని నాడి పరీక్షించాడు. ఎడమచేతి నాడికూడా చూచాడు. తరువాత మెల్లగా "చిట్టిముత్తెం! నోరు తెరు తల్లీ!" అన్నాడు. ఆమె ఒక్క క్షణం కళ్ళు విప్పి, వినపడీ వినపడనట్టుగా "తాతా!" అని, మళ్ళీ కళ్ళుమూసి కలత నిద్రపోతూంది.

వాంగ్ కంగ్ విచారంగా చాంగ్వావంక చూచాడు. "ఈమెకు ఏమి జబ్బో నేను చెప్పలేను. ఈమెకు నేను వైద్యం చేయలేను. వెంటనే వెళ్ళి వైద్యుడు లికాయ్‌ని తీసికొని రమ్మని వాళ్ళతో చెప్పు," అని ఆదేశించాడు.

లికాయ్‌కూడా వాంగ్ కంగ్‌లాగే పెద్దపేరుగల వైద్యుడు. కాని, ఈ డాక్టర్లిద్దరికీ పరస్పర స్పర్ధలులేవు. సరికదా వారిద్దరు మంచిస్నేహితులు. చాలాసారులు వాంగ్ కంగ్ లికాయ్ కుటుంబంలోని వారికి వైద్యంచేశాడు. కనుకనే ఇప్పుడు తన మిత్రుని సహాయంకోరి, కబురంపాడు.

లికాయ్‌వచ్చి పిల్లను పరీక్షచేసి, గడ్డంమీద బొటనవ్రేలితో కొట్టుకుంటూ ఇలా అన్నాడు: "మీమనుమరాలికి బాగా సుస్తీ చేసిందండి. గర్భకోశంలో వ్యాధి ప్రకో

పించింది. పేగుల్లో ఆహారపదార్థం క్రుళ్లి విషతుల్య మయింది. ఈ వేళనించి ఆమెకు ఉప్పు, మన్నూ వేసి కాచిన వేడినీళ్లూ తప్ప ఆహారమే మీా ఇవ్వవద్దనండి.''

పియూవోచెన్ దగ్గరఉండి సహాయపడటానికిగాను వాంగ్ కంగ్ తాను ఇంకా వెళ్ళవలసియున్న రోగుల ఇళ్ళకు వెళ్ళడం మానుకున్నాడు. మూడురోజులు ఆమెకు జ్వరం పెట్లిపడిపోయింది. పిమ్మట, క్రమంగా ఒళ్ళు చల్ల బడింది. ఇంచుమించు ఎడతెగకుండా విరోచనాలు అవు తున్నవి. చాంగ్మా ఒక్క క్షణంకూడా ఆమె మంచం దగ్గరనుండి కదలకుండా సకలోపచారాలూ చేస్తూంది. తొలి సారి విరేచనంలో రక్తం కనిపించినప్పుడు ఆమె నిస్పృ హతో ఇలా అనుకుంది. ''అయ్యో నా ఆణిముత్యమో! అన్నం ముట్టి ఎన్నాళ్ళయిందో మా తల్లి! పైగా రక్త మాంసాలుకూడా వెళ్ళిపోతున్న వ్యేమిటి నా చిట్టి తల్లి!''

ఈ విషయం వాంగ్ కంగ్ తో చెప్పేసరికి ఆయన భయం మరింత హెచ్చిపోయింది. ''లీ చీ...(గ్రహణి) వ్యాధే పట్టుకుంది,'' అని నిట్టూర్చాడు. పియూవోచెన్ క్రమంగా నీరసించి పోయింది. ఒకరోజున చాంగాన్ ఆ గదిలోకి వచ్చేసరికి, చాంగ్మా తన భర్తకు ఎదురుగా పరుగెత్తి, వెక్కి వెక్కి ఏడుస్తూ, ''అయిపోతూంది, మన చిట్టి గారసాని కూడా వెళ్లి పోతూంది.'' అని యేడ్చింది.

అలాంటి మాటలు తన మనుమరాలి చెవిలోపడటం వాంగ్ కంగ్ కి ఎంతమాత్రం ఇష్టంలేక పోవడంవలన, ఆమె

శివాలను అరికట్టడానికిగాను లాగి చెంపమీద ఒక్కటి పెట్టాడు. వెంటనే, తానే ధైర్యంచెడి, మంచం ప్రక్కన మోకాళ్లమీద కూలబడి ఒళ్లంతా ఒణుకుపుట్టేవరకు విలపించాడు.

యజమాని వివశుడై యుండటం చూచి, చాంగాన్ ముందుకివచ్చి, ఆయనను లేవదీసి కుర్చీలో కూచోబెట్టాడు. పిమ్మట క్రిందకంటా వంగి నమస్కరించి ఇలా అన్నాడు: "దొరగారూ! నేను తమకు చెప్పగలోణ్ణి కాను గాని, నా ప్రార్థన ఒక్కటి ఆలించండి దొరా!" - అంటూ, ఆపైన చెప్పడానికి కొంచెం నసిగి, "మన సిట్టి దొరసానమ్మని ఇప్పుడే ఆ తెల్ల డాకటేర్ల ఆసుపత్రికి తీసుకెల్దాం పదండి. ఆళ్ళు సిన్నమ్మాయిని బతికించగలరేమో అని నాకు కొండంత ఆశగా ఉంది దొరా!" అని ధైర్యంచేసి గబగబా ప్రకరువు పెట్టాడు.

నాంగ్ కంగ్ కోపంతో తలయెత్తి చూశాడు. "ఆ విదేశీవాళ్ల ఆసుపత్రికా?" అని గర్జించాడు. "నామనుమరాల్ని అక్కడికి తీసుకొని వెళ్ళడానికి వీల్లేదు! చావుతప్పక పోతే, ఇక్కడే చచ్చిపోతుంది."

షియావో చెన్ కి స్పృహ బాగానే ఉంది. ఈమాటలన్నీ వింటూంది. అయితే, మాట్లాడడానికి మాత్రం ఓపిక లేదు. పెదిమలు గంట్లు గంట్లుగా పగిలినవి. నోరు ఆరిపోయి, పొడిగా ఉంది. నాలిక జిగురుపామినట్లుంది. అక్కడ

ఉన్న పెద్దవాళ్లు ముగ్గురిలో చాంగాన్ ఒక్కడే స్వస్థచిత్తుడుగా కనిపిస్తున్నాడు. మళ్లీ చివరిసారి, నిస్పృహతో ఇంకొక ప్రయత్నం చేయడానికి నిశ్చయించుకొని, షియాంగ్ చెన్ మంచం ప్రక్కకు వెళ్లి, మెల్లగా "సిస్టెమ్మా! నీకు బతకాలని ఉందామ్మా? ఆ తెల్లవాళ్ళ ఆస్పత్రికి తీసుకెళ్ల మన్నావా తల్లీ!" అని అడిగాడు.

ఆమె నీరసంగా తల ఊపింది. వెంటనే చాంగాన్ సంతోషంతో అరిచాడు! "చూశారా దొరగారు? సిస్టర్ దొరసాని అక్కడికి వెళ్లాలంటూంది. ఇది ఆమె ప్రాణంతో పని. ఇప్పుడు ఆమె కావాలంటూన్న దాన్ని కాదనే హక్కు మనకు లేదు!" అని అరిచాడు.

వాంగ్ కంగ్ తన మనుమరాలి చేయి తన చేతిలోకి తీసుకొని మెల్లగా ఊపుతూ, "నా రత్నం! నిజంగా నీకా విదేశీ ఆసుపత్రికి వెళ్ళాలని ఉందా తల్లీ?" అని అడిగాడు. ఆమె తాతగారి ముఖం వంకచూస్తూ కష్టంమీద, "వెళ దాం," అంది.

వెంటనే నౌకర్లు వంటింటికి తాలూకు ఒక తలుపును ఊతకలె త్తి తీశారు. చాంగ్మా ముదురు ఎరుపురంగు పట్టు రజాయి ఒకటితీసి మడతపెట్టి దానిమీద పరిచింది. వాంగ్ కంగ్ ఆ పిల్లను మెల్లగా తీసి ఆ మెత్తమీద పడుకోబెట్టి మరొకపట్టు రజాయి కప్పాడు.

చాంగాన్ ముందు నడుస్తున్నాడు. మరి నలుగురు

నౌకర్లు ఆమెను మలుపులు తిరిగే వీధులవెంట విదేశీ ఆసుపత్రి గేటుదగ్గరకు తీసుకుపోయారు. కొత్తగా గంజిపెట్టి, నునుపుచేసిన తెల్లని దుస్తులు, తెల్లనిటోపీ ధరించిన ఒక తెల్లనర్సు గేటు దగ్గర ప్రత్యక్షమయింది. చాంగాన్ రక్తం ఉడుకెత్తి పోయింది. ఈ మనిషి దుఃఖసూచకమైన ఈ తెల్లదుస్తులు ధరించి రావడం అతడికి చాలా కష్టం కలిగించింది. తెల్లదుస్తులంటే దుఃఖసూచకములనే అతడికి తెలుసు. రోగి చనిపోయేవరకు ఎర్రదుస్తులు ధరించడం సంప్రదాయంగాని, ఈ అఘాయిత్యమేమిటా అని అతడు తెల్లబోతున్నాడు. ఆ నర్సు ఎదురుగా వచ్చి జాలిగా నవ్వుతూ, "ఈ పసిబిడ్డ మీబిడ్డా?" అని ప్రశ్నించింది.

ఈ విదేశ స్త్రీ చైనాభాషకూడా మాట్లాడాగలదని తెలియడంతో చాంగాన్ ఆందోళన కొంత తగ్గింది. దాంతో, "మా బిడ్డకాదు కానీండి; - మా బిడ్డ అయినా నేనూ నా భార్య ఈ బిడ్డకోసం ఇంతకన్న ఎక్కువ ఆరాట పడేవాళ్లం కాదులెండి. దయచేసి ఈ పాప ప్రాణం రక్షించండి!" అన్నాడు.

చాంగాన్ వెంటనే వెళ్ళిపోయాడు. పియావో చెన్‌కి ఆసుపత్రి దుస్తులు తీసుకురావడానికి వెళ్ళిన నర్సు తిరిగి వచ్చేసరికి అతడు వెళ్ళిపోవడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. కాని, ఆ పాప తీవ్రవ్యాధిగ్రస్తురాలై ఉండడం వల్ల, వెంటనే చాంగాన్‌ని మరచిపోయి, ఆమె దగ్గర కూచుని

ఆమె ఎర్రపట్టు అంగీని, లాగూను విప్పివేసి, వళ్లు కడిగి, తెల్లని నూలు గౌనొకటి తొడిగింది. కొన్ని నిముషాలకు, తెల్లని నూలు గౌనొకటి తొడిగింది. కొన్ని నిముషాలకు, బాగా ఒడ్డుపొడుగు ఉన్న ఒక్క తెల్లదొర వచ్చాడు. అతడికి దుబ్బు జుట్టూ, నిండుగడ్డం ఉన్నవి. ఆయన షియావో చెన్ మంచంవద్దకు వచ్చి, జేబులోంచి ఒక వైద్యపరికరం తీసి, దాన్ని ఆ పసిపిల్ల రొమ్ముమీద పెట్టి, రెండో కొన చెవులో పెట్టుకొని విన్నాడు. విని, తల ఊపాడు. నర్సు కూడా తల ఊపింది. వాళ్లిద్దరూ కూడా వెంటనే అక్కణ్ణించి వెళ్ళిపోయారు, కాని ఎండుగడ్డిరంగు ద్రవంతో నిండి ఉన్న పెద్దసీసా ఒకటి తీసుకొని మళ్ళీ వెంటనే తిరిగి వచ్చారు. ఆ సీసాను ఒక ఎత్తైన యినుప స్తంభానికి కట్టారు. పిమ్మట వాళ్లు ఆ పిల్ల చేతిలో ఒక చిన్నరంధ్రం చేసి, చిన్నగొట్టం ద్వారా ఆ సీసాలోని ద్రవం మెల్లగా ఆమె శరీరంలోకి ప్రవహించేలాగా చేసినట్టున్నారు. భయగ్రస్తులైన చుట్టుప్రక్కల రోగులు ఇదంతా వింతగా చూస్తున్నారు.

ఆపైన ప్రతిదినం ఆ డాక్టరు, నర్సూ వచ్చి ఆ పెద్ద సీసాను మళ్ళీ అలాగే స్తంభానికి తగిలించి అదేవిధంగా చేస్తున్నారు. ఈ ద్రవం ప్రభావం వల్ల త్వరలోనే షియావో చెన్ ఎండురోగం తిరుగు ముఖం పట్టింది. గ్రహణి వ్యాధి అరికట్టబడగానే, ఆమె చురకుగా కోలుకొనడం మొదలు పెట్టింది. కొన్నివారాలు గడిచేసరికి, చాంగాన్‌కి కబురు పంపారు. విజయోత్సాహంతో అతడు పిల్లను ఇంచుమించు సంపూర్ణ ఆరోగ్యస్థితిలో ఇంటికి తీసుకువచ్చాడు.

పియావో చెన్ చదువు మొదలుపెట్టి ఒక సంవత్సరం దాటింది. ఆమె తెలివితేటలకు ఒక్క పంతులు చాలడని ఆమె తాతగారు నిశ్చయించాడు. మళ్ళీ ఈ విషయమై చాంగాన్‌తోనే సంప్రదించాడు. "దీనికి మగ పిల్లలతో సమానంగా ఎంత చదువైనా చెప్పించదలచుకున్నానురా!" అన్నాడు.

చాంగాన్ వంగి నమస్కరించాడు. "దొరగోరు! అమ్మాయి చాలా తెలివైన వోరని పంతులుగారు నాతో ఏనోన్నసార్లు సెప్పారండి. దాంతో, అమ్మాయిగోర్ని ఆ విదేశీ స్కూలుకు పంపితే బాగుండును; బోలెడు చదువొచ్చును, – అని ఈ మధ్యనే నేను అనుకున్నాను దొరగోరు!" అన్నాడు. వాంగ్ కంగ్ ముఖం కోపంతో గీసిన కందగడ్డ అయిపోయింది. ఆయన నుదుటి మీది రక్తనాళాలు పైకి ఉబికినవి.

"నువ్వా తెల్లవాళ్ళ వెనక తోకాడించే కుక్కలాంటి వాడివి! వాళ్ళంటే నీకీ పిచ్చి మోజు ఎందుకో నాకర్థం కావటంలేదు. కొన్ని వందల ఏళ్ళుగా ఈ తెల్లవాళ్ళు మన దేశంపైన దాడిచేసి, కొల్లగొట్టి, మన ఐశ్వర్యమంతటినీ తమ దేశాలకు చేరవేసుకుంటున్నారని నీకు తెలియదూ? మొదట పోర్చుగీసువారీ దేశంలో అడుగుపెట్టినప్పటినుండీ మన సముద్రతీరం పొడుగునాడున్న ప్రతి పట్టణం యుద్ధాలకు, ముట్టడులకు చిత్రహింసలకు గురి అయింది." అంటూ

ఇంచుమించు ఆయాసంతో ఊపిరాడని స్థితి ఏర్పడే వరకూ అరిచాడు.

చాంగాన్ నోరు మెదపలేదు. మొదట నినాన ముద్ర దాల్చిన తరువాత, విచారంతో తల ఊపి, " విదేశీయులు మంచోళ్లుకారనే మాట సత్తెమే దొరా? కాని అమెరికా వోళ్ళు మనదేశంమీద దెబ్బతీయడంకాని, మన దేశంలో కొంతనేల ఆళ్ళకి కావాలని వశంచేసుకోవడం గాని, ఎన్నడూ సెయ్యలేదు గద! నిజానికి మన సిన్నదొర సానిని ఆళ్ళుకాదూ దొరగోరూ కాపాడింది?" అని ధైర్యంగా జవాబు చెప్పాడు.

వాంగ్ కంగ్ మరికొంత ప్రశాంతంగా ఇలా అన్నాడు: "ఔను, ఆ మాటనిజమే. నా చిట్టిముత్యం ప్రాణాలు వాళ్ళే కాపాడారు. ఎలా కాపాడారో ఇప్పటికీ నాకు బోధపడలేదురా!"

తన అభిప్రాయన్ని ఆయనకు నచ్చచెప్పడానికి ఇదే సమయమని చాంగాన్ తొందరగా, "అంచేత దొరా! మన అమ్మాయిగోరిని ఆ అమెరికా వోళ్ళ న్కూలుకే పంపుదాం దొరగోరూ!" అన్నాడు. దాంతో, "వీల్లేదు" అని అరిచాడు వాంగ్ కంగ్. ఆ అరుపు, – అదే ఆయన తిరుగులేని చరమ నిర్ణయం అన్నంత తీవ్రంగా ఉన్నందు వల్ల, చాంగాన్ వెంటనే వంగి నమస్కరించి, విచారంతో కుంగిపోతూ వెనక్కి వెనక్కి నడుస్తూ వెళ్లిపోయాడు.

కాని, వాంగ్ కంగ్ ఈ సూచనను గురించి తరువాత చాలాసార్లు ఆలోచించాడు. ఆలోచించినకొద్దీ చాంగాన్ సూచన అతడికి సమంజసంగా కనిపించింది. చివరికి, మనుమ రాల్ని అమెరికా మిషనరీ స్కూలుకి పంపడానికే ఆయన నిశ్చయించాడు. షియూహ్ చెన్‌ని ఆడపిల్లలకోసం అమెరి కన్ మెథాడిస్ట్ మిషన్ వాళ్లు ప్రత్యేకంగా పెట్టిన మూచెన్ స్కూలులో ఐదో తరగతిలో చేర్చారు. అచిరకాలంలోనే షియూహ్ చెన్ ఆ స్కూలు పద్ధతులకు అలవాటుపడింది. అప్పైన ఆమెకు అక్కడ సరదాగానే ఉంది. అసాధారణ మైన వివేకము, ధారణాశక్తి ఉండడంవల్ల ఆమె చురుకుగా పై క్లాసుల్లోకి వెళ్ళిపోయింది. ఇంటినద్ద చేయవలసిన హోం వర్కు అంతా పూర్తిచేయడానికి ఆమెకు ఒక గంటకంట ఎక్కువ పట్టేదికాదు.

శీతకాలంలో ఒకనాటి ఉదయం ఆ స్కూలులోని ప్రార్థన మందిరంలో, రోజూ జరిగే కార్యక్రమాన్ని అను సరించి, ఉపాధ్యాయినులలో ఒకతె అయిన మిస్ బీర్ ఒక సందేశం యిచ్చింది. మానవులంతా మట్టితో చేయబడ్డా రన్నదే ఆమె సందేశసారం అని షియూహ్ చెన్ గ్రహిం చింది. షియూహ్ చెన్‌కి ఎంతో ఆనందం కలిగింది. "చాలాకాలం క్రిందటే మాతాతగారు నాకు ధూళిరేణువని పేరు పెట్టారు. మిస్ బీర్ కూడా సరిగా అలాంటిమాటే చెప్పిం దని తాతయ్యతో చెప్పాలి!" అనుకుంది.

• ప్రార్థన కార్యక్రమం పూర్తిఅయిన తరువాత

షియాహోచెన్ వెలుపలికి రాబోతూవుండగా, ఆమెకెవరో ఒక చిన్న కాగితం తీసుకువచ్చి ఇవ్వడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. ఆ స్కూలు ప్రిన్సిపాలు షియాహోచెన్‌ను తనగదికివచ్చి కనబడవలసినదిగా కోరుతున్నట్లు ఆ ఉత్తరం తెలియజేసింది. ఆమెకు భయంవేసింది. ప్రిన్సిపాల్ కచేరీకి హాజరవవలసినదిగా చీటీ రావడమంటే, చాలా భయపడ వలసిన విషయమైనట్టు లోగడ ఇతర విద్యార్థులు చెప్పారు. ఈ విధంగా అప్పటికి నలుగురు బాలికలకు చీటీలు వచ్చినవి. ప్రిన్సిపాల్ హ్యూటన్ షియాహోచెన్‌ని దగ్గరకు పిలిచే టప్పుడు ఆమె ముఖమంతా కోపంతో ఎర్రబడిపోయింది. ''షియాహోచెన్! ప్రార్థన సమయంలో నీవు కళ్లు తెరచి చూచావా లేదా?'' అని ప్రశ్నించింది. ఇంతవరకు ప్రిన్సిపాల్ ఇలా కోపపడినప్పుడు పిల్లలెవరూ జవాబు చెప్పి యెరుగరు. కాని షియాహోచెన్ మాత్రం జంకుకొంకు లేకుండా, ''ఆసంగతి మీకెలా తెలుసు?'' అని అడిగింది. ''స్వయంగా నాకళ్ళతో నేను చూచాను,'' అని జవాబు చెప్పింది ప్రిన్సిపాలు. ఆమె ముఖం ఇప్పుడు మరీ యెర్ర బడిపోయింది. ''నే నడుగుతూన్నది నువ్వు కళ్లెందుకు తెరిచా వని!'' అని మళ్లీ గద్దించింది.

''మీరు కళ్లు తెరిచి చూస్తున్నారో లేదో చూద్దా మని నేను కళ్లు తెరిచాను,'' అని షియాహోచెన్ మెత్తగా జవాబు చెప్పింది.

మిస్ హ్యూటన్‌కి ఆపైన ఏమనడానికీ తోచలేదు. గదిలోంచి లేచి బయటకు వెళ్ళి మిసెస్ డాన్ అనే ఆ స్కూలు మాట్రనును పిలుచుకు వచ్చింది. "ఈ పిల్లను తీసుకుపోయి ఆమె గదిలోకి నెట్టి తలుపు తాళం వేయించు!" అని ఆజ్ఞాపించింది మిస్ హ్యూటన్.

పియూవోచెన్ వినయభావంతో పిల్లల విశ్రాంతి స్థావరాలవంకకు నడచివెళ్ళింది, దారిలో మిసెస్ డాన్ జాలిగా యిలా అంది: ఏమీ భయపడకు. ఆమె కోపం ఎక్కువసేపు ఉండదు. మళ్ళీ వెంటనే మరచిపోతుంది." "నన్ను ఆమె ఎందుకు శిక్షిస్తున్నారో యిప్పటికీ నాకు తెలియదు. ప్రార్థనసమయంలో నాలాగే ప్రిన్సిపాల్ గారు కూడా కళ్లు తెరిచారుగా!" అన్నది పియూవోచెన్.

మొదటిక్లాసు అయిపోయిన తరువాత మిసెస్ డాన్ మళ్ళీ పియూవోచెన్ గదికి వెళ్ళి, "యిక నువ్వు లేచి దుస్తులు వేసుకొని బయలుదేరు. మిస్ హ్యూటన్ నిన్ను క్షమించారు. ఇంకెప్పుడూ, ఆమె ఏమన్నాసరే ఎదురు జవాబు చెప్పకు," అని హెచ్చరించింది.

ఆరాత్రి వారు నిద్రపోయే సమయంలో మీ డిన్ మెల్లగా అడిగింది: "నిన్ను ప్రిన్సిపాల్ ఎందుకు శిక్షించిందో నాకు చెపుతావా?" "ప్రార్థనసమయంలో నేను కళ్లు తెరిచాను," అని జవాబుచెప్పింది పియూవోచెన్.

"ఇంతేగద! నువ్వుకూడా చంగ్ కాంగ్‌లాగ కుర్ర.

వాడికెవడికైనా ఉత్తరం వ్రాశావేమో అని భయపడ్డాం మేమందరం. అప్పటినించి చంగ్ కాంగ్‌తో మేమెవ్వర్లం మాట్లాడడం లేదు,'' అంటూ ఆమె సంతృప్తిగా నిట్టూర్చింది.

'' నేను అలాంటి పనులు ఎన్నడూ చేయను. మా తాతగారు నాకు మంచిమంచి నీతులు నేర్పారు,'' అని సగర్వంగా జవాబు చెప్పింది పియావో చెన్.

నెలలో చిట్ట చివరి శనివారం అందరికీ ఉత్సాహకరమైనరోజు. ఆరోజున పిల్లలంతా తమ యిళ్లకు వెళ్లవచ్చును. ఆ క్రిందటిరాత్రి పియావో చెన్‌కి ఇంచుమించు నిద్రపట్ట లేదు. మధ్యాహ్నభోజనం అవగానే ఆబాలికలంతా ఇళ్లకు పోవడానికి మూటలు కట్టుకోనడం మొదలుపెట్టారు. పియావో చెన్ తనవ్రాసిన గుడ్డలన్నీ ఒక ఎర్రగుడ్డలో చుట్టబెట్టి, వరండాలోకి పోయి ఎదురుచూస్తూంది. మామూలులాగే, ఆఫీసులో అనుమతిపత్రం తీసుకొని లోపలికివచ్చిన మొదటివ్యక్తి చాంగ్మా పియావో చెన్ వద్దకు పరుగెత్తుకుంటూవచ్చి, ''రా! నా ఆణిముత్యం! నీకోసం సవారీకుర్చీ తీసుకువచ్చానమ్మా! బయలుదేరు!'' అంది.

ఈవేళ వాంగ్ కంగ్, సంవత్సరాది రోజున సాయంకాలం పిల్లవాళ్లవలె అత్యానందంలో ఉన్నాడు. మధ్యాహ్నం భోజనం కాగానే తన హుక్కాగొట్టం పట్టుకొని సావడిలోకి వెళ్లికూచున్నాడు. మనుమరాలు యింటికిరాగానే తనకంట బడటానికి వీలుగా వీధి తలుపు వారవాకిలిగా తీసి

పెట్టాడు. గేటు తెరుచుకోసగానే ఆయన ఆ దివాణపు యజమానిగా తన దర్జా, ఆభిజాత్యం అన్నిటికీ స్వస్తిచెప్పి బయటకు పరుగెత్తాడు. వెంటనే నౌకర్లంతా తప్పుకొని వెళ్లిపోయారు. తాతా, మనుమరాలు మాత్రమే మిగిలారు.

"ఇల్లారా తల్లీ! నిన్ను ఒక్కసారి దగ్గరగా చూడాలి," అన్నాడు వాంగ్‌కంగ్. "చిక్కిపోయి నట్టున్నావే! అక్కడ ఆహారం మంచిది ఇస్తున్నారా? నీకు తప్పకుండా మంచి ఆహారమే ఇవ్వాలి! అందుకోసం నేను వాళ్లకు కావలసినంత డబ్బు పంపుతున్నానే!" అన్నాడు.

పియావోచెన్ చిన్న స్టూలుబల్ల తెచ్చుకొని తాతగారి సోఫాప్రక్కన వేసుకు కూచుని, ఆయన హుక్కాకు నిప్పు ముట్టిస్తూంది.

"చెప్పమ్మా! ఈ నెలలో మీ స్కూలులో ఏమి జరిగిందో చెప్పు," అన్నాడు.

"ఈనెల విశేషాలు మీకు చెప్పాలని ఎప్పటినించో ఎంతో సంతోషంగా ఎదురుచూస్తున్నా తాతయ్యా!" అన్నది పియావోచెన్.

ఆమె చెప్పినవన్నీ విన్నమీదట ఆయన గొంతు సవరించుకొని ఇలా అన్నాడు: "చూడు తల్లీ! నువ్వు చైనా దేశపు బిడ్డవని, అందులో వాంగ్‌వంశపు బిడ్డవని నిరంతరం జ్ఞాపకముంచుకోవాలి! ఆ దేశస్థులు చెప్పేవాటిలో మంచి విషయాలన్నీ నేర్చుకో మిగిలినవన్నీ అక్కడే మరిచిపో.

మన సంస్కృతి వాళ్ల సంస్కృతి కన్న చాలా ప్రాచీనమైన దనీ, వాళ్లుకూడా మనదగ్గర నేర్చుకోవలసిన విషయాలు చాలా ఉన్నవనీ జ్ఞాపకం ఉంచుకో.''

* * *

ఆ వేసవి సాయంకాలం చాలా ఉక్కగా ఉంది. వంట మనిషి, ఒక చిన్న మేజాబల్ల తెచ్చి మధ్య సావడిలో ఉన్న పింగాణీ గిన్నె ప్రక్కగా వేశాడు.

వాంగ్ కంగ్ రోగుల ఇళ్లకు వెళ్లి తిరిగిరాగానే, తన దుస్తులు మార్చుకొనే గదిలోకి వెళ్లి, ఒక లినెన్ పైజామా తప్ప తక్కినవన్నీ విప్పేశాడు. ఆ పైజామా నడుమువద్ద తెల్లని పట్టుబెల్టుతో బిగించి ఉంది. అలసిపోయి ఉన్న పాదా లకు సిల్కు స్లిప్పర్లు మాత్రం తొడిగాడు. పెద్దతాటాకు విసనకర్ర ఒకటి తీసుకొని, తన అర్ధనగ్నశరీరాన్ని ఒక వేము పడక కుర్చీలో వాల్చాడు.

వెంటనే పియావ్ చెన్ ఆయన దగ్గరకు వచ్చింది.

మనుమరాలిని చూడగానే తాత అలసటంతా మటు మాయమైపోయింది. ఆమెను చూచుకొని పొంగిపోతూ, సగర్వంగా చిరునవ్వు నవ్వుతూ ఆమెకు స్వాగత మిచ్చాడు. ఆ విదేశపు పాఠశాలలో చదివిన ఎనిమిది సంవత్సరాలలో ఆమె బాల్యదశ గడచి, అందమైన నాగరక యువతిగా తయారయిందన్న సంగతి ఆ క్షణంలో అకస్మాత్తుగా ఆయన గ్రహించాడు. ఇక ఆమె విసనకర్రతో మెల్లగా విసురుతూ విశేషప్రశంసాభావంతో తాతగారిని పరిశీలిస్తూంది. గడచిన

సంవత్సరంలో ఆయన గడ్డం పూర్తిగా తెల్లబడిపోయింది. ఇంకా ఆ గడ్డపురంగు ఆమెకు సుపరిచితంకాలేదు. వయస్సు అరవై దాటినా ఆయన సుదీర్ఘ కాయం పటిష్ఠంగా, హుందాగా ఉన్నది.

తన కుర్చీ చేతిమీద కూర్చుని ఉన్న ఆమె చేయిపట్టుకొని, ముఖంలోకి చూస్తూ యిలా అన్నాడు: "ఏమమ్మా! ఇప్పు డీ స్కూలులో చదువు పూర్తిఅవుతున్నది గనుక, ఇంక ఏమి చేయదలచుకున్నావమ్మా? బడి పంతుళ్ల కళాశాలలో చేరి, చదువు చెప్పటం నేర్చుకుంటావా?"

ఆమె చిరునవ్వుతూ ఇలా అంది: "నేను టీచర్ పని చెయ్యను తాతయ్యా! డాక్టర్ని కావాలని ఉంది."

వాంగ్ కంగ్ ఆమె ముఖం వంక తేరిపార చూచి, "డాక్టర్ పనా? వీల్లేదమ్మా! ఆడవాళ్లు డాక్టర్ పని చెయ్యడం మనం ఎన్నడు కనివిని ఎరుగం", అన్నాడు.

లేడీ డాక్టర్లు చాలామంది ఉన్నారు తాతా! మీ హూ మెడికల్ కాలేజీలో ఇప్పుడు ఎంతోమంది ఆడపిల్లలు డాక్టరు పరీక్షకి చదువుతున్నారు తెలుసా?"

"విదేశపు ఆసుపత్రా! ఆ విదేశీవైద్యం నేర్చుకోవాలనా నీకోరిక? సాటివారిలో నన్ను నవ్వులపాలు చెయ్యదలుచుకొన్నావన్నమాట!

ఆయన నుదుటి పైన రక్తనాళాలు పొంగి ఉండడం చూచి, ఆమె కంగారుపడి, మెల్లగా సౌమ్యంగా, "అయితే

వద్దులే తాతా! ఇక మన మీావిషయం ఇప్పుడు మాట్లాడ వద్దు,'' అంది.

ఆరాత్రి భోజనాలు మామూలుగా మౌనముద్ర తోనే పూర్తి అయినవి. ఆ మరునాడు చాంగ్మాతో చెప్పి వేసింది: ''నాయ్ నాయ్! నాకు డాక్టర్ని కావాలని ఉంది. కాని, తాతయ్య ఒప్పుకోవడం లేదు.

''నా చిట్టిముత్యం! నువ్వు ఇన్నాళ్ళూ బోలెడు చదువుకున్నావుగా తల్లీ! నేనే నువ్వైతే, మాట్లాడకుండా ఇంటివద్ద ఉండి వంటపనీ, కుట్టుపనీ నేర్చుకొనేదాన్ని. ఆడ దానికి, పెళ్లి చేసుకొని సుకంగా పెనిమిటితో, పిల్లా జెల్లాతో కాపురం చెయ్యడం కన్న మంచి పని లేదమ్మా,'' అంది చాంగ్మా.

తన తాతగారు, నాయ్‌నాయిూ కూడా ఇప్పటికీ ఆ పాతకాలపు ధోరణిలోనే ఉన్న సంగతి తేలడంతో పియూావ్‌చెన్‌కి విచారం కలిగింది. వెంటనే ఆమెకు చాంగాన్ స్మర ణకు వచ్చాడు.

ఉదయం తాతగారు కచేరీలో పనిమీాద ఉన్నపుడు పియూావ్‌చెన్ చేతితో సంజ్ఞ చేసి చాంగాన్‌ను సావడిలోకి పిలిచింది. ''ముసలయ్యా! మన ఇంటి అంతటిలోకి నువ్వే కొంచెం నవీనభావాలు, విశాలదృష్టీ గలవాడివి. అంచేత నా మాటలు నువ్వొక్కడివే సవ్యంగా అర్థంచేసుకోగలవు,'' అంది.

అతడి ముఖం వికసించింది. "తమరల్లా అనడం నాకు వొల్లమాలిన సంతోసం సిన్నదొరసాని! మీకు నచ్చే పనిచేయటమే మా ధరమంగద!" అన్నాడు.

"నాకు డాక్టర్ని కావాలని ఉంది. నువ్వా విషయం మా నాంతతో మాట్లాడాలి."

ఈ మాటవిని చాంగాన్ నాలుగైదుసారులు గుటకలు మ్రింగాడు. అతడి అమాయికపు కళ్ళు కొంతసేపు కేవలం శూన్యంలోకి చూస్తున్నట్టు ఉండిపోయినవి. తన ఆలోచనల పద్ధతి ఆధునికంగా ఉన్నవన్నందుకు అతడికి ఎంతో సంతోషం, గర్వంకూడా కలిగినవి. కాని, ఈసారి చిన్నదొరసాని కోరిక మరీ విరుద్ధంగా ఉంది. ముఖమంతా సుళ్లు తిరిగేట్టు వికృతంగా నవ్వాడు.

"సన్నదొరసానీ! ఈ యిపరీతపు కోరిక దొరగోరితో సెప్పడం మాత్రం నావల్ల కాదమ్మా! నిన్నా యిదేశీ ఆసుపత్రిలో చేర్చమని నేను దొరగోరితో సెప్పింరోజున, ఇంచుమించు నన్ని దివాణంనుంచి తన్ని తగిలేసేటంత పని జరిగింది. అయినా, అది వేరు; సావుబతుకులకు సంబందించిన యిసయం. నాకు దొరగారి మనుసు తెలుసు. నేను ఆరిని అడక్కుండానే ఆరేమనేదీ సెప్పెయ్యగలను. దొరగారు దీనికి ససేమిరా ఒప్పుకోరని నాకు స్పష్టంగా తెలుసు. బాబో! ఆరి కోపం నీకూ తెలుసుగా తల్లీ! అంచేత ఈమాట మరిసిపోయి, ఈసారికి నన్నొదిలెయ్యి సిన్నదొరసాని!" అని

కనుకొలకులగుండా ఆమెవంకకు వారచూపు చూసేసరికి ఆమె కళ్ళల్లోంచి రెండు పెద్ద కన్నీటిచుక్కలు ఆమె ఎర్రని చెక్కిళ్ళపైన రాలి చిట్లిపోవడం కనిపించింది. దాంతో నిలువున నీరైపోయాడు.

"సిన్న దొరసాని! నీకోసం నేను. విూ నాయన్ నాయి ఏం సెయ్యమన్నా సేస్తాం తల్లి! సెప్పు! నన్నేం సెయ్యమంటావో సెప్పు!" అన్నాడు.

ఆరోజు మొదలుకొని చాంగాన్ ప్రతిక్షణం ఈ విషయం తన యజమానితో మాట్లాడడానికి తగిన అదను కోసం ఎదురుచూస్తున్నాడు.

చిన్నదొరసాని ఈ భయంకరమైనపని అప్పగించి నందువల్ల చాంగాన్‌కి భయం, గాభరా ఎక్కువ అయినవి. ఈ విషయం యజమానితో ఎల్లా కదిలించాలా అని ఎంతో ఆలోచించాడు. కాని, సరియైన ఉపాయంగాని, సరియైన సమయంగాని, దొరకలేదు. చివరికి ఒకరోజున ఆ సమయం వచ్చింది. ఆ వైద్యశిఖామణి ఒక రసాయనం తయారు చేస్తున్నాడు. శీతాకాలంలో పిల్లల దగ్గులకు ఇచ్చే ఈ రసాయనాన్ని ఎప్పుడూ ఆయన స్వయంగా తన చేతులతోనే తయారుచేస్తాడు. దానికోసం ఆయన మందులు నూరి, వస్త్రకాళితం పడుతూ ఉండగా చాంగాన్ లోపల ప్రవేశించాడు.

వంగి నమస్కరిస్తూనే, "పెద్దదొరా!" అంటూ

ప్రారంభించాడు. కాని, అక్కడే ఆగిపోయి, గొంతు సవరించుకున్నాడు. తరువాత మాట పెగల్లేదు.

"చెప్పరా! ఏమిటి విశేషం?" అన్నాడు సౌమ్యంగా యజమాని.

"మన సిన్నదొరసాని మంచి తెలివైనబిడ్డ దొరా! ఆ యిసయం తమకూ తెలుసనుకోండి. ఆ యమ్మకి వట్టి తెలివి తేటలేకాదు దొరా! చాలా దొడ్డదొడ్డ ఊహలుండాయి. ఆ యమ్మ...ఆయమ్మకి...డాక టేరు అవాలని ఉంది!" అనేశాడు. చివరి రెండు మూడక్షరాలు భయంతో ఇంచుమించు మింగేసి, తరువాత ప్రేలబోయే పెద్ద ఫిరంగి మోతకోసం వణుకుతూ ఎదురు చూస్తున్నాడు.

త దానవమ్మా సిన్నదొరసాని! ఈ ఘణంలో నేను పడుతూన్న గాబారు నీకు అర్థమైతే ఎంత బాగుండును. నీకోసం గనకగాని, ఇంకోళ్ళకోసమైతే ఈ పనికి నేను ఒప్పుకునేవాణ్ణి కాను. మీ తాతయ్యగోరి కోపమంటే మాటలుకాదు! పిడుగులు గురిసే తుపాను నయం!"

కాని, అదృష్టవశాత్తు ఆ తుపాను అసలు మొదలవకుండానే వెలిసిపోయింది. వాంగ్ కంగ్ అతడివైపు తిరిగి సౌమ్యంగా ఇలా అన్నాడు: "అవునురా! బహుశః ఏ నాటికైనా ఆమె డాక్టరే అవుతుంది. ఆమెను అడ్డుపెట్టడం నావల్ల అయ్యే పని కాదు. ఆమె గొప్ప వైద్య విదుషి అవడానికే పుట్టినదనే అభిప్రాయం నాకుకూడా కలిగింది. భగవంతుడి నిర్ణయానికి తిరుగు చెప్పగలవారెవరు?"

ఆ మాటలు వింటూ చాంగాన్ నిజంగా తన చెవులను తాను నమ్మలేక పోతున్నాడు. వాంగ్ కంగ్ అతడివంక చూచాడు. తన నౌకరు వాలకం, విప్పారి ఉన్న అతనినోరు, ఆసక్తితో వికసించి ఉన్న కళ్లు చూచి నవ్వుకున్నాడు.

"ఏరోయ్! వినిపించినయ్యా నేనన్నమాటలు? పోపో! వెళ్ళి నేనన్నమాటలన్నీ మీ చిన్నదొరసానికి చెప్పు," అని హెచ్చరించాడు.

"విన్నా...విన్నా దొరగారూ!" అంటూ చాంగాన్ స్థూలశరీరం ఆ వాకిలిగొడ్డిగుండా దొల్లుకుంటూ వెళ్ళి పోయింది.

అతడి కేకలు విని పియూవోచెన్, చాంగ్నా ద్వారం వద్దకు రాగానే, అతడికి ఆనందంతో నోట మాట రాలేదు. తన పొట్టి గొంతుపైన వేలితో కొట్టుకుంటూ నిలబడి పోయాడు. వివర్ణమైయున్న అతడి ముఖం చెమటపట్టి మెరుస్తోంది. "ఏమిటి ముసలయ్యా! ఈ గొడవంతా?" అని అడిగింది పియూవోచెన్.

"నువ్వు డాకటేరు వౌతావని దొరగోరే సెప్పేశారమ్మా!" అన్నాడు పీకె పెకల్చుకుని.

# ద్వితీయ భాగం

సీయోహో మెడికల్ కాలేజీ పెకింగ్ జిల్లాకు మధ్యగా ఉన్నది. అది పెకింగ్ నగరం నడుమగల చిన్న అమెరికను పట్టణంలాగ ఉంటుంది. విశ్రాంతి మందిరాలు మినహా మిగిలిన భవనాలన్నీ ఒక దీర్ఘ చతురస్రావరణలో ఉన్నవి. వాటిచుట్టూ లతలల్లుకొని ఉన్న ఇటికగోడ ఉన్నది. ఆ గోడకు మధ్యమధ్య పెద్ద ఇనుపగేట్లు ఉన్నవి.

పియూవోచెన్ పాదం ఆ కాలేజి పాలరాతి మొదటి మెట్టుమీద మోపేసరికి ఆమె గుండె గట్టిగా, వేగంగా కొట్టుకోనడం మారంభించింది. ఆమె మెల్లగా రిజిస్ట్రారు కచేరీవంకకు నడిచింది. ఒక పెద్ద గదిలో ప్రవేశించేసరికి మధ్యవయస్సుగల ఒక అమెరికా స్త్రీ ఆమెకు ఎదురు వచ్చింది. నిశితమైన స్వరంలో ఆమె, "నీ పేరేమిటమ్మా?" అని ప్రశ్నించింది. పియూవోచెన్ తనను గురించిన వివరాలన్నీ దృష్టాంత పూర్వకంగా వెల్లడించిన తరువాత, రిజిస్ట్రారు ఆమె యోగ్యతా పత్రాన్ని శ్రద్ధగా పరిశీలించి చూచి "ఓహో! ఈ నగరంలోకల్లా గొప్ప చైనా వైద్య శిఖామణి అయిన వాంగ్ కంగ్ గారి మనుమరాలివా నువ్వు?" అని సంభ్రమాదరాలతో ప్రశ్నించాడు.

పియూవోచెన్ చిరునవ్వుతూ తల ఊచింది. తన తాతగారి ఖ్యాతి ఈ పాశ్చాత్య వైద్యకళాశాలకి కూడా ప్రాకడం ఆమెకు అమితానందం కలిగించింది.

పాఠాలు ప్రారంభించే తొలిరోజున ఆమె పెందలకడే లేచి, పొట్టిచేతుల నీలపురంగు నూలుగౌను వేసుకొని పైన ఒక తెల్లకోటు తొడుగుకుంది. అద్దంలో తనను తాను చూచుకొని "ఈ తెల్లమస్తులు వేసుకొన్నప్పుడు నువ్వు నాకు ఎంతో బాగుంటావు!" అంటూ తన ప్రతిబింబాన్ని అభినందిస్తూ, చిన్న చిలిపినవ్వు నవ్వి గిర్రున వెనక్కు తిరిగింది.

హాస్టలు సేవిక గ్రుడ్లు, ఉడకబెట్టిన రొట్టె తీసుకు వచ్చింది. ఆ ఆనంద వివశత్వంలో మిస్ మావ్ చెన్ కి అవేమీ రుచించలేను. తొమ్మిదికొట్టేసరికల్లా ఆమె ముఖ్యపాఠాల గదికి వెళ్ళిపోయింది. ఆ గది పాలరాతి సావడికి ఉత్తరాన ఉన్నది. ఆమె ఇంకా కూచోక పూర్వమే ఎవరో తలుపు తోశారు. బాగా బొద్దుగా ఉన్న ఒక అమెరికన్ ప్రొఫెసర్ లోపలికివచ్చాడు. సద్భావ సంపన్నమైన మందహాసం చేస్తూ ఆయన ఆ బాల బాలికలను అభినందించాడు. "మీ క్లాసులో ఇద్దరు విద్యార్థినులు కూడా ఉన్నందుకు మిమ్మలి నందరినీ నేను అభినందిస్తున్నాను," అన్నాడు.

నవ్వులు సద్దు మణిగిన తరువాత, ప్రొఫెసర్ మళ్లీ అందుకొని ఇలా అన్నాడు: "సమర్థులైన, ఆధునిక చైనా యువజన జగత్తును తరచి తీసిన వెన్నవంటివారైన మీకు ఈ పవిత్ర వృత్తిలో శిక్షణ పొందే అవకాశం ప్రాప్తించింది. ఈ వృత్తి మానవుల ప్రాణాలను కాపాడడానికి ఉపయోగపడేది అవడంవల్ల, మిగిలిన వృత్తులన్నింటిలోకి ఉదాత్తమైనది."

ఈ ప్రారంభోపన్యాసం షియావోచెన్‌ని విశేషంగా ఆకర్షించింది. ఆ క్రిందటి రాత్రి తనకు తాతగారు వీడ్కోలిస్తూ, "వైద్యుల ప్రవర్తన చతురస్రంగాను, జ్ఞానం సంపూర్ణవర్తులంగాను, హైత్యకోసం పెద్దదిగాను ఉండా" లని హెచ్చరించిన మాటలు ఆమెకు జ్ఞాపకం వచ్చినవి.

తొలి ఉపన్యాసానంతరం విద్యార్థులందరినీ మూడవ అంతస్తులో ఉన్న శరీరనిర్మాణశాస్త్రబోధన విభాగంలోకి వెళ్ళమన్నారు. అక్కడ ఒక పెద్ద తెల్లని గదిలో పాలరాతి పలకలు పరచిన 15 మేజాబల్లలు ఉన్నవి. ఒక్కొక్కబల్ల మీద నూనెగుడ్డతో కప్పబడిన ఒక్కొక్క శవమున్నది: గదంతా గ్లిజరిన్, ఫినైల్ వాసనకొడుతూంది. ఏ విద్యార్థి ఏ శవాన్ని పరిశీలించవలసినదీ ప్రొఫెసర్ పేరు పేరు వరుసనా పిలిచి అప్పచెపుతున్నాడు. ఆ గదిలో అటుప్రక్కమూలగా ఉన్న ఒకశవం షియావోచెన్ వంతుకు వచ్చింది. మాన్క్వా అనే మరొక విద్యార్థి కూడా ఆమెతోపాటు ఆశవాన్నే పరిశీలిస్తాడని కూడా ప్రొఫెసర్ ప్రకటించాడు. వెంటనే, ఒక యువకుడు ఆమె వద్దకు వచ్చి, సవినయంగా అభివాదం చేసి, "మీరూ, నేనూ ఈ శవాన్నే పరీక్షించాలి కాబోలు," అంటూ మెల్లగా ఆ శవంపై కప్పి ఉన్న నూనె గుడ్డను తొలగించాడు. పిమ్మట ఆమెకోసం అతడొక ఎత్తైన స్టూలుబల్ల తెచ్చి వేశాడు. ఆ కళేబరానికి ఎడమ ప్రక్కన ఆ బల్లమీంద షియావోచెన్ కూచున్నది. కుడిప్రక్కన అతడు కూచున్నాడు. తెల్లకోట్లు తొడుగుకొన్న చాలా

మంది బోధకులు అటూ ఇటూ తిరుగుతూ సైక్లోస్టైల్ తీసిన సూచనల కాగితాలను విద్యార్థులందరికీ పంచిపెడుతున్నారు. షియూవో చెన్ మొదటిపేజీ చూచింది. అది తొడ వెనుక భాగంలోని ప్రధాన రక్తనాళాన్ని సవివరంగా చూపుతూంది. ఆమె వేళ్లు వణకటం ఆరంభించినవి.

మార్క్ తన కత్తుల సంచీవిప్పి, ఆ పనిలో ఆరితేరిన వాడిలాగ కోయడం ప్రారంభించాడు. షియూవో చెన్ తన తోలు సంచీలోని పనిముట్లు తీయడానికి చేతగాకడక తచ్చాడుతోంది. అతడు తలయెత్తిచూచి చిలిపిగా చిరునవ్వుతూ, "ఏమండీ! భయపడుతున్నారా?" అని ప్రశ్నించాడు.

దాంతో ఆమె మైకం విడిపోయింది. ఆ సైక్లోస్టైల్ సూచన పత్రంలో చెప్పినప్రకారం 'తూ. చా.' తప్పకుండా తానుకూడా పని ప్రారంభించింది. మొదట చర్మం కొంత కోసివేసింది; తరువాత కొవ్వు తీసివేసింది. పిమ్మట ఆ ఫెమొరల్ నరాన్ని, ధమనిని, పిదప సిరలను బయటకుతీసింది.

ఆరోజు సాయంకాలానికి ఆమె బాగా అలసి పోయింది. గదికి చేరుకోగానే తన శరీరనిర్మాణశాస్త్ర గ్రంథాన్ని ఒక కుర్చీలోకి విసిరివేసి, తెల్లచొక్కా తీసివేసి, స్నానపు గదిలోకి వెళ్ళి చేతులు, గోళ్లు బాగా చాలాసేపు రుద్ది శుభ్రం చేసుకున్నది; అప్పటికీ వాటికి ఆశవపు కంపు వదల్లే దనే ఆమె అనుమానం. ఆవేళ రాత్రి భోజనం చెయ్యడం

అసంభవ మయిపోయింది. ఆహారం నోటివద్దకు పోగానే, ఆమెకు ఆశవం వాసనే రానటం మొదలుపెట్టింది. పైగా, ఆమెకు ఆకలికూడా లేదు. భోజనం మానివేసింది.

ఆరాత్రి ప్రక్కమీద పడుకుంటే, ఆచీకటిలో ఆ కళేబరంతప్ప వేరేమీ కనిపించలేదు. అది వడిలిపోయి, నిజంగా మనుష్యుడి శరీరం కాదేమో అన్నంతగా మారి పోయింది. కాని, ఆశరీరంలో బ్రతికిన మానవుడి గొంతులో మాత్రం నిలువుగా పెద్దగాయం ఉంది. మానవుల చరిత్ర లలో విశేషాసక్తికలది అవడంవలన పియూవోచెన్ ఆనాడు ఇంటికి తిరిగి రావడానికి పూర్వం ఆశవంయొక్క పూర్వ చరిత్రను తెలుసుకోవడానికిగాను ద్వారపాలకుడివద్దకు వెళ్ళింది. ఆమనిషి ఒకమంగలి అనీ, జూదంలో చాలాధనం ఓడిపోవడంవల్ల ఆత్మహత్య చేసుకొన్నాడనీ అతడు చెప్పాడు. ఆపైన, పియూవోచెన్ శరీరనిర్మాణశాస్త్రంలో తానా నాడు పరిశీలనాత్మకంగా గ్రహించిన విషయాలను నెమరు వేసుకొనడానికి బదులు, ఆ మంగలికి కలిగిన దురంతాన్ని గురించి విచారించడం ఆరంభించింది.

ఈ శరీరనిర్మాణశాస్త్ర బోధనలో తొలి ఆరు వారాల కార్యక్రమం చిత్ర హింసాత్మకమైనది. శవాలను కోసే గదిలోకి వెళ్ళేటప్పుడు కలిగే భయాన్ని ఆమె ఎప్పటికీ అధిగమించలేక పోయింది. ప్రతిదినం, ఆబోధన పూర్తికాగానే, ఆమె "ఏనాటికైనా నిజంగా నాకీ

పాశ్చాత్య వైద్యంతో పరిచయం లభిస్తుందా? ఈ విద్యా విధానమంతా ఏమిటో అతి క్రూరంగా కనిపిస్తూంది,'' అనుకునేది.

ఆమె అనిశ్చితడోలాందోళితస్థితి ఒక నాడు అకస్మాత్తుగా అంతమయిపోయింది. ఆరోజున శరీరనిర్మాణ శాస్త్రాచార్యుడువచ్చి, ''వచ్చే సోమవారం శరీర నిర్మాణ శాస్త్రంలో ప్రథమపరీక్ష జరుగుతుంది. అది మౌఖికపరీక్ష, లిఖితపరీక్ష, ప్రయోగపరీక్ష అనే మూడు భాగాలుగా ఉంటుంది,'' అని హెచ్చరించాడు.

ప్రతిరాత్రి ఆమె శ్రద్ధగా శ్రమపడి చదువుతూ ఉండడంవలన లిఖిత, మౌఖిక పరీక్షలలో ఆమెకు ఏమాత్రం సంకోచం లేదు. కాని, ప్రయోగాత్మక పరీక్షలో మాత్రం చాలా భయంగాఉంది. ఆ మధ్యాహ్నం శవాన్నికోసి పరిశీలిస్తూన్న సమయంలో ఆమె మార్క్ వంక చూచి, ''ఈవేళ రాత్రికూడా నేను ఈ శవపరీక్షాశాలకి రావాలనుకుంటున్నాను. దయచేసి మీరుకూడా రాగలరా?'' అని అడిగింది.

మార్క్ మంచి తెలివైన కుర్రవాడు. షాంఘై నగరంనించి వచ్చాడు. పొడుగ్గా, బొద్దుగా ఎదిగిన ఇరవైరెండేళ్ళ యువకుడు. నల్ల పట్టులాంటి జుట్టు వెనుకకు విరిచి దువ్వడంవలన, నుదురు మరింత విశాలంగా కనిపిస్తూంది. నల్లని విశాలనేత్రాలు అతడి ఆకరణశక్తికి వన్నె పెడు

తున్నవి. పియాన్‌చెన్‌ని మొదట కలుసుకున్నప్పటి నుండి ఆతడికి ఆమె అంటే ఇష్టం ఏర్పడింది. కాని, ఆమె ముక్త సరిగా మాటాడుతూ, దూరదూరంగా ఉండడంవలన ఆమెను ఎక్కువగా పలుకరించడానికికూడ అతడు సాహసించలేదు. అలాంటిది, ఇప్పుడు ఆమే తన సహాయం కోరింది.

ఆ యువతీయువకులు ఒక్కొక్క బల్లనె దాటిపోతూ అవతలిప్రక్క మూలనుఉన్న తమ శవం దగ్గరకు పోతూ ఉంటే, ఆగది యావత్తూ భయంకర మహాశ్మశానంలాగ కని పించింది. మార్క్ జేబులోనుంచి ఒక ఫ్లాష్‌లైట్‌తీసి, ఆ శవంమీద లైటువేశాడు. ఆ ఆరువారాల్లో ప్రథమ పర్యాయం పియావ్‌చెన్ ఆశవాన్ని ఆసక్తితో శ్రద్ధగా పరిశీలించడానికి నిశ్చయించుకొన్నది. అతడు మంగలి అనే మాట మరచిపోయి ఆ శరీరంలోని వివిధ భాగాలనుతీసి, అతి జాగరూకతతో పరిశీలించడం ప్రారంభించింది. ఆమె వేళ్ళు ఆనాడు అతి నైపుణ్యంతో, ఆవేశంతో చురుకుగా పని చేయడ మారంభించినవి. చివరికి, విశ్రాంతి మందిరాలకు వెళ్ళిపోవలసిన వేళ అయిందని మార్క్ జ్ఞాపకం చేసేదాకా, ఆమెవంచిన తల పైకెత్తలేదు.

తిరిగి వెళ్లిపోయేటప్పుడు, ముసలమ్మలు దయ్యాలను గురించి చెప్పే మాటలన్నీ కేవలం కల్పితకథలే అని ఆమె తనలో తాను అనుకున్నది. మార్క్‌పట్ల ఆమె కృతజ్ఞతా భావం ఎక్కువయింది. అతడికి 'గుడ్‌బై' చెప్పేటప్పుడు,

ప్రథమ పర్యాయం ఆమె అతణ్ణి దగ్గరగాచూచి, అతడు అందమైనవాడన్న సంగతి గ్రహించింది.

మరునాడు శరీరనిర్మాణశాస్త్ర పరీక్ష చాలా కష్టంగా ఉంది. క్రొత్తగా వచ్చిచేరిన వారిలో మూడోవంతుకి కొంచెం పైగా ఆపరీక్షలో తప్పారు. షియాంగ్ చెన్, మార్క్ కూడా అందరికన్న ఎక్కువ మార్కులతో ఉత్తీర్ణులయారు. ఆమెదృష్టిలో అన్నింటికన్న ముఖ్యవిషయం: తాను ఏనాటికైనా అధిగమించవలసిన ఉన్న విషయాలను, మనసు పట్టింపులను తానీ విద్యాకృషివలన సులభంగా త్రోసివేయగలగడం.

* * *

చైనా కాలమానం ప్రకారం ప్రథమ చాంద్ర మాసంలో పంచమిరోజున వాంగ్ కంగ్ కి సప్తతి పూర్తి అవుతుంది. ఆ సందర్భంలో పెద్దఉత్సవం జరగవలసిఉన్నది. దురదృష్టవశాత్తు ఈ జన్మదినోత్సవం ఆమెకు ముఖ్యమైన, పరీక్ష ఉన్నరోజుకి క్రితం రోజు అయింది. అయినప్పటికీ, ఆ రోజున తాను వెళ్లి తాతగారివద్ద ఉండక తప్పదని ఆమెకు తెలుసు. కాని, పరీక్షకు తయారవడానికి ఆరోజున ఆమెకు కొంత వ్యవధికావాలి. ఆమెకొక ఉపాయం తోచింది. ఆ పరీక్ష మానవాస్థి పంజరాన్ని గురించి అవడంవలన, తన వద్దనున్న మానవుని ఎముకల నన్నిటినీ ఇంటికి తీసుకువెళ్లి రాత్రిపూట ఇంటివద్దనే వాటిని శ్రద్ధగా పరిశీలించడానికి నిశ్చయించుకొన్నది. ఉదయాన పెందలకడే లేచి మానవాస్థి

పంజరంలోని రెండువందల పదహారు ఎముకలను, వాటిని గురించి వివరించే తన నోట్సుపుస్తకాన్ని ఒక సూట్ కేస్ పెట్టెలో సర్ది, రిక్షాలో పెట్టుకుని ఇంటికి తీసుకునివెళ్ళింది.

ఆనాడు వాంగ్‌ల గృహం మహోత్సాహంతో వెల్లి విరుస్తూంది. ఆమె మేనత్తలు, మేనమామలు, వారిబిడ్డలు అంతా వచ్చారు. అందరూ పండుగరోజు ముస్తాబులు చేసుకున్నారు. ఆమె వారందరికీ సవినయంగా అభివందనాలు చేసి వేగంగా తాతగారి వద్దకు వెళ్ళింది.

ఆమెకంట బడగానే ఆయన ముఖం వికసించింది. ఆమె తాతగారికి అభినందనలు, శుభాకాంక్షలు తెలియజేస్తూ, అత్యంతగౌరవభావంతో నేలకొరిగి నమస్కరించింది.

ఆయన ఆమెను ప్రేమతో లేవదీసి, "రా తల్లీ! ఇలావచ్చి నాపక్కన కూచో!" అన్నాడు.

కాని, ద్వారం దగ్గర నిలబడి ఇదంతా చూస్తూన్న చాంగ్మా, తన చిట్టి దొరసాని దుస్తులుచూచి అసహ్యించుకుంటూ, ఆమెదృష్టిని ఆకర్షించడానికి ఎన్నోతిప్పలు పడుతూంది. చివరికి, ఒక గిన్నెలో టీ కలుపుకువచ్చి వాంగ్ కంగ్‌కి ఇచ్చి, తన చిట్టి దొరసానితో రహస్యంగా, "సిట్టి తల్లి! నువ్వొచ్చి ఆ గుడ్డలు మార్చుకో ముందు. పెద్దలను ప్రొమొక్కేవేళకి యింకెంతో యెవధిలేదు," అని చెవిలో చెప్పింది. వెంటనే షియూవాచెన్ తనగదిలోకి బయలుదేరింది. చాంగ్మా ఆమె వెంట నడుస్తూ, "చివరికి నువ్వో

ల్లాగూ నాకు సెడ్డ పేరు తెప్పిత్తావు. నువ్వు భూమి మీదపడిన రెండు గడియలప్పట్నించీ నేను నిన్ను పెంచి పెద్దదాన్ని సేశాను. ఇంతా సేత్తే, తీరా ఇలాంటి ముఖ్యమైన రోజున ఆ యికారపు నూలుగుడ్డలు కట్టుకుని కూసుంటావా? ఎందుకు సెప్పు నువ్వు నన్నిల్లా ఏడిపించడం? నేను నిన్ను సరిగా పెంచలేదని అందరూ ఆడిపోసుకుంటారు!'' అని కోపంగా కసరటం మొదలు పెట్టింది..

షియూవోచెన్ ఈ చివాట్లన్నీ అతిశాంతంగా సహించి, ఆమె ఉపన్యాసం పూర్తిఅయిపోయిన తరువాత చిరునవ్వుతూ ఇలా జవాబు చెప్పింది: ''నాయ్ నాయ్! నేను నిజంగా అంత చెడ్డపని చేశానంటావా? ఇంచుమించు నా పట్టుదుస్తులన్నీ నేను ఇంటివద్దనే వదిలిపెట్టి వెళ్ళానాయె! అయినా స్కూలులో బట్టలు మార్చుకోనేందుకు కూడా నాకు వ్యవధిలేక పోయింది. ఇప్పుడు మించిపోయిందేముంది. రా! వచ్చి నాకు కాస్త సలహా చెప్పు. నీ వేదుస్తులు వేసుకోమంటావో చెప్పు; వేసుకుంటాను.''

తలదువ్వి ముఖానికి పౌడరద్దిన తరువాత, చాంగ్మా పరిచిన సముద్రపు పచ్చరంగు పట్టుదుస్తులు వేసుకునేసరికి, ఆమె అందానికి అవధిలేకపోయింది. పిమ్మట, పెద్దలకు మ్రొక్కే 'పాయ్ షో' ముహూర్తం సమీపించింది. కూతుళ్ళు, అల్లుళ్ళు జంటలు జంటలుగావచ్చి వాంగ్ కంగ్ కి నమస్కరిస్తున్నారు. షియూవోచెన్, ఇతర మనుమలు.

మనుమరాళ్ళు వారి వారి వయస్సును బట్టి వరుసగా వచ్చి తాతగారికి నమస్కరించారు. తన కుటుంబమంతా ఒక్క సారి కనిపించేసరికి, ఆ వృద్ధవైద్యుని కనులు చెమ్మగిల్లినవి; ఆయన హృదయం విచారంతో బరువెక్కింది. ఈ ముఖ్యమైన పర్వదినాన తన భార్య, కొడుకు లేని వెలితి ఆయనకు పెద్దగా కనిపిస్తూంది.

బంధువులంతా కబుర్లు చెప్పుకుంటూ, టీ తాగుతూ గుమ్మడి గింజల పప్పులు నలుముతూన్నప్పుడు చాంగ్మా అకస్మాత్తుగా గొంతు చించుకొని అరుస్తూంది. ఆమె అంటున్న దేమిటో ఎవరికీ తెలియడంలేదు. షియావో చెన్ తన మేనత్త బిడ్డతో ఏదో ప్రసంగిస్తూ ఈ ఆందోళనను విని పించుకోలేదు. ఇదిచూచి, "షియావో చెన్! ఇలాచూడు! మీ చాంగ్మాకి ఏదో జబ్బు చేసినట్టుంది!" అని ఒక మేనత్త హెచ్చరించేవరకూ షియావో చెన్ అటు చూడనేలేదు.

చాంగ్మా, "హంతకం! హచ్చె! ఇదా ఆ యిదేశీ బళ్ళో ఇన్నాళ్ళ నుంచీ నువ్వు సేత్తూన్నపని? మనుషుల్ని సంపి వాళ్ళ ఎముకలన్నీ మూటగట్టుకురావడమే! అయ్యో అయ్యో!" అని అరుస్తూండడం వినిపించింది.

"నాయ్ నాయ్! నువ్వు అరవకుండా నేను చెప్పేది కాస్త వినిపించుకో! నేసి ఎముకలను మా కళాశాలనించి తీసుకు వచ్చాను. రేపటి పరీక్షకోసం నేను వాటి నన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించాలి. అందుకోసం ఇంటికి తెచ్చాను."

అని పియూవోచెన్ చాంగ్మాను ఎలాగో సమాధానపరిచే సరికి ఆమె తలప్రాణం తోకకు వచ్చింది.

చివరికి, ముసలిది అరవడంమాని నిట్టూరుస్తూ, "మా ముసలాడితో ఈ యిసయం సెప్పాలి. నిన్నా బడికి పంప డానికి బాగా వత్తాసి సేశాడుగా!" అన్నది.

ఆనాడు జన్మదినోత్సవ కార్యక్రమం ముగియవచ్చే సమయంలో పియూవోచెన్ ఓరిమి తగ్గిపోయింది. త్వరగా తనగదిలోకిపోయి, ఆ అస్థిపంజరభాగాలను పరిశీలించాలని తొందరపడుతూంది. ఆనాడంతా ఆమె మరునాటి తన పరీక్షను గురించే మథనపడుతూంది. విందుసమయంలో బంధువు లంతా చర్చలు, పరాచికాలు చేసుకుంటూ, అంతు లేకుండా ఆలస్యం చేస్తున్నారు. వారిలో కొందరు మత్తుగా తాగేశారు.

చివరకు, ఆ కర్మకాండయావత్తూ పూర్తిఅయి పోయింది. ఒక్కొక్కళ్ళే అతిథులంతా వెళ్ళిపోయేసరికి పియూవోచెన్ 'అమ్మయ్య!' అనుకుంది. తాతగారిని ఒక సారిచూచి అభివందనంచేసి రావడానికి పైకి వెళ్ళింది.

"ఒక్కసారి ఇలారాతల్లీ! ఈవేళ నిన్ను నేను సరిగా చూడనేలేదు, ఇలా దగ్గరకుగా!" అన్నాడు వాంగ్‌కంగ్.

"తాతా! ఇక నువ్వు విశ్రాంతి తీసుకోనడం మంచిది. అప్పుడే చాలా ప్రొద్దుపోయింది," అన్నది పియూవోచెన్.

తాతగారికి కొంచెం కష్టంగా ఉన్నట్టు కనిపించింది. "తల్లీ! నేను నిన్ను చూచి రెండు నెలలైందని నీకు గుర్తుందా? నేను కూడా వైద్యశాస్త్రం అభ్యసించే సమయంలో చాలా శ్రద్ధగానే కష్టపడి చదివేవాణ్ణి. కాని, ఈవేళ రాత్రిమాత్రం నువ్వు నాలుగునిముషాలు నాదగ్గిర కూర్చోవాలి. నీతో కొంచెం మాట్లాడవలసిన పని కూడా ఉంది," అన్నాడు. వెంటనే, ఆమె అంగీకరించింది. ఒక చిన్న టీ టేబుల్ దగ్గర ఇద్దరు కూర్చున్నారు. తన చిన్నదొరసాని చేసే పనులన్నీ జాగ్రత్తగా గమనించి చూస్తూన్న చాంగ్మా ఒక కూజాతో టీ, రెండు పింగాణీకప్పులు ఒక ట్రేలో పెట్టుకుని తీసుకు వచ్చింది. వాంగ్ కంగ్ నీలిరంగు పట్టు అంగరఖా చేతులు పైకి మడచి మల్లెపూల పరిమళమువచ్చే ఆ టీని కప్పులలో పోశాడు.

ఇప్పుడు చెప్పమ్మా! నువ్వు ప్రస్తుతం ఏమి చదువు ...స్నదీ నాకు కాస్త చెప్పు!"

"తాతయ్యా! ఈ చదువు నాకు బాగా సరదాగానే ఉంది. మాకు ఇప్పుడు శరీరనిర్మాణశాస్త్రం, శారీరక విజ్ఞాన శాస్త్రం, జీవరసాయన శాస్త్రం అనే వైద్యానికిపూర్వం నేర్పే మూడుశాస్త్రాలూ బోధిస్తున్నారు. అప్పుడే, కండరాల సంకోచ వ్యాకోచవిధానం, హృదయం పనిచేసే క్రమం, నరముల ప్రేరణ మొదలైన విషయాలు కూడా మేము నేర్చుకున్నాము," అని వివరించింది పియావ్‌చెన్.

గానే "అద్భుతంగా చేశావు మిస్. వాంగ్!" అని ఆయన ఆమెను అభినందించాడు.

అయినా ఆమె కలవరపాటు ఉపశమించలేదు. "కాని, ఆ ఎనిమిదో ఎముక ఎక్కడిదో నాకు తెలియలేదు ప్రొఫెసర్," అన్నది.

డాక్టర్ పాన్ చిరునవ్వి, "అది నీకు తెలియక పోవడంలో తప్పేమీ లేదు, అసలది మనిషి ఎముక కాదు. తెలియకపోయినా ఏదో చెప్పబోయే విద్యార్థులను బోల్తా కొట్టించడానికే దాన్ని వాటిలో కలిపాము," అన్నాడు.

ఆ వైద్యకళాశాలలో రెండవ సంవత్సరం శిక్షణ పూర్తిఅయి వేసవి సెలవల్లో ఇంటికి వచ్చినప్పుడు, ఆమె మానసికంగా బాగా అలసిపోయి విసుగ్గా ఉంది. తొలిరోజు ఉదయం లినెన్ దోమతెరగల తన సువిశాలమైన మహాగని మంచంపైన కళ్ళు తెరిచిచూచి, తిరిగి మూసుకుని, మళ్లీ బద్ధకంగా ముసుగుదన్ని పడుకుంది. చాంగ్మా ఎందుకైనా మంచిదని కిటికీ తలుపులన్నీ మూసివేయడంతో, నిద్రలేచేసరికి దాదాపు పదకొండు గంటలైనా ఆమెకు తెలియలేదు.

ఆమె ఉదయం ఉపాహారం పూర్తి అయ్యేసరికి ఆమె తాతగారి కచేరీలో ఉదయపు పని పూర్తి అయింది. చిట్ట

చివరి రోగి అప్పుడే వంగి నమస్కరించి వెనుదిరిగి పోతూం డగా, పియాహోచెన్ లోపల ప్రవేశించింది.

తాతగారు ఆమె వంక తేరిపార జూచి చాలా ఆనంద పడ్డాడు. "నా చిట్టి తల్లి! రోజురోజుకి అందంగా ఎదుగు తూంది," అని లోలోపల మురిసిపోయి, పైకి మాత్రం "అదేమిటమ్మా! నీరసంగా చిక్కిపోయినట్టు కనిపిస్తున్నావు? ఆ కళాశాలలో వారు మిమ్మల్ని బాగా బాధపెట్టి చదివిస్తున్నట్టున్నారు! ఔను మరి, ఇప్పుడు బాగా కష్టపడి తేనే ముందు ముందు గొప్పవాళ్లవుతారు."

"అవును తాతయ్యా! మా కాలేజీలో చదువు కష్టంగానే ఉంటుంది. మా క్లాసు వాళ్ళలో సగంమంది పరీక్షలో తప్పిపోయారు తాతయ్యా! పాపం వాళ్లను చూస్తే ఎంతో జాలివేస్తుంది. మా అందరిలాగే వాళ్ళూ ఎంతోకష్ట పడి చదివారు," అని జవాబు చెప్పింది పియాహోచెన్.

ఆయన ఒక్కనిముషం ఏదో ఆలోచనలోపడి, "చెడి పోయిన కర్ర చెక్కడానికి పనికిరాదమ్మా! ఆ పరీక్ష తప్పి పోయిన పిల్లలు వైద్యవృత్తికి తగినవారుకారు. వాళ్ళు బహుశః మరొకవృత్తిచూచుకోనడం మంచిది. మొత్తంమీద నువ్వు పాసవటం నాకు ఆనందంగా ఉందమ్మా! నేను మీ నాన్నను వైద్యుణ్ణి చేయాలనుకున్నాను. ఇప్పుడు నువ్వు నా కోరిక సఫలం చేస్తున్నావు."

తాతగారు తనను అభినందించినప్పుడల్లా మామూ

లైన సిగ్గువచ్చిందామెకు. గోడకు తగిలించి ఉన్న ఆయన కాల షెల్ఫులో నీలపురంగు గుడ్డ బైండు పుస్తక మొ ఆమె వేలుతో తాతగారికి చూపించింది. దానిమీ అంటించి ఉన్న ఒక తెల్లకాగితం మీద, "సి చింగ్" అ వ్రాసి ఉంది.

"తాతా! ఈవేళనించి చైనా వైద్యగ్రంథమేదైనా చదవడం ప్రారంభిద్దామా?" అని అడిగింది.

"నీ యిష్టం తల్లీ!" అంటూ ఆయన ఆ పుస్తకం తీసి ఆమె కిచ్చాడు. ఆమె ఆ పుస్తకంలోని విషయసూచిక తీసి, పారిశుధ్యసూత్రాలు, నాడీనిదానం, ముఖవైఖరి, కాలేయం, నరములు, శ్వాస, రుచి, సూచీ చికిత్స మొద లైన విషయాలన్నీ చూచుకుంటూ పోయింది.

చివరికి 78 వ పేజీలో నాడి నిదానాన్ని గురించి ఉన్న భాగంతీసి, చదవడం ప్రారంభించింది:

"శరీరమంతా స్వస్థవృత్తంలో ఉన్నప్పుడు, "యాంగ్" "యిన్"ల ప్రసారానికి ఆటంకం ఏమీ లేనప్పుడు, శ్వాస సమంగా ఆడుతూ ఉంటుంది. వైద్యుడు నాడియొక్క మూడుస్థానాలపైన మూడువేళ్ళు ఉంచి, బొటనవ్రేలిని మణికట్టు వెనుక నుంచి, నాడీ నిదానం చెయ్యాలి. నాడీ నిదానానికి సరియైన సమయం సూర్యో దయకాలం. వైద్యుడప్పుడు ప్రశాంతంగా, సమస్థితిలో ఉం డాలి. అతడు ఒక ఉచ్ఛ్వాసం, ఒక్క నిశ్వాసం తీసుకునే

చివరి నికి నాడీసమయం అంటారు. ఆ సమయంలో సాధా రణంగా నాడి నాలుగుసార్లు కొట్టుకోవాలి. వైద్యుడు కుడి చేతితో ఎడమచేతి నాడిని, ఎడమ చేతితో కుడిచేతి నాడినీ పరిశీలించాలి. ఈ మూడువేళ్లకు మూడురకాల నాడులు తగులుతవి. ఇందులో ప్రతినాడినీ— తేలికగాను, మధ్య రకంగాను, బాగా వత్తిపట్టుకొని,-మూడు రకాలుగా పరీ క్షించాలి. అనగా వైద్యుడు తొమ్మిది నాడీసమయాల కాలం పరీక్షించవలసి ఉంటుంది. ఒక్కొక్క విభాగంలో రెండునాడులు ఉంటవి. కనుక ఒక్కొక్క మణికట్టువద్ద ఆరు నాడులు ఉంటవి. ఈ పన్నెండు నాడులు శరీరంలోని పన్నెండు అవయవాలకు ప్రాతినిధ్యం వహిస్తవి, కుడివైపు: ఊపిరితిత్తి, పెద్దప్రేవు చివరిభాగం (Colon), ప్లీహం, గర్భ కోశము, మూడు జ్వాలాస్థానాలు, ప్రాణద్వారాలు. ఎడమప్రక్క: హృదయము ప్రేవులు, కాలేయము, గాల్ (Gall), మూత్రపిండము, మూత్రకోశము.''

ఇంతవరకు చదివి, "తాతా! ఈ నెలవలలో మన చైనావైద్య గ్రంథాలలో చాలాభాగం చదివివేయాలి.'' అన్నది పియూవోచెన్. వాంగ్‌కంగ్ ఆమెవంక నిశితంగా చూస్తూ, "ఈ గ్రంథాల్లోంచి నేర్చుకోనవలసినది చాలా ఉన్నదమ్మా! సుప్రసిద్ధ వైద్యులెందరో కనిపెట్టిన విషయా లన్నీ వాటిలో ఉన్నవి,'' అన్నాడు.

మధ్యాహ్న భోజనసమయంలో, "ఈవేళ సాయం కాలం ఏమిచేయదలచుకున్నావు?'' అని ఆయన ప్రశ్నిం

చాడు. "స్వర్గ దేవాలయానికి వెళ్ళి అక్కడ కాలక్షేపం చేయా లనుకుంటున్నాను," అని ఆమె జవాబు చెప్పింది. ఈ స్వర్గ దేవాలయం ఆ నగరం దక్షిణ శివారులో ఒక పెద్ద పార్కులో ఉంది. ఆ మందిరం మూడు అంతస్తులుగా ఉంది. మూడు అంతస్తులకు నాలుగువైపులనుంచి మెట్లున్నవి. పై అంతస్తుమధ్యనించి చూస్తే నీలాకాశపు కప్పుతప్ప వేరేమీ కనిపించదు.

తాత, మనుమరాలు తమ రిక్షాలను ఆ పార్కు ముఖద్వారంవద్దనే దిగి, వంపులు తిరుగుతూపోయే, సన్నని దారిగుండా మెల్లగా నడవడం ప్రారంభించారు. ఆ దారి పొడుగునా రెండువైపులనిండా పూలతో తలలూపుతూన్న పియోనీస్, ధాలియా మొక్కలున్నవి. మెల్లగా వారా దేవాలయపు గర్భగుడికిపోయే మెట్లుఎక్కి, పై అంతస్తుకి మధ్యగా వెళ్ళి నిలబడ్డారు.

వాంగ్ కంగ్ ఇలా అన్నాడు: "మన చక్రవర్తు లంతా ఏటేట ఇక్కడినించే స్వర్గాధిదేవలకు కృతజ్ఞతాభి వందనం చేసేవారు. ఇక్కడే భక్తుల కాపరమాత్మ దయా ప్రసాదం లభిస్తుందని ప్రతీతి. ఈ విశ్వంలో ఆధ్యాత్మిక శక్తులు సర్వత్ర ఉన్నవి. అత్యున్నతాకాశంలో గాని, అగాధ సముద్రపు లోతులలోగాని నైతిక శాసనాలకు చెల్లుబడిలేని ప్రదేశం ఎక్కడా లేదు. సూర్య చంద్రనక్ష త్రాల గతులన్నిటినీ స్వర్గమే లెక్కప్రకారం శాసిస్తున్నది.

ఋతువుల క్రమాన్ని, రాత్రింబవళ్ళ చక్రాన్ని త్రిప్పుతున్నది, అన్నాడు మన లావ్ జే పండితుడు.''

పియూవోచెన్ తాతగారి వంక సాలోచనగాచూచి, ఇలా అన్నది: ''మీకూ దేవుడిలో విశ్వాసం ఉన్నదన్న మాట! అయితే, ఆ దేవుణ్ణిగురించి మీరు చెప్పేమాటలకు క్రైస్తవులు చెప్పే మాటలకు కొంచెం తేడా ఉన్నట్టుంది.''

''ఔనమ్మా! స్వర్గాన్ని గురించి, భగవంతుణ్ణి గురించి మన విశ్వాసాలు మనకు ఉన్నవి. లావ్ జే పండితుని సిద్ధాంతం ప్రకారం మానవుడు సహజంగా మంచివాడు. అతడు నిష్కల్మషమైన తన ఆంతరంగిక ప్రేరణలను నమ్ముకొని, ''టే'' దివ్యపథానికి తప్పిపోకుండా ఉంటే అన్యధర్మ బోధనలేవీ అతడికి అవసరంలేదు. జీవితంలో నియమ నిషేధాలు ఎక్కువయితే, వ్యక్తియొక్క అభ్యుదయం కుంటుపడుతుంది. ఆ జీవితవిధానమే, అనగా జీవితంలో విశ్వాసం కలిగి, తదనుగుణంగా ప్రవర్తించడమే 'టే' ధర్మపథం; ఘర్షణకు బదులు సమాధానపడడం, నిరాడంబరముగా, స్వతంత్రంగా బ్రతకడంలోనే వివేకం, యోగ్యత, సంతృప్తి ఉన్నవి.

''మానవుడు, ప్రకృతి, స్వర్గం అన్నీ కలిసి మొత్తం ఒక్కటే. మానవుడు స్వయం వ్యక్తుడుగా ఉండగోరుతున్నప్పుడు, తనశక్తికి అతీతమైన విషయాలకోసం ఆరాటపడనప్పుడు, సర్వవ్యాపి అయిన ఏకాత్మయొక్క స్వాతం

త్ర్యంలో తన అంశతో తాను సంతృప్తి చెందుతున్నప్పుడు ఆతని ఆత్మశక్తి విజృంభిస్తుంది. ఒక మానవుడు దివ్య ప్రకృతితో తన జీవితానికి శ్రుతి గలుపుకున్నప్పుడు, తన అభీష్టం నెరవేరాలని పట్టుబట్టడు; వ్యక్తిగతాభిప్రాయాలను పెంచుకోనడు: స్వప్రయోజన సాధనకై కలవరపడడు. అతడిదృష్టి వికసిస్తుంది; అతడి విజ్ఞానం వృద్ధి అవుతుంది.'

"తాతా! నిజంగా నువ్వు మహాజ్ఞానివి. నువ్వే నాకు మార్గదర్శకుడివి కావాలి. నేను చాలా బాధ్యతగల వృత్తిని స్వీకరించానని క్రమక్రమంగా నాకు విశదమౌతూంది. ఒక రోజున, కొందరు మానవులప్రాణాలు నాకు అప్పగించబడతాయన్న విషయం తలుచుకోనేసరికి నాకు భయం పుడుతూంది."

వాంగ్‌కంగ్ ఆమె చేతిని తనచేతిలోకి తీసికొని ద్వారంవంకకు నడుస్తూ, "భయపడడ మెందుకమ్మా! నిశ్చయంగా భగవంతుడే నీకు ఈ వైద్యవృత్తిని నిర్దేశించాడు," అన్నాడు.

మూడవ సంవత్సరం ప్రారంభంలో పియావోచెన్‌కి ముందుగా ఒకరోగిని అప్పగించారు,

ఆమె ఆసుపత్రి మొదటి అంతస్తులోని వైద్యుల సావడిలో ప్రవేశించగానే ఆయా విద్యార్థుల పేర్లూ, ఆసుపత్రి స్థిరవైద్యుడు (Resident physician) వారికి అప్పగించిన

రోగులపేర్లూ వ్రాసి ఉన్న ఒకజాబితా అచటి బుల్లెటిన్ బోర్డుమీద ఆమెకు కనిపించింది. మార్క్ వ్రేలితో ఆపేర్ల పట్టికమీద పైనించి క్రిందికిగీస్తూ, "మిస్ షియావోచెన్! ఇదిగో నీపేరు! నువ్వు హెచ్ వార్డులో 56,110 వ నెంబరు రోగికి వైద్యం చెయ్యాలి."

ఆమె తన వైద్యవృత్తిలో మొట్టమొదటి రోగికి వైద్యం చేయటానికి అతడివద్దకు వెళ్లేందుకు తయారయేసరికి సాయంకాలం ఏడు గంటలయింది. చాలా పొడుగ్గా ఉన్న ఆ వసారాలో "హెచ్ బ్లాక్" నుండి బయటికి పోయే ద్వారంవద్ద ఎడమచేతివైపుకి తిరిగిన తరువాత "హెచ్-1" నెంబరు గదితలుపువద్ద ఆగింది. అక్కడ, తెల్లనిదుస్తులు వేసుకొని ఉన్న ఒక నర్సుని కలుసుకుని, తనకు అప్పగించిన రోగి నెంబరును ఆమెకు చూపించింది. వెంటనే ఆనర్సు ఆమెను రెండు వరుసలుగా మంచాలువేసి ఉన్న ఒకపెద్ద హాలులోకి తీసుకువెళ్లింది. ఆమెరోగి ఎడమచేతిప్రక్క వరుసలో మూడవ మంచంమీద పరుండి ఉన్నాడు. ఆ మంచం చుట్టు తెల్లని నూలు తెరవేసి ఉంది. ఆమెగుండె వేగంగా కొట్టు కొనడం మొదలుపెట్టింది. ధైర్యంచేసి, దీర్ఘశ్వాస తీసుకొని "క్షమించండి" అంటూ ఆ తెరను కొంచెం ప్రక్కకు తొలిగించింది.

ఆ మంచంమీద జాలిగొలిపే ఒకనల్లని వృద్ధరోగి కూర్చుకొని ఉన్నాడు. అతడు ఆమె వంకచూచి తన పళ్లులేని

బోసి నోటిని ప్రదర్శిస్తూ వికృతంగా నవ్వాడు. బక్కగా ఉండడం, శరీరపురంగు అసాధారణంగా ఉండడం తప్ప, అతడు మరేమంత సుస్తీగా లేడనుకుంది ఆమె. జాలిగా "ఎలా ఉన్నది బాబూ! మీ విషయం అంతా కనుక్కొని వ్రాసుకోనడానికి వచ్చాను. మీ వంట్లో ఎలా ఉంటున్నదీ వివరంగా చెప్పండి," అన్నది.

"నాకు జబ్బేమీ లేదమ్మా!" అని అతడు జవాబు చెప్పాడు.

"అయితే మరి ఇక్కడ కెలా వచ్చారు?"

"కొన్ని నెలలుగా నేను ఏదో సుస్తీగానే ఉంటున్నాను. కాని, ఆ సుస్తీయేమిటో ఎవరూ చెప్పలేక పోయారు. నాకొడుకు ఈ ఆసుపత్రిని గురించి ఎక్కడో విని, నన్ను తీసుకువచ్చి ఇక్కడ పడేశాడు. నాకు నా యింట్లో చచ్చిపోవాలని ఉంది; అంచేత నాకు ఇక్కడకు రావడము సుతరామూ ఇష్టంలేదు. ఏం చెయ్యను? నా కొడుకులమాట వినక తప్పకొచ్చింది; చాలా కాలంనుంచీ మరి వాళ్లే నన్ను పోషిస్తున్నారు!"

"మీ వంట్లో బాధలన్నీ దయచేసి నాకు చెప్పండి."

దాంతో ఆయన తన పుట్టుపూర్వోత్తరాల దగ్గర నించీ ప్రారంభించాడు: "నేను భూమి దున్నుకునే రైతుని. బ్రతుకంతా రెక్కలు విరుచుకుని కష్టపడ్డాను. నాకు ఆరుగురు కొడుకులు, ముగ్గురు ఆడపిల్లలు. నిర్భాగ్యురాలు

మా ముసలిది, మా కడగొట్టుపిల్ల పుట్టినవెంటనే చని పోయింది. ఆమె చావే మొదలు. నా శరీరానికి నలత పట్టుకుంది. ఊరికే తెగతింటూ ఉండేవాడిని. ఒక భోజనంలో పదిరొట్టెలు వేస్తే అజా పజా ఉండేదికాదు. అలాంటిది ఇప్పుడు రెండు, మూడు కంటే తినలేదు. నాముఖం పలచ బడి పోతూందని, కడుపు పెద్దదిగా పెరుగుతూందనీ మాత్రం కనిపెట్టాను. నాకు ఎక్కడా నెప్పులుగాని, పోట్లుగాని ఏమీ లేవు. కాని, ఎప్పుడూ ఎంచేతో ఒల్లమాలిన నీరసం. ఈమధ్య నా రంగుకూడా మారిపోయిందని మా వాళ్ళంతా అనడం మొదలుపెట్టారు.''

పియావో చెన్ తన నోటు పుస్తకంలో శ్రద్ధగా వ్రాసుకుంటూంది : ''నీరసం, బలహీనత, అగ్నిమాంద్యం, కామెలు: ఉదరం పెరగడంతోపాటు బరువు తగ్గిపోవడం.''

తరువాత, ఆమె రోగిని జాగ్రత్తగా పరీక్షించి, ఇంకోరకపు నోట్సు వ్రాసింది. ''బాగా ఎదిగిన,- కాని బక్కచిక్కి పోయిన - వృద్ధుడు. - కామెలరోగం ముదిరి నట్లు సూచించే చర్మం, పచ్చబడిన కళ్లు. గుండె, ఊపిరి తిత్తులు సమస్థితిలో ఉన్నవి. గర్భకోశంలో కుడివైపు పై భాగంలో కరుడుగట్టినట్టు గట్టిగా ఉంది.''

ఈ పరీక్ష ముగిసేసరికి, ఆమె వ్యాధి నిదానం సులభంగా తేలిపోయింది. ఆమె తన రోగివంక ఆదుర్దాగా చూచింది. అప్పటికే అతను బోసినోరు పూర్తిగా తెరుచు కొని గాఢనిద్ర పోతున్నాడు. మెల్లగా ఆమె తెల్లదుప్పటి,

తెల్లకంబళి అతడి బుజాలదాకా కప్పి, నిశ్శబ్దంగా మునివ్రేళ్ళ మీద నడుస్తూ వార్డు బయటికి వెళ్ళిపోయింది.

మరునాడు ఉదయం తొమ్మిదిగంటలకు మూడవ తరగతి విద్యార్థులందరు వార్డులో తమతమ రోగులను గురించిన రిపోర్టులు పట్టుకొని, అడావిడిగా ఇటూ అటూ తిరుగుతూ, తమతమ రోగుల లక్షణాలను గురించి, పరస్పరం చర్చించుకుంటూ ఉండగా, ప్రొఫెసర్ డన్‌లాప్ కొందరు గృహవైద్యులను వెంటబెట్టుకొని వచ్చి, అరచేతులు పిసుక్కుంటూ, "విద్యార్థులు, విద్యార్థినులు అంతా పదండి! ఇక మనం బయలుదేరవచ్చు," అని చిరునవ్వుతూ, ముందు నడిచాడు.

వాళ్ళంతా ఒక్కొక్క వార్డే చూచుకుంటూ, ఒక్కొక్క రోగివద్ద ఆగి చూస్తూ, ఒక్కొక్క విద్యార్థే తన కేసుని గురించి వ్రాసిన విషయాలను, చరిత్రను, రోగ నిదానాన్ని పరిశీలిస్తూ ముందుకు నడుస్తున్నారు. మాన్క్ తన రోగికి సన్నిపాతజ్వరం (Typhoid fever) అని నిశ్చయించాడు. చివరికి వారంతా పియావోచెన్ రోగివద్దకు వచ్చారు. ఆమె తన అభిప్రాయాలన్నీ సహేతుకంగా వివరించింది.

ప్రొఫెసర్ డన్‌లాప్ ఆమె అభిప్రాయాలకు ఆమోద సూచకంగా చిరునవ్వుతూ, "బాగున్నది, ఇకమరి వ్యాధి ఏమని నిర్ధారణ చేశావు?"

ఆమె భయపడుతూ, భయపడుతూ తన అభిప్రాయం సరికాకపోతే బాగుండునని ఆశిస్తూ, తీరా వాళ్ళంతా ఆ రోగి వద్దనుండి కదిలిపోబోతూన్న సమయంలో ధైర్యంచేసి, "కాలేయంలో పుట్టకురుపు" అని జవాబు చెప్పింది.

"భేష్! ఔను!" అన్నాడు ప్రొఫెసర్ డన్‌లాప్ అమిత సంతృప్తితో చిరునవ్వుతూ.

కాని, ఆమె హృదయం ఆనందించడానికి మారు క్రుంగిపోయింది. తనకు అప్పగించబడిన మొట్టమొదటి రోగికి మరణం తప్పనిసరి అవడం ఆమెకు అమిత దుఃఖం కలిగించింది. ఇప్పుడు, ఆమెకు ఈ రోగితో పని తీరిపోయి నప్పటికీ, ఆమె మళ్ళీ ఒకసారి ఆ వృద్ధరోగి మంచందగ్గరకు వెళ్ళివచ్చింది. ఆ తరువాత మళ్ళీ అతణ్ణి శవపరీక్షా సమయంలోనే ఆమె చూచింది.

ఆరోజు సాయంకాలం ఆమె తన తాతగారికి ఫోను చేసింది. ఆమె ఈ కళాశాలలో చేరిన తరువాత ఆయనకు, అంతకుపూర్వం ఒక్కసారి మాత్రమే ఫోనుచేసింది. "తాతా! నాకీవృత్తి నచ్చినదని ఇప్పుడప్పుడే చెప్పలేను. నాకు ఆందోళన, అలజడి కలిగించే విషయాలు దీనిలో చాలా కనిపిస్తున్నవి," అని ఫోనులో ఆయనకు చెప్పింది.

"ఏమిటమ్మా అలా అంటున్నావు?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు వాంగ్ కంగ్.

"నాకు అప్పగించబడిన మొట్టమొదటిరోగి, ఒక మంచిరైతు - కాలేయంలో పుట్టకురుపుతో ఈవేళ మధ్యాహ్నం చనిపోయాడు"; అని ఆమె రుద్ధకంఠంతో వివరించింది.

"తల్లీ! నువ్వలా చెప్పటం నాకెంతో సంతోషంగా ఉంది. నీకు అప్పగించిన రోగిపట్ల హృదయపూర్వకమైన ఆదరణ నీకు ఉన్నది. వైద్యులకు తప్పకుండా ఉండవలసిన ముఖ్యమైన ఉత్తమ లక్షణాలలో ఇది ఒకటి. అయితే, మంచివైద్యుడు గుండెనిబ్బరంతో, ధైర్యంగా, ప్రశాంతంగా ఉండాలనే సంగతికూడా నువ్వు జ్ఞాపకం పెట్టుకోవాలి. రోగులను గురించిన ఆదుర్దా మరీ ఎక్కువ అయితే వైద్యుడి మనస్సు సరిగా పనిచేయక తప్పటడుగులు పడవచ్చు," అన్నాడు వాంగ్‌కంగ్.

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఆయనే ఇంకా మాట్లాడుతున్నాడు, "తల్లీ! అసలు, చనిపోవడంతో జీవితం అంతమైపోతుందని నువ్వనుకుంటున్నావు. అది నిజంకాదు. చావనేది అందరికీ ఉన్నదే. కాని, అది ఇక్కడ మనకు ప్రేమాస్పదులైన వారినుండి వియోగం మాత్రమేకాని, చావంటే ఒక జీవితంలోనుండి మరొక జీవితంలోకి జరిగే మార్పు మాత్రమే అనీ, మరణానంతరం మళ్ళీ ఇలాంటిదే ఇంకొక జీవితం ప్రారంభమవుతుందనీ నువ్వుమనస్సుకు పట్టించుకోవాలి," అన్నాడు వాంగ్‌కంగ్.

"వైద్యవృత్తిలో నువ్వు, చనిపోయిన వారికోసం సంతాప పడుతూ కాలం వ్యర్థం చేయరాదు. బ్రతికిఉన్న

వారికోసమే నీశక్తియుక్తులన్నీ ఉపయోగించాలి. వెళ్ళి విశ్రాంతి తీసుకో! ఉదయానికి మళ్ళీ నీ మనస్సుకి కొంతబలం కలుగుతుంది.''

*　　　*　　　*

డీసెల్ ఇంజన్ దడదడలతో ఆ పాతబస్సు కష్టంమీద నాల్గవ తరగతి వైద్యవిద్యార్థులను మోసుకొని గుత్తులు గుత్తులుగా పోతూన్న రిక్షాలను, పాదచారులైన బాట సారులను తప్పించుకుంటూ ముందుకి సాగుతూ, చివరికి 'ఈస్ట్ సిటీ వాల్' అంచువద్దఉన్న ఒక తెల్లని భవనపు గేటు వద్ద ఆగింది. ఆ గేటు ఇనుముతో చాలా పెద్దదిగా, బరువుగా తయారు చేయబడింది. ఆ భవన గవాక్షాలన్నిటికీ ఇనుప కటకటాలు బిగించి ఉన్నవి.

ఆ విద్యార్థులంతా కారుదిగి లోపల ఉన్న ఉన్మాద వైద్యశాలలో ప్రవేశించారు. మానవలోకంలో అత్యంత అరాచకమైన ఆ సాంఘిక వాతావరణాన్ని వారు పరిశీ లించాలి. ఆ నిడుపాటి మండువాకు ఇటూ అటూ చెరి పన్నెండు గదులు ఉన్నవి. చివర ఒక పెద్దహాలు ఉన్నది.

ప్రొఫెసర్ లీ ఆ విద్యార్థు లందరినీ ఆ హాలులో సమా విష్టుల జేసి, ఒక్కొక్కరికి ఒక్కొక్క కేసు అప్పగించాడు. ఒక బంట్రోతు షియావోచెన్ ను మండువాకు కుడిప్రక్కన తాళంవేసి ఉన్న ఒకగదికి తీసుకువెళ్ళాడు. అతడు గది తలుపు తెరిచినా, లోపలికి ప్రవేశించడానికి ఆమె కొంచెం

వస్తాయించింది. లోపల మంచంమీద పరున్నరోగి శవం లాగ నిశ్చలంగాపడి ఉన్నాడు. ఆమె అనుమానంతో ఆ బంట్రోతు వంక చూచేసరికి, అతడు గ్రహించి, "నిశ్శ్చం డమ్మా! పాపం ఈయనవల్ల ప్రమాదమేమీలేదు. పైగా నేనిక్కడే ఉంటాను. అవసరమైతే పిలవండి."

ఆ రోగి ముప్ఫైఏళ్ళ యువకుడని స్పష్టంగా కని పిస్తూంది. చేతులు గర్భకోశం పైన మడిచిపెట్టుకొని, కళ్లు విప్పి గది కప్పువంకే నిశ్చలంగా చూస్తూ పడుకుని ఉన్నాడు. శ్వాస ఆడుతూ ఉండడం, కనురెప్పలు కదులుతూ ఉండడం కనిపెట్టకపోతే కేవలం శవమనే అనిపిస్తుంది. ఆమె కొన్ని నిముషాలపాటు అతణ్ణి పరిశీలించింది. ఆపైన, "మీ పేరేమి టండి?" అంటూ జాలిగా పలుకరించింది. అతడు పెదిమలు కదపడానికి కూడా ఏ విధమైన ప్రయత్నం చెయ్యలేదు. తన వద్దకు ఎవరో వచ్చిన సంగతి గ్రహించినట్లు కూడా కనిపించలేదు.

ఆమె మళ్లీ అడిగింది: మీ పేరేమిటండీ?" అప్పటికీ జవాబులేదు. తనరోగి మాట్లాడక పోవడంతో ఆమె చికాకు పడి, నోటుపుస్తకం తీసుకుని, "రోగి చరిత్ర తెలియదు. మాట్లాడడు," అని వ్రాసింది.

ఆపైన శరీర పరీక్ష ప్రారంభించింది. అతడి కను పాపలు పరిశీలించి హఠాత్తుగా ఎక్కువ వెలుతురును ఎదు ర్కొన్నప్పుడు వాటిలో కలిగే మార్పును గమనించింది. ఈ

సమయంలో ఆమె అతణ్ణి సన్నిహితంగా చూడడం తటస్థించింది. అతడు చాలా అందగాడవడం చూచి ఆమె చకితురాలైంది. అతడి కనుపాపల ప్రవర్తనను పరిశీలించేటప్పుడు, అతడి కన్నులు కొంచెం అటు ఇటు ఆడడం, పెదిమలపైన రవంత మందహాసం అంకురించడం జరిగింది.

తరువాత, మామూలు ప్రకారం – రొమ్ము, కడుపు, చేతులు, కాళ్లు, అన్నీ పరీక్షించింది. కండరాలు పరీక్షించి వాటి సంకోచ వ్యాకోచాలు చాలా అక్రమంగా ఉన్నవని గ్రహించింది. కాళ్లు, చేతులు సీసపు గొట్టాలలాగ కదలకుండా పడి ఉన్నవి. ఆమె తాను గ్రహించిన విషయాలన్నిటినీ సమీక్ష చేసుకొని, ఒక నిముషం ఆలోచించి, ముఖం చిట్లించి, తన నోటు పుస్తకంలో "వ్యాధి నిదానం:- స్కిజో ఫ్రేనియా కాటటోనియా" (యువకులలో కలిగే ఒకరకమైన ఉన్మాదం) అని వ్రాసింది.

నాలుగు గంటలయేసరికి ప్రొఫెసర్ వీ విద్యార్థులందరినీ మందువాకు ఉత్తర దిశమున్న సమావేశాల హాలులోకి పిలిచాడు. వాళ్లంతా ఎత్తైన స్టూలు బల్లలమీద ఆనుకొని కూచున్నారు. ప్రొఫెసర్ వీ వారిమధ్య ఒకరివద్దనించి ఒకరివద్దకుపోతూ వారికి అప్పగించిన కేసుల విషయంలో వారి పరిశీలనలు, నిర్ణయాలు అడిగి వింటున్నాడు.

షియావోచెన్ వంతు వచ్చేసరికి, ఆమె లేచి నిలబడి, "నా రోగి మాట్లాడలేదు, అందువల్ల రోగి చరిత్ర నాకు లభించలేదు," అన్నది.

"ఫరవాలేదు. అది సహజమే! నీ యితర నిర్ణయాలు చెప్పు."

ఆమె శరీర పరీక్షలో గమనించిన లక్షణాలను వివరించి, వ్యాధి, "స్కిజోఫ్రెనియా కాటటోనియా" అని కూడా ధైర్యంచేసి చెప్పివేసింది.

"శేష్! చాలా బాగుందమ్మా! ఔను. అదే వ్యాధి," అన్నాడు సంతోషంగా ప్రొఫెసర్ వీ. తరువాత ఒక్కక్షణమాగి తిరిగి విద్యార్థులందరినీ ఉద్దేశించి ఇలా అన్నాడు: "ఇది మీకు మంచి అవకాశం. ఒక్క మోతాదు సోడియం ఎమిటల్ ఇచ్చి ఈ రోగిని మాట్లాడించ వచ్చునన్న సంగతి రేపు మీకు ప్రత్యక్షంగా రుజువు చేసి చూపిస్తాను."

మరునాడు ఉదయం మళ్లీ బస్సు ఆ శ్వేతభవనం వంకకు పరుగిడుతూంటే, ఆమె హృదయం క్రమంగా బరువెక్కడం ప్రారంభించింది. విద్యార్థులలో కొందరు ఆ పిచ్చాసుపత్రిలోని రోగుల వికార చేష్టలను అనుకరిస్తున్నారు. ఇతరు లదిచూచి ప్రక్క ఎముకలు ముక్కలయేట్టు పగలబడి నవ్వుతున్నారు. షియావోచెన్‌కి మాత్రం, బాధపడుతూన్న తోటి మానవుల విషయంలో వారి నిర్దాక్షిణ్యా వైఖరి చూచి నవ్వుకి బదులు అమిత సంతాపం కలిగింది. నిన్న చూచిన ఆ రసమయ నేత్రాలను నేడామె మళ్లీ చూచింది. వీళ్ళంతా అతణ్ణి చూచి నవ్వితే, అతని

మనస్సు ఇంకా వికలమయి, బహుశః ఇక ఎన్నటికీ బాగు పడే అవకాశం కూడా లేకుండా చెడిపోవచ్చు," అని అను కున్నది.

ప్రొఫెసర్ పీ మగనర్సును పిలిచి, ఒక ఇంజెక్షన్ గొట్టంలో సోడియం ఎమిటల్ నింపి తీసుకు రమ్మని ఆదేశిం చాడు. ఆ పెద్దసూదిని చూడగానే షియావో చెన్ గుండె దడదడ కొట్టుకోసడం మొదలు పెట్టింది. ఆ మందువా వెంట తోటి విద్యార్థులతో పాటు తనరోగి గదిలోకి వెళుతూన్న ప్పుడు ఆమె కేవలమొక కీలుబొమ్మలా నడుస్తూంది. ఆగది తలుపు తాళంపెట్టి ఉంది. ఒక బంట్రోతు వచ్చి తాళం తీశాడు. ఆ గదిలో కనిపించిన దృశ్యం వారి నందరినీ ఆశ్చర్య చకితుల్ని చేసింది. నున్నగా గడ్డం చేసుకుని ఆ అందమైన యువకుడు ఒక స్టూలు బల్లమీద కూచుని ఉన్నాడు; అతడు లేచి నిలబడి, సవినయంగా వంగి అభి వందనంచేసి, "దయచేయండి" అని వారిని లోపలికి ఆహ్వానించాడు. అతని కన్నులు అటు ఇటు తిరిగి తిరిగి, షియావో చెన్ పై నిలచినవి. అతడు అందమైన చిరునవ్వు నవ్వాడు.

ఎవ్వరూ మాట్లాడలేదు. ప్రొఫెసర్ కూడా కలవర పడి, వాళ్ళందరినీ గదిలోంచి వెళ్లిపొమ్మని సంజ్ఞ చేశాడు.

"ఏమండీ!" అంటూ ఆ రోగి షియావో చెన్ ని పిలి చాడు. ఆమె వినిపించుకోనట్లు బయటికి జారింది. కాని, ఆమె హృదయంలోని ఆందోళనమాత్రం తగ్గలేదు.

ఆ యువకుని అందమైన ముఖాన్ని స్మరిస్తూ ఆమె అమితంగా సిగ్గుపడింది. ప్రొఫెసర్ పీ తలపంకించి, విద్యార్థులందరినీ కూచోనవలసినదిగా సంజ్ఞ చేశాడు. "స్కిజోఫ్రెనియా కాటటోనియా రోగికి సోడియం ఎమిటల్ ఇంజక్షన్ ఎంత అద్భుతంగా పనిచేసేదీ ప్రత్యక్షంగా మీకు చూపుదామనుకుంటే, ఆ అవకాశం కాస్తా మించిపోయింది. కాని, అంతకన్న గొప్పవిషయ మొకటి నేను మీకు వివరించే అవకాశం ఇప్పుడు కలిగింది. స్కిజోఫ్రెనియా కాటటోనియా రోగం హఠాత్తుగా కలిగిన మార్పువల్ల నివారణ అవుతుందని ప్రతీతి. ఇన్సులిన్, ఎలక్ట్రిక్ షాకుల వల్ల అది సాధ్యం కావచ్చును. లేక, కుటుంబంలో సంభవించిన మరణం వలనగాని,"-ఇక్కడ ఆయన చిరునవ్వుతూ కొంచెం తటపటాయించి, మళ్ళీ-"ప్రథమ దర్శన సమయాంకురిత ప్రణయం వల్ల గాని నయం కావచ్చు," అన్నాడు.

ప్రొఫెసర్ పీ అమర్యాదగా ప్రవర్తిస్తున్నాడని, మార్క్‌కి కోపం వచ్చింది. ఒక వికృతమైన ఆలోచన, ఏదో తెలియని భయం ఒక్కసారి అతణ్ణి నఖశిఖ పర్యంతం కదిలించింది. తానూ పియూవోచెన్ వరద వల్ల విడదీయబడిన రెండు చెట్లవలె ఉన్నట్లు, ఎప్పుడో ఏదో బలమైన ప్రవాహం వచ్చి వారి నిద్దరినీ శాశ్వతంగా విడదీసివేయగలదనీ, అతడికి అప్పుడప్పుడు అనిపిస్తూ ఉండేది. వారగా, కనుకొలకులగుండా పియూవోచెన్ ముఖం చూచాడు. ఆమె చెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రవారి ఉన్నవి. ప్రొఫెసర్ పీ

ఆమెను సమీపించి "మిస్ వాంగ్! ఈ పేషెంటు మామూలుగా మాట్లాడు గలుగుతున్నాడు గనుక, వ్యాధి చరిత్ర అంతా అడిగి వ్రాసుకో," అని హెచ్చరించాడు.

ఆమె తన తెల్లకోటు అంచులు సవరించుకొని, స్టెత స్కోపు గట్టిగా పట్టుకొని, తిరిగి తనరోగి గదిలోకి బయలుదేరింది.

రోగి మంచం మీద కూచుని ఉన్నాడు. ఆమె ప్రక్కనున్న స్టూలుమీద కూర్చున్నది. ఇద్దరూ కలవరపడుతున్నారు. ఆమె జేబులోంచి తెల్లని నోటు పుస్తకం తీసి, రోగివంక చూచి చిరునవ్వి, అతడి దృష్టి పూర్తిగా తన మీదనే కేంద్రీకృతమై ఉండడం కూడా గ్రహించి, మీ పేరేమిటండి?" అని ప్రశ్నించింది.

"లియాంగ్ కాయ్."

"మీ వయస్సెంత?"

"ఇరవై తొమ్మిది."

"వృత్తి?"

"ఉపాధ్యాయ వృత్తి."

"మీ అనారోగ్యాన్ని గురించి కూడా చెప్పండి."

"దయచేసి మీరు మా అమ్మగారి వద్దకు వెళ్ళి ఆమెను అడగండి. నేను ఎలా రోగగ్రస్తుడ నయినదీ వాస్తవంగా నాకు తెలియదు. ఆమె అడ్రసు: నెంబరు 50, పాన్ మీన్, హ్యూటంగ్," అని చెప్పాడు.

ఆ తరువాత రోగి ఏడవడం మొదలు పెట్టాడు. షియూవోచెన్ హృదయం కరిగిపోయింది. సానుభూతి ప్రకటించాలనుకున్నది. గాని, సాహసం లేకపోయింది. లేచి నిలబడి "నేను ఇక వెళ్ళాలి. మీరు నాకు ఇంకేమీ భోగట్టా చెప్పలేరుగా!" అన్నది.

కాయ్ తెల్లబోయి, మంజుస్వరంతో, "ఈ నా ఒంటరితనం అతిభయంకరంగా ఉంది. నిన్న మీ ముఖం చూచినప్పటి నుండి నా తల దిమ్ము క్రమంగా మాయమై పోయింది. ఇతర డాక్టర్లెవరూ నాకు ఈవిధంగా సహాయపడలేక పోయారు. దయచేసి మీరు మరొకసారి రాగలరా? మీ సందర్శనం నాకు ఆరోగ్యం కలిగిస్తూంది," అన్నాడు.

"వస్తాను లెండి," అని వాగ్దానం చేసి, "కాని, ఈ వేళే నేను ముందుగా మీ అమ్మగారిని చూడటానికి వెళ్ళవలసి ఉంది," అన్నది.

రాత్రి భోజనం కాగానే ఆమె ఒక రిక్షా చేసుకొని, తెల్లకోటు వదిలివేసి, నల్లని ముఖమల్ గౌను తొడుగుకొని బయలుదేరింది. రిక్షా ఒక చిన్న ఇంటి ముందు ఆగింది. ద్వారం ముందు ఉన్న నాలుగు కొయ్యమెట్లను ఎక్కిపోయి తలుపు కొట్టింది. ఒక్క పలుచని మధ్య వయస్సు స్త్రీ వచ్చి తలుపు తీసింది.

షియూవోచెన్ వంగి అభివందనం చేసి, సవినయంగా

తన పేరు వగైరాలు తెలియ జెప్పి, "మీ అబ్బాయి వద్ద నుండి మీకొక వార్త తీసుకొని వచ్చాను," అన్నది.

మిసెస్ లియాంగ్ ప్రత్యభివందనం చేసి, ఆదుర్దాగా "రండమ్మా! లోపలికి దయచేయండి," అని ఆహ్వానించింది.

"ముందుగా మీకు వెంటనే టీ ఇవ్వలేకపోయినందుకు క్షమించండి. నా బిడ్డను గురించిన వార్త అనడం వల్ల, ఆ మాత్రం వేచి ఉండేందుకు కూడా నాకు ఓపిక లేదు. దయచేసి వెంటనే చెప్పు తల్లీ! మా అబ్బాయి ఎలా ఉన్నాడు?"

పియావో చెన్ సంతోషంగా "మిసెస్ లియాంగ్! నేను మీకొక అద్భుతమైన శుభవార్త తీసుకు వచ్చాను. మీ అబ్బాయి వ్యాధి నయం అయే అవకాశం ఉంది. నేను వైద్యవిద్యార్థినిని. మీ అబ్బాయి ప్రస్తుతం నా చికిత్సలో ఉన్నారు. ఆయనే నాకు మీ చిరునామా యిచ్చి, ఈ వార్తను మీకు తెలియ జేయమన్నారు. నిన్న ఒక అద్భుత సంఘటన జరిగింది! అకస్మాత్తుగా ఆయన మాట్లాడడం ప్రారంభించారు."

మిసెస్ లియాంగ్ చేతులతో ముఖం కప్పుకొని అపరిమితానందంతో పరవశమై పోయింది. ఆమె చెక్కిళ్ళ కన్నీరు వాకలై ప్రవహిస్తోంది. పియావో చెన్ చేతులు గట్టిగా పట్టుకొని, "నా కడుపు చల్లగా ఎంత మంచిమాట

చెప్పావమ్మా! ఇది కల కాదు నిజమే అని నమ్మకం కలిగే టట్టు, మళ్ళీ ఇంకోసారి చెప్పు తల్లీ!'' అంది.

''లేదండీ! మీ అబ్బాయికి బహుశః తప్పకుండా నయమవుతుంది,'' అని పియావ్ చెన్ మళ్ళీ చెప్పింది.

''ఎంత తియ్యని తల్లివమ్మా! వెయ్యేళ్ళు బ్రతుకు నా తల్లీ! ఉండు. ఉండు. ఇక కాస్త టీ కలుపుకు వచ్చి ఇస్తానుండు తల్లీ! అంటూ లేచి వంట గదివైపుకి వెళ్ళింది. ఆమె తిరిగి వచ్చి కూర్చున్న మీదట పియావ్ చెన్ ఉప క్రమించి: ''మీ అబ్బాయిని గురించి కొన్ని ప్రశ్న లడుగు తాను, దయచేసి జవాబు చెప్పండి,'' అంది.

''అడుగు తల్లీ! అడుగు! నాకు తెలిసినంతవరకు అన్నీ చెపుతాను,'' అన్నది లియాంగ్

''ఆయన బాల్యం, విద్యాభ్యాసం, అనారోగ్యాలను గురించి మీకు జ్ఞాపక మున్న సంగతులన్నీ చెప్పండి.''

మిసెస్ లియాంగ్ చెప్పటం ప్రారంభించింది: ''వాళ్ళ తండ్రికి, నాకూ ఒక పెళ్ళిళ్ళ పేరయ్య ద్వారా వివాహం జరిగింది. వివాహం నాటి రాత్రివరకు మేము ఒకొళ్ళ నొకళ్ళం చూచుకోలేదు. అప్పటికి ఆయనకు పద్దెనిమిదేళ్ళు, నాకు పదహారు. మా దాంపత్యం సుఖంగా ప్రారంభ మయింది. అచిరకాలంలో పెద్దమ్మాయి పుట్టింది. కూతు రుని కన్నందుకు మా అత్తగారు నన్ను ఎంతో మెచ్చు కున్నది. కాని, మా రెండవ అమ్మాయి పుట్టినప్పుడు ఆమె

నన్ను గట్టిగా హెచ్చరించింది. మూడవ అమ్మాయి పుట్టి సరికి, పురిటిగది కిటికీవద్దకు వచ్చి రోజూ కొంత సేపు నన్ను తిట్టి పోసేది. ఇక మా "కాయ్" కడుపులో ఉన్నప్పుడు, నేను ఇంచు మించు ప్రతిదినం బుద్ధభగవానుడి దర్శనానికి వెళ్లి వచ్చేదాన్ని. ఇక వాడు పుట్టేసరికి మా కుటుంబానికి కలిగిన సంతోషానికి అంతూ పంతూ లేదు. పైగా, చాలా అందమైన పిల్లవాడు. వాడి తండ్రి, నాయనమ్మగారు కూడా చెట్టెక్కిపోయారు.

"ఇక బళ్ళో వేసినప్పటి నుంచీ మా కాయ్ చాలా చురుగ్గా చదివేవాడు. పీటా విశ్వవిద్యాలయంలో చేరి నప్పుడు వేదాంతం అభిమాన విషయంగా తీసుకున్నాడు. వాడిని తండ్రి ఇంజనీరింగ్ చదవ మన్నారు. వాడికి అది నచ్చలేదు. కాలేజీలో మా కాయ్ రెండో సంవత్సరం చదువుతున్నప్పుడు తండ్రి చనిపోయారు. తండ్రి చావు కాయ్‌ని తలక్రిందులు చేసింది. తండ్రికి తాను ఆశా భంగం కలిగించాననే విచార మొకటి వాడిని బాగా పీడించేది.

"ఈ సంతాపంలోనించి మళ్ళీ వాడు కోలుకోనేలేదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే ఉండేవాడు. ఇది వాడి చదువుకు మాత్రం ఏ విధంగానూ భంగం కలిగించలేదు. బియ్యే మొదటి తరగతిలో కూడా బాగా పరీక్ష ఇచ్చాడు. వాడికి చదువు చెప్పిన ప్రొఫెసర్ వాడికి ఆ కాలేజీలోనే తన సహాధ్యాపన్యాసకుడి ఉద్యోగం ఇప్పించాడు. ఆ ఉద్యోగం వాడికి

బాగా నచ్చినట్టే కనిపించింది. కాని, రెండవ సంవత్సరం వాళ్ళ కాలేజీ పరీక్షలు అయిపోయిన తరువాత తిరిగి వచ్చి నప్పుడు చాలా నలిగిపోయి, చిక్కిపోయి ఉన్నాడు. కొన్నాళ్ళువాడిని పర్వతాల మీదకు తీసుకుని వెళ్లి ఉంచా లని నిశ్చయించుకుని, "నిద్రా బుద్ధుని దేవాలయం"లో రెండు గదులు అద్దెకు తీసుకున్నాను.

"మా ప్రయాణంలో మొదటి రోజు సాయంకాలం మేము చాలాదూరం నడిచి, రాత్రి భోజనానికి ఒక చిన్న పల్లెటూరిలో మకాం చేశాం. తిరిగి బయలుదేరి నప్పుడు దారిలో వాడేమీ మాట్లాడలేదు. బాగా అలిసి ఉన్నాడు గదా అని, అందుకు అప్పుడు నేనేమీ ఆందోళన పడలేదు. ఆ మరునాడు ఉదయం నేను పెందలాడే లేచి, చిన్న "స్టౌ" మీద వాడికి ఇష్టమయిన ఉపాహారాలు చేశాను. నువ్వుల అప్పాలలో కాల్చిన మాంసం పూర్ణం లాగా పెట్టి రుచిగా చేశాను. అన్నీ తయారయిన తరువాత "నాయనా రాయ్! ఉపాహారానికి వస్తావా? నీకు బాగా ఇష్టమైన పిండి వంట చేశానయ్యా!" అని పిలిచాను.

"వాడేమీ జవాబు చెప్పలేదు. రెండు మూడుసార్లు పిలిచాను. చివరికి. వాడిగదిలోకివెళ్లి చూచాను. ప్రక్క మీద వెల్లికిలా పడుకుని, ఇంటి కప్పుకేసి చూస్తున్నాడు. నా ప్రశ్నలకు జవాబు చెప్పకపోగా, వాడి ముఖవైఖరిలో కూడా ఏమీ మార్పు కనిపించలేదు. నాకు భయం వేసింది. వెంటనే షియోహో ఆసుపత్రినించి ఒక డాక్టర్ని

పిలిపించాను. ఆయన మా కాయ్‌ని చాలాసేపు పరీక్షిం చాడు. అంతసేపూ అనుమానాస్పదంగా తల ఊపుతూనే ఉన్నాడు. తరువాత మా కాయ్ చేతిలో ఏదో పెట్టాడు. దాంతో మా అబ్బాయి కనురెప్పలు కదలడం ప్రారంభించి నవి. చుట్టూ ఒకసారి కలయజూచి, 'నాకు చాలా అలస టగా ఉందమ్మా! ఇంకా కొంతసేపు మెదలకుండా పడు కుంటాను.' అన్నాడు.

"డాక్టరు వెళ్లిపోయిన తరువాత కళ్లుమూసుకుని కుని మళ్లీ నిద్ర పోయాడు."

ఇంతవరకు చెప్పి ఆమె కళ్ళ నీళ్ళు తుడుచుకొన డానికి కొంచెం ఆగింది. వెంటనే పియానోచెక్ "మీకు బాధగా ఉంటే, ఇక పైన చెప్పడం మానేయండి," అంది.

"లేదమ్మా! తక్కినవిషయాలు కూడా నీకు చెప్పాలి. నేను డాక్టరుకి మళ్ళీ కబురు పెట్టాను. ఆయన వచ్చి, కాయ్‌ని ఆసుపత్రిలో చేర్చాలని, లేకపోతే అతడు తిండి తినక క్రమంగా కృశించి పోతాడని చెప్పాడు. ఆ రోజే ఆ డాక్టరు వాణ్ణి తీసుకునివెళ్ళి ఆ పిచ్చాసుపత్రిలో చేర్చాడు. అక్కడే నువ్వు వాణ్ణి చూచి ఉంటావు.

ఇంతవరకు చెప్పేసి, "నాకు వాణ్ణి ఎప్పుడు చూపి స్తావు? మామూలుగా అయితే వచ్చే బుధవారం వరకు చూడనీయరు. కాని, నేను అంతవరకు ఆగలేను తల్లీ!" అంది

"నేను ఆ ఆసుపత్రి సూపరింటెండెంట్ గారితో మాట్లాడి ఈ లోపుగానే మీకు ప్రత్యేకంగా అనుమతి ఇచ్చేటందుకు ప్రయత్నిస్తున్నాను. అప్పుడు మళ్లీ ఒకసారి మీ యింటికి వస్తాను," అని షియావో చెన్ ఆమెవద్ద సెలవు తీసుకొని బయలుదేరింది.

*  *  *

ఒకరోజు సాయంకాలం షియావో చెన్ తనగదిలోకి వెళ్ళేసరికి, ఆమె వచ్చిన వెంటనే తన తాతగారికి టెలిఫోన్ చేయాలని వ్రాసి పెట్టిన కాగితం ముక్కటి చూచుకున్నది. కంగారుపడి వెంటనే టెలిఫోను తీసింది. కొంతసేపటికి తాత గారి గొంతు వినిపించింది.

"తాతయ్యోనా? నీ వంట్లో ఆరోగ్యంగా ఉందా తాతయ్యా?" అని ఆదుర్దాగా అడిగింది.

"బాగా ఆరోగ్యంగా ఉన్నానమ్మా!" అని ఆయన సమాధానం చెప్పాడు. కాని, ఆయన కంఠస్వరం మామూలుగా లేదు. మాట్లాడుతూ రెండు మూడు సార్లాయన గొంతు సవరించుకోవలసి వచ్చింది. అయితే, జాగ్రత్తగా తూచి తూచి మాట్లాడేటప్పుడల్లా ఆయన అలా తడవ తడవకూ గొంతు సవరించుకొనడం మామూలే.

"ఈవేళ రాత్రి నువ్వు ఇంటికి రాగలవా? నీతో కొంచెం మాట్లాడవలసిన పని ఉంది," అని మాత్రమే ఆయన అన్నాడు.

"కాని, ఇప్పటికే బాగా పొద్దుపోయింది. తాతయ్యా! పోనీ ఫోనులో మాట్లాడకూడదూ ?" అన్నది పియూ వోచెన్.

"కాదు నువ్వు ఇక్కడికే రావాలి. ఈవాళ రాత్రికేరా!" అని ఆయన మళ్ళీ కచ్చితంగా చెప్పాడు.

అందువల్ల ఆమె వెంటనే గదిలోకి పరుగెత్తి, తన తెల్ల డ్రెస్సు వదిలివేసి, ఆకుపచ్చని పట్టు దుస్తులు, రాళ్ళ పోగులు ధరించి, రిక్షాలో వచ్చి తాతగారి గేటువద్ద దిగే సరికి చాంగ్మా సంతోషంగా పరుగెత్తుకొని వచ్చింది.

తాను చేసిన అపరాధ మేమిటో పియూవోచెన్ కి తెలియలేదు. అందుచేత "నాయ్ నాయ్ త్వరగా చెప్పు. తాతయ్యగారికి కోపం తెప్పించే పని నేను ఏమిచేశాను?" అని ఆమెను ప్రశ్నించింది.

"పిచ్చి తల్లీ! నీ కెరుక లేదా? నీతో చదువుకునే అబ్బాయంట, నువ్వు ఎవరో వెర్రి కుర్రోడితో స్నేహితం సేత్తున్నావని మీ తాతగోరికి రోజూ పోన్లో సెపుతుండాడంట!"

"అదా కథ? అంతే గద!" అని నిట్టూర్చింది పియూవోచెన్. ఇది మార్క్ చేస్తున్నపని అని ఆమెకు వెంటనే అర్థమయిపోయింది. ఆమె చాంగ్మాతో ఇంకేమీ మాట్లాడలేదు. ఈ సూచనతో సర్వసంసిద్ధంగా వెళ్ళి, తాత గారి గది తలుపు తట్టింది.

మనుమరాలిని చూడగానే తాతకోపం సగం కరిగి పోయింది. "కూచోవమ్మా!" అంటూ సౌమ్యంగా ప్రారంభించాడు, "నేను వెంటనే నీతో మాట్లాడవలసి రమ్మన్నాను. ఈ మధ్య నువ్వు నాకు చాలా ఆందోళన కలిగిస్తున్నావమ్మా! నువ్వు ఉన్మాద వైద్యశాలలో చికిత్స పొందుతూన్న ఒక యువకుడి వద్దకు చాలా తరచుగా వెళ్ళి వస్తున్నావట! ఆ సంగతి సందర్భాలేమిటో నాకు చెప్పు. నువ్వు ఇంకా ఇప్పటికీ అతడికి వైద్యం చేస్తున్నావా?"

ఆమె ధైర్యంగా ఆయన వంకచూస్తూ జవాబు చెప్పింది: "వట్టిది తాతయ్యా! నువ్వు విన్నదంతా నిజం కాదు. నువ్వు చెపుతూన్న యువకుడు చాలామంచివాడు. ఒక విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాడు. అతడికి దురదృష్టవశాత్తు నరాల వివశత్వం ఏర్పడింది. నేనాయనకు వైద్యం చేయవలసి వచ్చింది. ఇప్పుడాయన పూర్తిగా ఆరోగ్యంగా ఉన్నాడు."

"తల్లీ! నువ్వు పెద్దదానివి అవుతున్నావు. పురుషుడు నీ దగ్గరకు అకారణంగా తరచు వస్తూండడం మర్యాద కాదు. నేను నీకు పెద్ద చదువు చెప్పించాను. నీవు వాంగ్ వంశస్థురాలుగానే ఉండాలని నాకోరిక. నీవు అవలంబించిన వృత్తి గొప్పది. నీ జీవితం పూర్తిగా ఆ వృత్తికే అంకితం కావా!

ఆమె తాతగారి వంక దీనంగా చూచింది. కాని, లోపల మాత్రం కోపం అమితంగా రాజుకుంటూంది.

"తాతయ్యా! దయచేసి ఈ నా స్నేహానికి అడ్డు చెప్పకు. నాకు నా యీడువారిలో సన్నిహిత మిత్రు లెవరూ లేరని నీకు తెలుసు. నా స్నేహితుడు 'కాయ్'-ని కలుసుకునేటంతవరకు ఆలోపం నాకు తెలియలేదు. అందు వల్ల దయచేసి మా స్నేహానికి అభ్యంతరం చెప్పకు. ఆయన చాలా మంచివాడు. ఎన్నో ఉన్నతాశయాలు గల వాడు. ఆయనను చూస్తే నువ్వు ఎంతో మెచ్చుకుంటావు. ఎప్పుడైనా మన యింటికి తీసుకు వస్తానుందు," అని గ్రుక్క తిప్పుకోకుండా చెప్పేసింది.

ఇక ఆమె నెలా మందలించాలో ఆయనకు తెలియ లేదు, "ఇక ఈ విషయంలో ప్రస్తుతం నేను నీకు చెప్పగలి గిందేమీలేదు! నువ్వే నాకు మరికొంచెం వివరించి, కొంత కాలమైన తరువాత, అప్పటికీ నీ వాతనితో స్నేహంచేస్తూనే ఉండే యెడల ఆ కుర్రవాణ్ణి నా వద్దకు తీసుకురావచ్చు. మళ్లీ ఒకసారి నేను నీకు జ్ఞాపకం చేస్తూన్న దేమిటంటే నువ్వు వాంగ్ వంశపు పిల్లవని మాత్రం ఎన్నడూ మరచిపోకు, అన్నాడు.

* * *

చికిత్సా విభాగంలో ప్రత్యక్షాభ్యాసం చేసే చరమ సంవత్సరం వైద్య విద్యార్థుల శిక్షణ కాలంలో కష్టతమ మైనది. షియూవోచెన్ చాలా శ్రమపడి చదువుతూండడమే కాదు. రోజూ ఉదయాది అస్తమయపర్యంతం ఆమె నిర్వ

_ర్తించ వలసిన విధులే చాలా ఉండేవి. రోజుకి ఇరవై నాలుగు గంటలూ, వారానికి ఏడు రోజులూ ఆమెకు ఎప్పుడే పని తగి లేదీ తెలియదు. ఈ పనుల సందడిలో ఎప్పుడో వ్యవధి కల్పించుకొని, తరచు కాయ్‌ని చూచి వస్తూండేది.

ఈ కాలమంతా మార్క్‌కి చాలా కష్టంగా గడుస్తు న్నది. తాను ఓడిపోయాననే భయమేదో అతణ్ణి పీడించడ మారంభించింది. కాని, ఆ భావంతో అతడు పూర్తిగా సమాధాన పడలేకపోతున్నాడు.

ఒక రోజు సాయంకాలం ఆమె ఒక వైద్య సమా వేశానికి వెళ్ళి తిరిగి వస్తూంది. ఎవరో ఒక రోగి పరిస్థితిని గురించి మనస్సులో దీర్ఘంగా యోచిస్తూంది. ఆ రోగి ప్రాచీన మానవుల అస్థిపంజరాలను పరిశోధించడం కోసం మంగోలియా వెళ్లి ఆంటినో మైకోసిస్ (Antinomycosis) అనే వ్యాధిని వెంటబెట్టుకొని తిరిగి వచ్చాడు. చాలా రోజులు, నెలలు అమితమైన బాధపడిన మీదట అతడు మరణించాడు.

ఈ విషయం ఆమె గాఢంగా ఆలోచిస్తూ ఉండగా మార్క్ వచ్చి ఆమెను కలుసుకొని, "యేమిటో దీర్ఘంగా యోచిస్తున్నావు?" అని పలకరించాడు.

"ఆంటినో మైకోసిస్ వ్యాధితో మరణించిన ఆయువ కుణ్ణి గురించి ఆలోచిస్తున్నాను. పాపం అతని కుటుంబస్థితి తలుచుకుంటే నాకు జాలివేస్తూంది" అన్నది.

ఇటీవల మార్క్ ఆమెతో సౌమ్యంగా మాట్లాడడం లేదు. ఒక్కసారిగా అందుకుని, "సీతో వచ్చిన తంటాయే ఇది! ప్రతి స్వల్పవిషయం నీకేపట్టినట్టు బాధపడతావు!"

ఈ మాటకు జవాబు చెప్పేటప్పుడు ఆమె ముఖంలో క్రొత్త వెలుగు కనిపించింది. "సీతో వచ్చిన తంటా యేమి టంటే: ఎవరెంత బాధపడుతూన్నా జాలీ నాలీలేని నిర్దాక్షిణ్యం. తెలివైన డాక్టరు వాస్తవమైన సానుభూతి ప్రకటించడం వల్ల నివారణ అయే వ్యాధులు చాలా ఉన్నాయనే విషయం నిజానికి నీకూ తెలుసుననుకుంటాను."

"తెలుసు, తెలియకేం. నరాల బలహీనతగలవారి విషయమేగా!" అన్నాడు కొంచెం వెటకారంగా.

ఆమె ముఖం ఎర్ర బారింది. "నరాల బలహీనతా? వైద్యులకు ఇదొక పెద్ద సాకు. తమకు ఏమీ అంతుపట్టని రోగాలన్నిటికీ ఈ పేరు పెడతారు. చేతకాని డాక్టర్లకు ఇదొక చెత్తకాగితాల బుట్టగా ఉపయోగపడుతూంది. నేనలా వదిలిపెట్టను. రోగి పూర్వచరిత్రను, ఆహార విహారాది అభ్యాసాలను విమర్శించి లోపం ఎక్కడ ఉన్నదో కనిపెట్టడానికి ప్రయత్నిస్తాను. నిజానికి మార్క్! ఈ పని చేయడం వైద్యులందరి విధ్యుక్త ధర్మం కాదూ?"

ఈవివాదంలో కూడా తనకు విజయం దూరమవడం చూచి, అతడామెకు 'గుడ్ బై' చెప్పి తనగదికి వెళ్లిపోయాడు.

మరునాడు ఆసుపత్రిలోని వివిధ రోగులను పరీక్ష చేసే టప్పుడు ప్రొఫెసర్ డీన్ ఒక ముఖ్యమైన కేసును గురించి చర్చించడానికిగాను ప్రత్యేక శిక్షణ పొందుతూన్న వైద్య విద్యార్థులను, ఆసుపత్రి డాక్టర్లను, వారి సహాయకులను ఒకచోట సమావేశ పరిచాడు.

సన్నీ అనే వైద్య విద్యార్థి ఆరోగి శారీరక లక్షణాల చరిత్రను వివరించాడు.

రోగి ఇరవై నాలుగు సంవత్సరాల వయస్సు గల యువతి. పదహారేళ్ళప్పుడు ఆమెకు వివాహం జరిగింది. ప్రథమతః ఈ సంవత్సరమే గర్భవతి అయింది. అప్పటినించి ఇంచుమించు ఎడతెరిపి లేకుండా డోకుకుంటూంది. ఆమెను ఈ ఆసుపత్రిలో చేర్చేసరికి బాగా ఎండిపోయి, కామెల లక్షణాలతో, జ్వరంతో బాధపడుతూంది. ఆమె డోకులు ఏ మాత్రం తగ్గలేదు. పైగా కడచిన మూడురోజులుగా జ్వరం చాల ఎక్కువగా వస్తూంది.

ప్రొఫెసర్ డీన్ తన గొంతు సవరించుకొని, "రోగి పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉంది. వైద్యగ్రంథాల ప్రకారం ఆమె 'గర్భవతులకు వచ్చే ప్రమాదకరమైన వమనాలవ్యాధి'తో బాధపడుతూంది. ఇక ఇరవై నాలుగుగంటల లోగా ఆపరేషన్ చేసి గర్భాన్ని తీసివేయకపోతే, ఆమె చనిపోతుంది," అన్నాడు.

ఆయన గది నాలుగు వైపుల కలయ జూచాడు.

"ఈ విషయం ఆమె బంధువులతో మాట్లాడాలి.. మీలో ఎవరైనా ఈ పని చూడాలి," అన్నారు. అక్కడ ఉన్న వారిలో చాలామంది వేరు వేరు రాష్ట్రాలనుంచి వచ్చి వేరు వేరు యాసలతో మాట్లాడేవారు. పెకింగ్ ప్రాంతపు భాషను చక్కగా మాట్లాడగలగడం వల్ల ఈ పని షియావో చెన్ కి అప్పగించబడింది.

ఆమె ఆ రోగి ఉన్న వార్డులోకి వచ్చేసరికి, ముందుగా హాలులో ఆందోళన పడుతూన్న ఒక పురుషుణ్ణి చూచింది. అతడే ఆమె భర్త అయి ఉంటాడని ఆమె గ్రహించింది. "మిస్టర్ యాంగ్ మీరేనా?" అని అతణ్ణి ప్రశ్నించింది.

"అవునండి!" అని అతడు సమాధానం చెప్పాడు.

"మీ భార్యకు చాలా సుస్తీగా ఉన్నదని బహుశః ఇదివరకే మీరు విని ఉంటారు. ఆమె ప్రాణం కాపాడా లంటే, శస్త్రచికిత్స చేసి గర్భాన్ని తీసివేయక తప్పదని, ఇచటి అనుభజ్ఞులైన వైద్యులంతా ఏకగ్రీవంగా నిర్ణయించారు."

ఈ మాట విని ఆ యువకుడు మొహాన చేతులు పెట్టుకొని ఏడుస్తూ, "వద్దు వద్దు" అని అరిచాడు.

"మీ భార్య ప్రాణం కాపాడుకోవాలని లేదా మీకు?"

"ఉన్నది. దాని ప్రాణం కాపాడాలని నేను ఎంత ఆందోళన పడుతున్నదీ భగవంతుడికి తెలుసు. కాని, ఈ

పనికి మా తల్లిదండ్రులు ఎంతమాత్రం ఒప్పుకోరు. వారికి నేనొక్కణ్ణే కొడుకును. నాకు ఇంతవరకు సంతానం కలుగలేదు. మా అమ్మ మనుమడు పుట్టాలని ఎంతకాలం నించో ఎందరో దేవుళ్ళకు మొక్కింది!'' అన్నాడు నిస్పృహతో

''పరిస్థితి అంతా నేను వివరంగా చెపితే, బహుశః మీ అమ్మగారు కూడా ఒప్పుకుంటారనుకుంటాను,'' అన్నది సౌమ్యంగా.

''చెప్పి చూడండి! నాకు తెలుసు. ఆమె ఎంత మాత్రం ఒప్పుకోదు,'' అన్నాడు.

ఆమె అక్కడినించి, 'కె-3' నెంబరు నడవకు కుడి ప్రక్కన ఉన్న ఆ రోగి గదిలోకి వెళ్ళింది.

ప్రక్కమీద ఒక స్త్రీ శవంలాగ పడి ఉంది. అంత కన్న పెద్దవాళ్ళు మరి ఇద్దరు స్త్రీలు ఆగదిలో ఉన్నారు. వారిలో నిలబడి ఉన్నఆమె ఆ రోగి తల్లి. రెండవ ఆమె అత్తగారు.

షియావోచెన్ ఆ రోగితల్లితో, ''ఏమండీ! మీ అమ్మాయి స్థితి చాలా ప్రమాదకరంగా ఉంది. ఈ వ్యాధి అంతటకీ ఆమె గర్భమే కారణం. ఆమెను కాపాడాలంటే ఆ గర్భం తీసివెయ్యక తప్పదు.''

వెంటనే అత్తగారు తనకుర్చీలోంచి లేచి గబగబా నడుస్తూ షియావోచెన్ ఎదటికివచ్చి నిలబడింది. గుండ్రని

ఆమె ముఖం ఆవేశంతో సుళ్ళు తిరుగుతూంది. "వీల్లేదు. నా మనుమణ్ణి హత్య చేయడానికి నేను ఒప్పుకోను. వాడి కోసం అనేక సంవత్సరాలనించి నేను వెయ్యి దేవుళ్లకు మొక్కాను," అన్నది.

అత్తగారు తల్లివంక గుర్రుమని చూడడంతో పరిస్థితి బాగా విషమించింది. చివరికి షియావో చెన్ ధైర్యంగా, "ఇప్పుడు ప్రశ్న: తల్లి, బిడ్డలలో ఎవరి ప్రాణం కాపాడాలా? అని కాదు. గర్భం తీసివేయకపోతే రోగికీ, ఆమె గర్భం లోని పిండానికీ కూడా మొప్పం వస్తుంది," అని వివరించింది.

అత్తగారు చేతులు జోడించి ఇలా అరిచింది: "నా కోడలికి ఏమి వైద్యం చేయించవలసిందీ నాకు ఎవరూ చెప్ప నక్కరలేదు. ఆమె నాబిడ్డ భార్య. ఆమె బాధ్యత మాది. ఇక మా యింటికి తీసుకువెళ్ళి మాకు నచ్చిన వైద్యుడికి చూపించుకుంటాం," అన్నది.

అత్తగారైతే మాత్రం అంత క్రూరంగా మాట్లాడడం షియావో చెన్‌కి ఆశ్చర్యం వేసింది. దానితో ఆమె ఆ విషయమంతా తన ప్రధాన వైద్యుడికి తెలియజేయడానికి గదిలోంచి బయటికి వచ్చింది.

ఇంతలో ఆమెకు మరొక ఆలోచన తట్టింది. ఆ రోగిని ఆసుపత్రిలో నుంచి తీసుకువెళ్లక తప్పదని ఆమె అత్త గారు పట్టుపడుతూంది. ఆ కుటుంబ యజమానుల అంగీ

కారం లేకుండా ఆపరేషన్ చేయడానికి వీలులేదు. తిరిగి రోగి భర్తవద్దకు వెళ్లి పియూవోచెన్ ఇలా అంది: "మా తాతగారిని పిలిచి మీ భార్యకు వైద్యం చేయగలరేమో కనుక్కుంటాను. మా తాతగారు - వాంగ్ కంగ్ - గొప్పపేరు పొందిన వైద్యులని బహుశః మీరూ వినే ఉంటారు."

"అవును. పెకింగ్‌లో వారిపేరు వినని వాళ్ళెవరు? కాని, అంత ఖర్చు మేము భరించడం సాధ్యం కాదు."

"ఖర్చు విషయం మీరేమీ ఆందోళన పడకండి. మీకు ప్రత్యేకంగా ఫీజు తగ్గించమని నేను మా తాతగారితో చెపుతాను."

తాతగారికి ఆమె ఫోన్ చేసింది. విదేశ వైద్యులలో ఆమె కెంత నమ్మకమున్నా, తన వైద్య ప్రతిభలో కూడా ఆమెకు విశ్వాసం ఉన్నందుకు ఆయన ఎంతో సంతోషించాడు.

* * *

ఈ రోగికి తాతగారు చేస్తున్న వైద్యఫలితం తెలుసుకొనడానికి పియూవోచెన్ మూడువారాలు నిరీక్షించింది. ఆ పైన ఓపిక పట్టలేకపోయింది. టెలిఫోన్ తీసి తాతగారిని పిలిచింది:

"తాతా! ఇంకొక నెలరోజులలో మాకు వైద్యపు పట్టాలు ఇచ్చేస్తారు. ఆ రోజున నువ్వుకూడా ఇక్కడికి రావాలి!"

"ఆ గొడవలన్నీ నాకు పెట్టకు తల్లీ! ఆ రోజుకి మన చాంగాన్ గాణ్ణి పంపుతాలే" అని, ఆయన విషయం మార్చి, "అన్నట్టు మరిచి పోయానమ్మా! నువ్వు నాకు అప్పగించిన రోగికి రోకులుకట్టి కులాసాగా ఉందమ్మా!"

"నిజంగానా తాతయ్యా?

"నువ్వు వెళ్ళి ఆమెనుచూచి రావమ్మా!"

"ఆమె కడుపులో పాప కూడా క్షేమంగా ఉందా!"

"ఆహా! చక్కగా ఎదుగుతూంది."

"నువ్వు...నువ్వు అద్భుతమైన వైద్యుడివి తాతా! నువ్వు ఏం చేశావో అంతా నాకు చెప్పాలి."

"అదంతా మా చైనా వైద్య రహస్యమమ్మా;... నువ్వు ఈ తడవ ఇంటికి వచ్చినప్పుడు చెపుతాలే."

ఆమె టెలిఫోను పెట్టేసి, వెంటనే ప్రొఫెసర్ డీన్ దగ్గరకు పరుగెత్తింది. ఆ సంగతంతా చెప్పేసరికి, ఆయన చిరునవ్వుతూ, ఆమె వెన్నుతట్టి, "తెలియని వారికి చైనా దేశీయవైద్యం అంతా మాయలు మంత్రాలతో, కట్టు కథలతో, బాధాకర చికిత్సలతో, ఏవేవో పట్టీలతో కూడిందిగాను, నిరుపయోగకరంగాను కనిపించవచ్చు. కాని, వాళ్ళ అభిప్రాయం చాలా తప్పు. ముఖ్యంగా, ఈ కేసు సంగతి నేను అమెరికా వైద్యసంఘానికి వ్రాయదలుచు కున్నాను. మీ తాతగారు వాస్తవంగా చాలా గొప్ప వైద్యులు," అన్నాడు.

శస్త్ర చికిత్స అంటే పియాహో చెన్ కి సరదా ఏర్ప డింది. ఇప్పుడు, ఆమె వైద్యవిద్యాభ్యాసం పూర్తికావస్తు న్నందువల్ల, ఆమెను ఆపరేషన్ల జట్టులో వేశారు. ఒక రోజున ఆపరేషన్ గదివెలుపల బోర్డుమీద ఆపరేషన్ చేసే సర్జనుకి సామాన్లు అందించే తోటి సర్జనుగా తనపేరు వ్రాసి ఉండడం చూచి ఆమె ఆశ్చర్యపోయింది.

అది సీజరియన్ సెక్షన్ (గర్భకోశం) తాలూకు ఆప రేషన్. ఆమె వెంటనే వెళ్ళి తన పాఠ్య పుస్తకంతీసి ఆ ఆప రేషన్ పరికరాలను, వాటి అభివర్ణనలను, ఫొటోలతో సయితంగా చూచి జ్ఞాపకం తెచ్చుకొన్నది. అయినా, తృప్తిలేక ఆపరేషన్ గది సూపర్వైజర్ మిస్ వైట్ సైడ్ దగ్గరకు వెళ్ళింది. ఆమె బక్కగా పొడుగ్గా ఉన్న దాదాపు యాభైయ్యేళ్ళ స్త్రీ. వైద్య కళాభ్యాసం చేసే విద్యార్థులంటే ఆమెకు తగని విసుగు. "ఆపరేషన్ ఇప్పుడు కాదు, తొమ్మిది గంటలకి," అని ఆమె పియాహో చెన్ని కసరింది.

ఆ సంగతి నాకు తెలుసు మిస్ వైట్ సైడ్! కాని, నాకు కొంచెం కంగారుగా ఉంది. మా ప్రొఫెసరు ఆప రేషన్ పనిముట్లను ఎంత వేగంగా అడిగేదీ మీకు తెలుసు. అయినా, ఇంత త్వరగా ఇక్కడికి రావడం మంచిదికాదని నే నెరుగుదును. కాని, ముందుగా ఆపరేషన్ పనిముట్లన్నీ సిద్ధం చేయడానికి మీకు సహాయపడాలని మాత్రమే నా

కోరిక. ఇందుకు మీరు అభ్యంతరం చెప్పరనే ఆశతో వచ్చాను.''

ఆమె వినయవిధేయతలు, శ్రద్ధ చూచి మిస్ వైట్ సైడ్ ముచ్చటపడి, ''సరే లేరా! ఆ పనే ప్రారంభించబోతున్నాను,'' అంది.

ఆమె పెద్దగాజుపెట్టె తెరిచింది. షియావోచెన్ ఒక్కొక్క పనిముట్టే జాగ్రతగా తీసి, వాటిపేర్లు అన్నీ చెపుతూంది. మిస్ వైట్ సైడ్ వాటి పేర్లన్నీ వ్రాస్తూంది.

''నల్భై హోల్ సైడ్ లు, ఇరువైయ్యైదు కెల్లీలు, పది వంపుతిరిగిన ఆప్నర్లు, పది వంపులేని ఆప్నర్లు...''

మిస్ వైట్ సైడ్ సంతృప్తిగా చిరునవ్వి, నీకు పనిముట్లన్నీ బాగా తెలుసునమ్మా! నువ్వు వృద్ధిలోకి వస్తావు!'' అన్నది.

''ధన్యవాదాలు మిస్ వైట్ సైడ్! వెనక ఎప్పుడో ఒక వైద్యవిద్యార్థి సమయానికి సరియైన పనిముట్టు అందింపక మరొక పనిముట్టు అందించే సరికి, ప్రొఫెసర్ విసిరి కొట్టాడనీ, దాంతో ఆ విద్యార్థికి గాయంకూడా తగిలిందనీ నేను విన్నాను. అలాంటిదినాకే జరిగితే నేను అవమానంతో చచ్చిపోతాను.''

''అలాంటి పని నువ్వు ఒక్కనాటికి చెయ్యవులే మిస్ వాంగ్

ఆపరేషన్ సమయం సమీపించే సరికి, పియ్యానో చేన్‌ని మామూలు దుస్తులన్నీ వదిలివేసి, తుషారస్నానం చేసి రమ్మన్నారు. తరువాత ఒకటోపి, ఒక బురఖా, కాన్వాస్ జోళ్ళు, తెల్లని ఒక గౌను ఇచ్చారు. పిమ్మట ఆపరేషన్ చేసే హాలును అనుకొని ఉన్న ఒకచిన్న గదిలోకి తీసుకు వెళ్ళారు. అక్కడే ఆమె ప్రొఫెసరు, ఇంకా చాలా మందీ చేతులు రుద్దుకుంటున్నారు.

ఆపరేషన్ చేయించుకునే గర్భిణీ స్త్రీని చక్రాల కుర్చీలో కూచోబెట్టి లోపలికి తీసుకువచ్చారు. మత్తుమందు ఇవ్వడంలో ప్రత్యేక శిక్షణపొందిన మిస్. హాపే మత్తుమందు బండిని రోగి తలవద్దకు తీసుకునివచ్చింది. వెంటనే రోగి ముఖం మీద ఒక ముసుగుతొడిగి ఈథర్‌ను విడిచిపెట్టడం మొదలు పెట్టింది. మొదట, రోగి బరువుగా ఊపిరి పీల్చడం ప్రారంభించి, క్రమంగా తేలికపడి చివరకు గాఢనిద్రపోయింది. ప్రథమ ద్వితీయ సహోద్యోగులు ఆమె పొత్తికడుపుపైన ఎర్రని క్రిమి సంహారక ఔషధం పూతపెట్టారు. మిగిలిన శరీరమంతా పరిశుభ్రమైన గుడ్డలతో కప్పారు.

ప్రధాన శస్త్రి చికిత్సకుడు బల్లకు ఎడమ ప్రక్కన మధ్యగా నిలబడ్డాడు. ఆయనకు రెండువైపుల సహాయచికిత్సకులు, పరికరాలందిచ్చే పియ్యానోచెన్, గాయానికి కట్టుకట్టేటప్పుడు తోడ్పడే నర్సూ నిలబడి ఉన్నారు.

లెక్క ప్రకారం పొత్తికడుపు చర్మం కోయడం

ప్రారంభించాడు. అన్ని చేతులూ పియూవో చెన్ వైపే సాచబడి ఉన్నవి. అన్ని చేతులకు అన్ని పరికరాలను ఆమె చకచక అందిస్తున్నది.

సర్జన్ చర్మాన్ని కత్తిరిస్తున్నప్పుడు ఆమె "హాల్ స్టెడ్" అని చెప్పి అందించింది. పెరిటోనియం పొరవద్దకు రాగానే "కెల్లీ" అంటూ మరొక పరికరాన్ని అందించింది.

గర్భకోశాన్ని తెరిచేసరికి, నల్లని వెంట్రుకలు గల చిన్న తల, తరువాత క్రమంగా భుజాలు, శరీరం, కాళ్ళూ కనిపించి శిశూదయం అయింది.

ప్రొఫెసర్ డీన్ చాలా కాలంనించి చైనాలో ఉండడంవల్ల, చైనాలో పద్ధతులన్నీ ఆయనకు తెలుసు. ఏ శిశువైనా గీ నిర్ధారణ చేయడానికి గాను ఆయన ఆ పాపను త్వరగా రెండో వైపు త్రిప్పిచూచి. "భేష్! మొగపిల్లవాడు. జనరల్ చాంగ్ కి వారసుడు పుట్టాడు," అని ప్రకటించాడు.

పిమ్మట తన ప్రథమ సహాయ శస్త్రి చికిత్సకుని వంకకు తిరిగి, "ఈ పాపను తీసికుని వాడి పనిచూడు," అన్నాడు.

ఆసుపత్రిలోనే మకాంగా ఉండే ఆ డాక్టరు శిశువును తీసికొని ముందుగా వేడినీళ్ళ తొట్టిలోను, తరువాత చన్నీళ్ళ తొట్టిలోను ముంచితీశాడు. దాని గొంతులోని పొర ఊదివేశాడు. దాంతో ఆ చిన్న ముఖం క్రమంగా సుళ్ళు తిర

గడం ప్రారంభమవడం, నోరు విప్పారడం, రొమ్ము పైకి క్రిందికి కదలడం, చివరకు కెవ్వున కేకపెట్టి ఏడవడం జరిగింది.

"భవిష్యత్తులో మనకు జనరల్ కానున్న వ్యక్తి అదుగో అరుస్తున్నాడు," అన్నాడు తల్లి పొత్తికడుపును కుట్టివేస్తూ ప్రొఫెసర్ డీన్.

పియూవోచెన్ ప్రశంసామయ దృష్టితో తన ప్రొఫెసర్ వంకచూస్తూంది. "వైద్యశాస్త్ర మంతటిలో నిజానికి శస్త్రి చికిత్సావిధానమే అత్యద్భుతమైనది" అనుకున్నది. "నన్నుకూడా ఆపరేషన్లు చేయనిచ్చినప్పుడే, నేనుకూడా ఒకడాక్టర్నిఅనే అభిప్రాయం వాస్తవంగా నాకు కలుగుతుంది. శస్త్ర చికిత్సలో నైపుణ్యం సంపాదించేవరకు నాకు తృప్తిలేదు, అనుకుంది.

ఆమె విద్యాభ్యాసం పూర్తిచేసి, పట్టా పుచ్చుకొనే రోజు తెల్లవారింది. క్రొత్తగా డాక్టర్లు కాబోతున్న ఇరవై ముగ్గురి జీవితాల్లో ఆనాడు మహా పర్వదినం. పాపం వీరి సహాధ్యాయులలో నాల్గింట మూడువంతుల మంది వేరువేరు వైద్య పరీక్షలలో ఉత్తీర్ణులు కాలేక వెనుకబడిపోయారు.

చివరికి పట్టప్రదాన సభలో మొదటివరుసలో కూర్చుని ఉన్న పియూవోచెన్ కంగారుగా అటు ఇటు కదులుతూంది. తానేదో తోడులేక ఏకాకిగా ఉన్నట్టు ఆమె మథనపడుతూండడంవల్ల, డాక్టర్ హ్యూపిన్ ఉప

న్యాసమేమీ ఆమె చెవికెక్కలేదు. ఆమెతోపాటు పట్టా పొందుతున్న వారిలో మరొక్క యువతి మాత్రమే ఉంది. ఆమె తల్లి ఆవేళ అంతా ఆమె కూడాకూడా తిరుగుతూ, కూతురి శిరోజాలంకరణాన్ని గురించి, దుస్తులనుగురించి నానా గొడవ చేస్తూంది. ఆ తల్లి ఆనందానికి, గర్వానికి అంతు లేదు. ఆ రోజు సాయంకాలం బంధువులందరినీ తన ఇంటికి భోజనానికి పిలిచింది. పియాంగ్ చెన్ విషయం ఆలోచించిన వారేలేరు. పాపం! ఆమె మేనత్తలలోనైనా ఎవరైనావస్తే బాగుండేది. ఎవ్వరూ రాలేదు.

ఈ వైద్య పట్టం పొందటానికి ఆమె మూడవది. సభా వేదికపైనుండి ఆమె క్రిందికి దిగి, తిరిగి తన కుర్చీవద్దకు వచ్చిన తరువాత కూడా తన ఒంటరితనాన్ని గురించిన భావనలవలన ఆమె అలాగే నిశ్చలంగా కూచుంది. తాను డాక్టరయాననే విషయం ఆమె మనస్సుకి తట్టినట్టే లేదు.

తరువాత ఎక్కడో దూరంనించి లాగ డాక్టర్ శోఫ్రేన్ ఇలా అనడం ఆమెకు వినిపించింది: "ప్రతి సంవత్సరం ఈ కళాశాలలో వైద్యపట్టం పొందిన విద్యార్థులలో విద్యావిషయంలోను, వృత్తిమర్యాదలలోను, సర్వతోముఖ ప్రతిభ, అత్యుత్తమ నైపుణ్యం ప్రదర్శించిన ఒక విద్యార్థిని ఎన్నికచేసి, ఒక ప్రత్యేకబహుమానం ఇచ్చే ఆనవాయతీ ఉన్నది. కీ. శే. డాక్టర్ థామస్ వెన్‌హాం తన మరణశాసనంలో వ్రాసిన ప్రకారం ఈ బహుమాన ఇవ్వబడుతున్నది. ఈసంవత్సరం ఈబహుమానాన్ని డాక్టర్ పియాంగ్

చెన్ సంపాదించుకొన్నదని ఈ కళాశాల ఆచార్యబృందం పక్షమున నేను ఆనందంగా ప్రకటిస్తున్నాను.

ప్రేక్షకులంతా చెవులు చిల్లులు పడేటట్టు చేస్తున్న హర్ష ధ్వానాల మధ్య, ఆమె మరమనిషిలాగ లేచి, సభా వేదిక వంకకు నడిచివెళుతూంది. ఒక చేత్తో తన గౌనును కొంచెం పైకి పట్టుకుంది. రెండవచేత్తో తన నలుచదరపు టోపీని సర్దుకుంటూంది. బహుమానం తీసుకొని, ఆమె ఎంతో నాజూకుగా వంగి అభివాదనం చేస్తూ సన్నగా, "ధన్యవాదాలు ప్రొఫెసర్!" అంది.

రెండవ దఫా వేదిక దిగి వెనుతిరిగి వస్తూండగా, అప్పటికీ ప్రేక్షకులంతా పెద్ద గందరగోళంగా హర్ష ధ్వానాలు చేస్తూనే ఉన్నందువల్ల, ఆమె కృతజ్ఞతా పూర్వకంగా వారివంక చూడవలసి వచ్చింది. ఆ సమయంలోనే ఆమె ఆయనను చూచింది. ఆమె కూర్చున్న వరసకు సరిగా రెండు వరుసలు వెనుకగా కూచుని ఉన్నాడు,–ఆమె తాతగారు వాంగ్ కంగ్. ఒక్కసారిగా తాతగారివద్దకు పరుగెత్తాలనుకున్నది. కాని, ఆ పరిస్థితిలో ఆయన వంక చూచి సన్నగా చిరునవ్వడం తప్పవేరేమి చేయలేక పోయింది.

ఘన వైద్యుడు ఆ తాతగారు మనుమరాలితో చాలా విషయాల్లో భిన్నాభిప్రాయాలు ప్రకటించి పట్టుపట్టి చూచాడు కాని, అన్ని పర్యాయాలూ విజయం మనుమరాలిదే అవుతూంది.

సభాకార్యక్రమం పూర్తికాగానే, సరిపోయీ సరి పోని టోపీతో, పాదరక్షలలో, ఒక చేతిలో తన వైద్యపు పట్టాను, రెండవచేతిలో బహుమతి గల కవరును పట్టుకొని ఆదుర్దాగా దారిచేసుకుంటూ తాతగారి వద్దకు నడిచి వచ్చింది.

''తాతయ్యా! వచ్చావా నువ్వు! నిన్ను మా ప్రొఫె సర్ దగ్గరకు తీసుకువెళ్ళి చూపించాలి తాతయ్యా!'' అంది.

''వద్దు వద్దు! మీ విదేశపు ప్రొఫెసర్లకు నాతో ఏమి పనమ్మా?''

''ఏమిటి తాతయ్యా! ప్రతిదానికీ నువ్వు?''

''సరే కానీ! నాచేత దేనికైనా ఒప్పించడానికి నీ దగ్గర చాలా గొప్ప యుక్తి ఉందమ్మా!'' అన్నాడు ఆయన ఇక చేసేదిలేక.

ఆనందంగా నవ్వుకుంటూన్న ప్రేక్షకులలోంచి ఆయ నను ప్రొఫెసర్ డీన్ వద్దకు తీసుకువెళ్ళింది. ప్రొఫెసర్ చిరు నవ్వు వాంగ్ కంగ్‌తో గౌరవ పురస్సరంగా కరచాలనం చేస్తూ, ''తమ దర్శనం లభించడం ఈవేళ చాలా సుదినం. మీరు ప్లేగుల రోగంతో చనిపోవడానికి సిద్ధంగా ఉన్న మారోగిని కాపాడిన నాటినుంచి మీ చికిత్సా విధానం అంటే మా అందరికీ అపారమైన గౌరవం ఏర్పడింది,'' అన్నాడు. ఈ పాశ్చాత్య వైద్యుడు అంత నిరాడంబరంగా స్నేహశీలిగా ప్రవర్తించడం వాంగ్ కంగ్‌కి ఆశ్చర్యం

వేసింది. ఆ ప్రాచ్యపాశ్చాత్య వైద్య ప్రముఖు లిద్దరు పరస్పర ప్రశంసాభివందనాలతో సెలవు పుచ్చుకున్నారు.

"తాతయ్యా! ఈవేళ రాత్రి ఇక్కడ గొప్పవిందు జరుగుతుంది తాతయ్యా! నేను నా తాలూకు ఇద్దరు అతిథులను ఈ విందుకు ఆహ్వానించడానికి నాకు రెండు టికెట్లు ఇచ్చారు. నువ్వూ, కా...యీ నా అతిథులుగా ఈ విందుకు రావాలి," అంది.

ఆమె మనస్సుకి కష్టం కలిగించడం, - అందులో ముఖ్యంగా ఆ రోజున,- ఆయనకు ఇష్టంలేదు. కాని, కాంప్ పేరు వినిపించడంలో ఆయన ప్లీహం కోపంతో ఉబికింది. దవడలోని రక్తనాళాలు పొంగినవి. ముఖం రవంత వివర్ణమయింది. గట్టిగా పళ్ళు కొరికి, గుటక మింగి, ముఖంలోకి బలవంతపు చిరునవ్వు తెచ్చుకుని ఇలా అన్నాడు: "నా జీర్ణకోశానికి ఈ హోటలు తిళ్ళు ఏవీ పడవని నీకు తెలుసును గాదటమ్మా! అందుచేత నువ్వు ఈ విషయంలో పట్టు బట్టకూడదు. దానికి బదులు నువ్వు నాకు మీ ఆసుపత్రి అంతా ఒకసారి చూపిస్తానంటే సంతోషంగా వస్తాను."

"అలాగే తాతయ్యా! అయితే ఇక మనం చల్లగా ఇక్కడినించి జారిపోదాం పద. ఈ టోపీ, ఈగాను, నాకు చిరాకుగా ఉన్నాయి. వీటిని తీసిపారేసి నా మామూలు యూనిఫారం వేసుకుని వస్తాను." అంటూ ఆయనను కొత్తగా వచ్చిన పురుష అతిథులు కూచునే హాలులోకి తీసుకు వెళ్ళింది.

"ఇదిగో తాతయ్యా! నువ్వీ కుర్చీలో కూర్చుని ఉండు. నేను ఇక్కడ ఉన్నట్టు వచ్చేస్తాను."

ఆమె దుస్తులు మార్చుకుంటూ ఉండగా, ఒక నౌకరు వచ్చి, "డాక్టర్ వాంగ్! మీకు టెలిఫోన్ పిలుపు వచ్చింది," అని చెప్పి వెళ్ళాడు.

"ఇదిగో ఒక్క నిమిషంలో వచ్చేస్తున్నాను" అని జవాబు చెపుతూండగా ఆమె గుండె గుబగుబలాడడ మారంభించింది.

టెలిఫోన్ వద్దకు వెళ్ళి మెల్లిగా "హెల్లో!" అంది.

"హెల్లో! మైడియర్! అభివందనలు! నువ్వు నీ సహాధ్యాయులందరికీ తలమానిక మయినావు. ఈ విజయం ఎలా సాధించావో నాకు తెలియదు గాని, ఈ విషయం విన్నప్పటినుంచీ నా సంతోషానికీ, గర్వానికీ అంతులేదు," అన్నాడు కాయ్.

"ధన్యవాదాలు కాయ్! నాకు వాళ్ళాకవరులో పెట్టి ఇచ్చిన బహుమానం కన్న అది నీకింత సంతోషం కలిగించడం నాకు ఎక్కువ ఆనందంగా ఉంది. అనుకోకుండా కాన్వొకేషన్‌కి మా తాతయ్య కూడా వచ్చాడు. ఇప్పుడు ఆయన ఇక్కడే ఉన్నాడు. ఈ ఆసుపత్రి అంతా చూస్తానన్నాడు. నేనిప్పుడు ఆయనను తీసుకువెళ్ళి అన్నీ చూపించాలి. అయితే, విందు సమయం లోగానే మా తాతయ్య వెళ్ళి

పోతాడు. అంచేత మనం అనుకున్న ప్రకారం ఆ సమయానికి ఇక్కడికి నువ్వు రావాలి.''

చివరికి ఆమె పాల వన్నె దుస్తులతో హాలులోకి తిరిగి వచ్చేసరికి తాతగారామె వంక తేరపార చూచాడు.

''ఈ దుస్తులేమిటమ్మా? చిత్రంగా ఉన్నాయి. దుఃఖసమయాల్లో వేసుకోవలసిన ఈ తెల్లదుస్తులు కూడా నీకు ముచ్చటగానే ఉన్నవమ్మా! ఇక్కడ రోజూ ఈ దుస్తులేనా నువ్వు వేసుకునేది?''

''ఔను తాతయ్యా! పని చేసేటప్పుడు, భోజనం చేసేటప్పుడూ నిద్రపోయేటప్పుతూ కూడా ఈ తెల్ల దుస్తులే వేసుకోవాలి మేము.''

తాత, మనుమరాలు ప్రక్క ప్రక్కన నడుస్తూ ఆ ఆసుపత్రిలో ఒక్కొక్క వార్డుకే వెళ్ళిచూస్తున్నారు. వారు హెచ్ - III వార్డులో ఉన్నప్పుడు ఆమె ఆయన నొక రోగి మంచం వద్దకు తీసుకు వెళ్ళింది. అచటి తెల్ల తెరను ఒక ప్రక్కకులాగి, బక్క చిక్కి తలకు ఎత్తుపెట్టుకొని పరుండి ఉన్న రోగిని చూపించింది. ఆ రోగికి ఒక్కకడుపు తప్ప మిగిలిన శరీరమంతా ఎండిపోయి పుల్లలాగ ఉంది. కడుపు మాత్రం నెలలు నిండిన గర్భిణీ స్త్రీ కడుపులాగ ఉంది.

''తాతయ్యా! ఈరోగిని పరీక్షించి, ఇతడి రోగమేమిటో చెపుతావా?''

ఆయన ఒక కుర్చీని ఆ మంచం ప్రక్కకు లాగుకొని

కూచుని, రోగి కుడిచేతి మణికట్టు పుచ్చుకున్నాడు. తన బొటనవ్రేలిని అతడి మణికట్టు వెనుకతట్టున ఉంచి. నాడిని మూడురకాలుగానూ పరీక్షించాడు. ఒక ఉచ్ఛ్వాసం, ఒక్క నిశ్వాసం చేసి, ఆకాలంలో నాడి సంఖ్యను లెక్క పెట్టాడు. రోగి కుడిచేతి నాడిని పరీక్షించడానికి తన ఎడమ చేతిని, ఎడమచేతికి తన కుడిచేతిని ఉపయోగించాడు. నాడి మూడు వ్రేళ్ళమీదా మూడురకాలుగా కొట్టుకుంటూంది. ప్రతి నాడిని తక్కువ, ఎక్కువ, మధ్యరకం వత్తిడితో మూడేసి సారులు పరీక్షించాడు. చివరికి ఎడమ మణికట్టు రెండవ నాడిలో దోషం ఉన్నదని కనిపెట్టాడు.

వెంటనే తలపైకెత్తి, "ఇతడి పైత్యకోశం అసలు పనిచేయడమే మానివేసిందమ్మా! పడుచుతనంలో ఈ రోగి అతిగా త్రాగుతూ ఉండి ఉండాలి," అని తన నాడీ నిదాన ఫలితాన్ని ప్రకటించాడు.

"ఎలా కనిపెట్టావు తాతయ్యా? మేము మా లేబరేటరీలో అనేక విధాల పరీక్షలు చేసిచేసి, చివరికి అతి త్రాగుమోతు తనంవల్ల లివర్‌కి సంభవించిన "సిరోసిస్" అనే వ్యాధి అని నీవు చెప్పినట్టే నిర్ణయించాం. నువ్వు సులభంగా నీ చేతులు, వేళ్లూ మాత్రం ఉపయోగించి ఒక్క నిముషంలో ఈ విషయం చెప్పివేశావే!"

తరువాత వాళ్ళు ఆ ప్రక్కనున్న మంచం వద్దకు వెళ్ళారు. అక్కడ కూడా వాంగ్ కంగ్ కీళ్లవాతం వల్ల

వచ్చిన హృద్రోగమని సులభంగా చెప్పివేశాడు. ఈ విధంగా వాళ్ళిద్దరూ అన్నివార్డులూ తిరిగి వచ్చారు. ప్రతి స్థలంలో, స్టెతస్కోపు, ఆప్తాల్మస్కోపు, ఎలక్ట్రో కార్డియోగ్రాం లాంటి ఆధునిక రోగ నిదాన సాధనాలేవీ లేకుండానే తన తాత సులభంగా రోగ నిదానం చేయగలగడం మియావో చెన్‌కి అమితాశ్చర్య సంభ్రమాలు కలిగించింది.

'నిజంగా నువ్వు మా తాతయ్యవని చెప్పుకోనడానికి నేను ఎంతో గర్వపడుతున్నాను తాతయ్యా!''

''నిన్ను చూచుకొని నేనూ ఎంతో గర్వపడుతున్నానమ్మా!'' అన్నాడు తాతగారు.

మియావో చెన్ పట్టభద్ర అయిన మరుసటి రోజునే ఆమెకు ఆ అసుపత్రిలోని స్త్రీరోగ ప్రసూతి శాఖలో అసిస్టెంట్ రెసిడెంట్ డాక్టరుగా నియమించారు. అందువల్ల ఆమెకు మధ్యలో సెలవులంటూ ఏమీ లేక పోయినవి. ఆ తెల్ల దుస్తుల యూనిఫారాన్నే. ఆ కాన్వాసు బూటులనే, విడవకుండా ధరిస్తూంది.

అయితే, ఇప్పుడు ఆమె చేతిక్రింద కొందరు వైద్య విద్యార్థులు ఉన్నారు. అందువల్ల ఆమెకు పని తక్కువ. ఐదు రోజుల కొకరోజు సెలవు ఉండడంవల్ల ఇంటికి వెళ్ళడానికిగాని. కాయ్‌తో గడపటానికిగాని కావలసినంత తీరుబాటున్నది.

అది హేమంత ఋతువు. వాతావరణమంతా సుందరంగా సుఖమయంగా ఉంది. పాత గుడి ప్రాంతమూ, సెంట్రల్ పార్కు రంగు రంగుల చేమంతులతో ఇంద్ర ధనుస్సులలాగ మిల మిలలాడి పోతున్నవి. క్రిందటి రాత్రి విందు భోజనం, నృత్యం అయిపోయిన తరువాత, ఆ నాడు సాయంకాలం ఎనిమిది గంటలకు కాయ్ వచ్చి, అప్పటికే ఆమె వచ్చి తనకోసం నిరీక్షిస్తూండడం చూచి నివ్వెర పోయాడు. ఆమె ఎత్తునించి మేడ మెట్లు దిగి వస్తూంటే, మెత్తని పట్టు గౌనులో పూల తీగెలాగ కదలాడుతూన్న ఆమె మనోహర మూర్తి అపూర్వలావణ్యం అతడి కనులను మిరుమిట్లు గొలిపింది. ఆమెలో అతడు చూస్తున్నది ఒక్క సౌందర్యమే కాదు, ఆమె ప్రతిభ, ఆమె ఉన్నతాశయాలు కూడా ముఖ్యంగా అతడి మనస్సును ఆకట్టినవి. మొట్ట మొదట ఆమెకుకూడా తన పైన అనురాగం ఉన్నట్టు ఆమె సూచనలు కనపరిచిన రోజున ఆ క్షణ తన అదృష్టాన్ని తానే నమ్మలేకపోయాడు.

ఇద్దరూ సెంట్రల్ పార్కులోని తోటల గుండా మెల్లగా నడుస్తూ పాలరాతి వేదికదాకా పోయి, అచటి ఒక తెల్లని మెట్టు పైన ఆసీనులయారు. పండువెన్నెల పృథ్వినంతా పాలకడలి చేస్తూంది. పూలతీగెలు గాలికి ఊగాడుతున్నవి. పియూవోచెన్ కాయ్ కి కొంచెం దగ్గరగా జరిగింది. తలవని తలంపుగా ఆమె కేశాలు ఎగిరి ఆయన ముఖాన్ని తుడిచేసరికి కాయ్ హృదయంలో బాజాలు మ్రోగ

మొదలు పెట్టినవి. ఒళ్ళు ఒక్కసారి ఝల్లుమని, ఆపైన వణకడం ప్రారంభించింది. సాహసంగా, అయినా, మెల్లగా అతడి ఎడమ చేయి ఆమె బుజము మీదకు సాగింది. ఆమె ముఖం అప్రయత్నంగా కాయ్ వంకకు తిరిగింది. వారి అధరాలు హత్తుకొన్నవి - మొదట జంకుగా, క్రమంగా గాఢంగా. షియావో చెన్ అతడిని అంటి పెట్టుకొని అలాగే ఉండిపోయింది: వెన్నెలలో వారిరువురు ఒకరి వంక ఒకరు తనివిదీర చూచుకుంటున్నారు.

షియావో చెన్ చీకటిలో లేచి శీఘ్రంగా ఉదయ ఉపాహారాదులను ముగించుకొన్నది. ఆ వేళ తాను శిశు పోషణ శాలలోని పాపలను పరీక్షించడానికి వెళ్లాలి. ఈ పని, అంటే ఆమెకు చాలా సరదా. పచ్చ సబ్బు నీళ్లల్లో చేతులు శుభ్రంగా రుద్దుకొని, కడుగుకొని, టోపీ, బుర్ఖా, గౌనూ వేసుకొని డబుల్ గ్లాసు తలుపులు త్రోసుకొని రావడానికి తయారయింది.

బాలల పరీక్ష మొదలు పెట్టింది. ఒక్కొక్క ఉయ్యాల తొట్టె చూచుకుంటూ పోతూ ఉండగా, పధ్నాలుగవ నెంబరు తొట్టెలోని పాప ఏడుస్తూండడం చూచింది. 'ఆ పాపకి పాపం ఏమి బాధో చూడు,'' అని అచటి దాదిని ఆదేశించింది.

"కాదమ్మాయిగారు! ఆ పాప ఎప్పుడూ అంతే!

ఏడుపుగొట్టు పాప. ఆహార మిచ్చిన తరువాతకూడా రోజంతా ఏడుస్తూనే ఉంటుంది,'' అన్నది దాది విసుగ్గా.

"కాదమ్మా. నీవు పొరపడుతున్నావు. కడుపునిండా పాలు పోసినా ఏడ్చే పాపకు తప్పకుండా ఏదో బాధ ఉండి ఉండాలి,'' అన్నది పియాంగ్ చెన్

అంటూ, ఏడుస్తూన్న ఆ పాపను మెల్లగా చేతులతో పైకి ఎత్తింది. ఆ పాప కాలు చేతులు గిలగిల కొట్టుకున్నవి. ఏ కాలు పట్టుకున్నా, చేయి ముట్టుకున్నా పాప కెవ్వున కేక పెడుతూంది. "నేననుకున్నట్టే అయింది. ఈ పాప చాలా బాధపడుతూంది. కాలు చేతులలో ఏదో దోషం ఉన్నది, ఎక్స్‌రే ఫొటో తీయించడం అవసరం,'' అన్నది పియాంగ్ చెన్. వెంటనే దానికి అవసరమైన ఆదేశ పత్రం పై సంతకం పూర్తి అయింది. తరువాత ఆమె ఆ పాప చరిత్ర, ఆ పాప తల్లి చరిత్ర తెలుసుకునేందుకు వెళ్ళింది.

ఉదయం పరీక్షార్థం తిరిగేటప్పుడు పియాంగ్ చెన్ ప్రొఫెసర్ డీన్‌నుకూడా ఈ బాల విభాగం వద్ద ఆపుచేసి, అప్పటికే తయారై ఉన్న ఆ పాప తాలూకు ఎక్స్‌రే ఫిలిములను ఆయనకు చూపింది. ఆయన విచారంతో శిరః కంపనం చేసి, "పాపం ఈ శిశువుకి పుట్టుకతోనే ఎముకల్లో రోగం (Congenital rickets) ప్రవేశించింది. ఈమె ఎముకలు ముట్టుకుంటేనే విరిగి పోయేటంత బలహీనంగా ఉన్నవి. తల్లి చరిత్ర కనుక్కొన్నావా''? అని ప్రశ్నించాడు.

ఈ పాప ఆమె తల్లికి తొమ్మిదవ బిడ్డ. తల్లి వయస్సు నలభయ్యొక్క సంవత్సరం. ఆరవ కాన్పు నాటినుండి ఎముకల బలహీనపు రోగం (osteomalacia)తో బాధ పడుతూంది. తండ్రి రిక్షా లాగుతాడు. తిండి ముఖ్యంగా కొరమీను చేపలు, ఉప్పు చేపలు. తల్లి గర్భం ధరించి ఉన్నప్పుడు ఆమెకు చచ్చురోగం (teteny) పట్టుకుంది. ఇప్పుడీ పాపకు కాలు సేతులకు కట్లు కట్టి ఉంచి, వైట మిన్లతో, పాలతో పోషించాలి.

ఈ విషయం ఆమె తల్లితో చెప్పవలసిన పనికూడా షియూవోచెన్ దే. ఆమె ఈ కథ అంతా చెపుతూ ఉంటే ముఖంలో రవంత విచారమైనా లేకుండా విని, "అది ఎలాగూ చేయి జారిపోయినట్టే. ఇంక దాని ప్రమేయమే నాకు అవ సరం లేదు," అంది.

"నీకు నోరెలా వచ్చిందమ్మా అలా అనడానికి?" అని షియూవోచెన్ ఆమెను మందలించింది. తల్లి తన కడుపున పుట్టిన బిడ్డను పాత గుడ్డను పారవేసినట్లు పరిత్యజి స్తానడం, షియూవోచెన్ ను ఆశ్చర్యచకితను చేసింది. ఆమెకు దాదాపు కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది.

"అమ్మా! నీవింకా పిల్లల్ని కనలేనట్టుంది! అందు చేత నా మాటలు నీకు అర్థంకావు. నేను ఇలాంటి గర్భ శత్రువుల్ని ఇంకా ఎనిమిది మందిని కన్నాను. వాళ్ళంతా మా ఇంట్లో ఉన్నారు. అనుక్షణం నా ప్రాణాలు పిండు

తున్నారు. నా మొదటి కాన్పునాటినుంచి, ఇంతవరకూ నా జీవితంలో ఒక్క క్షణంకూడా శాంతిలేదు. పెళ్ళి అయినది లగాయతు ఏటేట ఒక్కొక్క కాన్పుచొప్పున ఈ బిడ్డలు నా ప్రాణశక్తినంతా పీల్చివేశారు. ఈ క్రొత్తముండ సంగతి నాకేమీ అంతుపట్టలేదు. అందుచేతనే, ఇది నా గుండెల్ని ఇంకాపీల్చి పిప్పిచేయకముందే పీడ విరగడ చేసుకోవాలని చూస్తున్నాను.'' అన్నది.

పియూచెన్ మనసులో, తనకుకూడా సంతానం కావాలనీ, వివాహం చేసుకోకుండా శాశ్వతంగా వాంగ్ వంశపు వారసురాలుగానే ఉండిపోవాలన్న తాతగారి కోరికలు తాను మన్నించలేననీ ఇప్పుడు స్ఫుటమైన భావం ఏర్పడింది.

వాంగ్ కంగ్ కి, తన మనుమరాలు వైద్యవిద్యలో అద్భుత కౌశలం చూపడం ఎంత సంతోషం కలిగించినా, మరొకవంక ఆమె ప్రణయకలాపం క్రమంగా ఆయనకు చాలా ఆందోళన కలిగిస్తూంది. ఇది సందిగ్ధ సమస్య. తాను ఏమీ చెయ్యలేనిస్థితిలో ఉన్నాడు. ఆలాంటి క్లిష్ట సమస్య ఏర్పడినప్పుడల్లా తాను సాధారణంగా చేసే ప్రకారమే చాంగాన్ ని పిలిపించాడు.

వసంత ఋతువులో కురిసేవర్షాలు వెనుక బట్టినవి. అందరి దొడ్లనిండా పూల మొక్కలు కనుల పండువుగా కుసుమించి కలకలలాడుతున్నవి. రాత్రి భోజనానంతరం

చాంగాన్ తన యజమాని ప్రియమైన వికర్ సోఫా తెచ్చి లిల్లీ పూల ప్రక్కన వేశాడు. వాంగ్ కంగ్ సుఖంగా శరీరం వాల్చి టీ చప్పరిస్తున్నాడు.

చాంగాన్ మళ్లీ టీ గిన్నె తీసుకువచ్చినప్పుడు, వాంగ్ కంగ్ అతణ్ణిపిలిచి కుర్చీపీట తెచ్చుకొని తనప్రక్కన వేసుకొని కూచోమన్నాడు. చాంగాన్‌కి యజమానితో ఎప్పుడు మాట్లాడినా ప్రక్కన నిలబడి మాట్లాడమే అల వాటు. అందుచేత, అతడు తెచ్చివేసుకొన్న వెదురు కర్రల బల్లమీద స్తిమితంగా కూర్చోలేకపోయాడు. ఒక ప్రక్కకు కొంచెం ఆని కూచునీ కూచోనట్టుగా కూచున్నాడు.

వాంగ్ కంగ్ గొంతు సవరించుకొని ప్రారంభించాడు: "చాంగాన్! నీకూ తెలుసనుకుంటాను. నా మనుమరాలికి నా పెంపకం ప్రారంభమైనది మొదలు, ఆమెతో నాకు అన్నీ సమస్యలే! ఆడపిల్లను పెంచడం మగవాడికి సనేమిరా చేతగాని పని అని నాకు మొదటినించీ తెలుసు. మీ అమ్మ గారు జీవించి ఉంటే ఎంత బాగుండును!-అని వేలకొలది సార్లు నాలో నేనే అనుకుంటూంటాను."

చాంగాన్, కుదేసినట్టున్న మెడమీదగల బట్టతల ఊపుతూ, ఆ వెదురు బల్లమీద ఉతుకుష్టంగా ఒక అంచు మీాంచి మరి ఒక అంచుమీాదికి వత్తిగిలాడు.

"అయ్యగోరూ! మీారు చిన్న అమ్మాయిగోర్ని ఏ లోపం లేకుండగా ఎంతో ఇదిగా పెంచారు. అమ్మాయి

గోరు రత్నమాణిక్కంలాంటి పిల్ల. ఆమెను సూసి మనం మురిసిపోవాలిసిందేగాని, ఆయమ్మ మనకి సమస్సెలూ, సికాకులూ ఎందుకు తెచ్చిపెడద్ది దొరగోరూ?''

వాంగ్ కంగ్ కనుబొమ్మలు పైకిలేచినవి.

''నిజమేరా! చదువులో దానికి ఎవరూ సాటిరాని మాట నిజమే! దాని అంతచదువు చదివిన ఆడపిల్లలు మన దేశం మొత్తంమీదే చాలా తక్కువ. అందువల్లే ఈ పిల్ల తన జీవితమంతా తాను చదువుకున్న ఆ వైద్యానికే వినియోగించడం మంచిదని నా అభిప్రాయంరా!''

''దొరా! నేను తెగించి మాట్లాడుతున్నానని కోంపడమోకండి. మన అమ్మాయిగోరు డాక్టరు పరీచ్చ ఇచ్చినా, ఆడకూతురు కాదటండి! ఆడపిల్లకు ఈడొచ్చినప్పుడు గమాల్న పెళ్లిసేశెయ్యడం మంచిది దొరగోరూ!''

''అలా అని, పిచ్చివాణ్ణి కట్టుకుంటే ఎల్లారా?'' అని విసుక్కున్నాడు వాంగ్ కంగ్

చాంగాన్ లావుపాటివ్రేళ్ళతో బట్టతల సవరించుకున్నాడు. అతడి నుదురు ముడతలు దేరింది. తన భార్య పిచ్చి ఆసుపత్రిలోని యువకుణ్ణి గురించి లోగడ తనకుచెప్పిన మాట గుర్తుకొచ్చింది. తన యజమానిని చిరకాలంగా కలతపెడుతూన్న విషయమేమిటో చాంగాన్‌కి ఇప్పుడు బోధపడింది. ఉండి ఉండి అతడి చిన్నికళ్లు మెరిసినవి. ఒక్క గంతుపెట్టాడు.

"దొరగోరూ! ఒక పనిసేత్తే సరిపోతుందిదొరగోరు. ఇంకా గొప్పసదువు సదివించడానికి అమ్మాయిగోరిని ఆ తెల్లోళ్ళ దేశం పంపియ్యండి. కెమంగా ఈ పిచ్చోణ్ణి ఆమె మరిచి పోతది. ఆ కుఱ్ఱోడికి దూరంగ్గా పంపేత్తే ఆ పైన మంచి చెడ్డలు ఆమే ఇంచగ్గా ఆలోచించుకుంటది. అప్పుడింకో సక్కనిబాబుని కోరుకుంటే సరేసరి. అట్టా కాక పెళ్లేవద్దనేస్తే మరీ మంచిది. దొరగారనుకున్నట్టే జరుగుద్ది."

వాంగ్ కంగ్ ముఖం వికసించింది. కొలది నిము షాలు సాలోచనగా ఊరుకుని, "మంచి ఉపాయం చెప్పా వురా! అవును. ఔను. దాన్ని అమెరికా పంపి, ఇంకా చదివిస్తాను." అన్నాడు.

కాని, వాంగ్ ప్రథమ పర్యాయం ఈ విషయం చెప్పి నప్పుడు షియూవో చెన్ గోలకెత్తి ఏడ్చింది. తాతగారు తనను అమెరికా ఎందుకు పంపుతున్నదీ ఆమెకు తెలుసు. ఈసారి, తాను కాదనటానికి వీలులేని నిపుణమైన ఉపా యంతో తాతగారే తనపై గెలుపు సాధించాడు. డాక్ట ర్లకు అమెరికాలో ఉన్నతవిద్య నభ్యసించడం చాలా ఉప యోగకారే. కాని, ఈవార్త కాయ్‌కి ఎలా చెప్పడం?

దేశాంతర ప్రయాణ సన్నాహాల కోసం ఆమె ఆసు పత్రిలో తన ఉద్యోగానికి రాజీనామా ఇవ్వవలసి వచ్చింది. ఈ విషాదవార్తను ఒక చీటీపై వ్రాసి కాయ్‌కి పంపింది. మరొక పర్యాయం సెంట్రల్ పార్కులో తనను కలుసుకొన

వలసినదని కూడా ఆయనను ప్రార్థించింది. ఈ సమావేశా నికి ఒక దినము, సమయము కూడా తానే సూచించింది. ఆ పార్కులో తామరకొలను ఒడ్డున అతడికోసం తాను నిరీక్షిస్తూ ఉంటానని వ్రాసింది.

అతడు ఆమెకన్న ముందుగానే వచ్చి, ఆ కేళాకూళి చుట్టును గల పాలరాతి గోడపై కూచుని, ఆమె కొరకు ఎదురుచూస్తున్నాడు. ఆమెను చూడగానే లేచి, ఎదురుగా వెళ్లాడు. ఇరువురు గాఢంగా కౌగిలించుకున్నారు. ఉభయు లలో ఎవరూ మాట్లాడలేదు. పిల్లగాలికి ఊగే రెండు గడ్డి రేకులలాగ వణికిపోతూ నిలబడి ఉన్నారు.

ఇరువురిలో పియావోచెన్ కొంచెం ప్రశాంతంగా ఉన్నది. ఆమె కాయ్ చేయి పట్టుకొని పాలరాతి గోడ వంకకు తీసుకొనిపోయింది. ఆ పాలరాతి మెట్లపైన ఒకరి ప్రక్కన ఒకరు కూచున్నారు. వణుకుతూన్న కంఠస్వరంతో ఆమె "కాయ్! నీతో సహవాసమే స్వర్గం," అంది.

అప్పటికీ అతడి నోట మాట రాలేదు. ఆమె వంకే చూస్తున్నాడు. ఆతడి కనుల నిండా ప్రేమ, అగాధ ప్రశంస తొణికిసలాడుతున్నవి. అతడి పారవశ్యం చూచి ఆమె ముగ్ధమై పోయింది. అంత గాఢమైన ప్రేమకు పాత్రురా లవడం వాస్తవంగా తన అదృష్టం, అనుకొన్నది.

పిమ్మట, అదే తమ చరమసమావేశమన్న భయంకర విషయం వారిరువురికి ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చింది.

కాయ్ వికృతంగా ఆమెను తన హృదయానికి హత్తు
కున్నాడు. ఆమె వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టింది
ఆ దుఃఖాన్ని ఆపుకొనడానికి ఆమె ప్రయత్నించలేదు. ఆ
విలాపం కేవలం కాయ్ వియోగంకోసమే కాదు. ఆమె
బోధపడని ఏదో ఆంతరంగిక ప్రేరణ ఆమెను అవశను
చేసింది.

తన దుఃఖంలో తాను మునిగిపోయి ఉన్న కాయ్ ఆమెను అనునయించ లేకపోయాడు, "మనం మళ్లీ కలుసుకొనవచ్చు;...తప్పకుండా కలుసుకుంటాం," అని మాత్రం రెండు మూడు సార్లు అన్నాడు.

ఆమె మాట్లాడ లేకపోయింది. బహుశః జీవితమే వారికి దూరమై పోతున్నదేమో!

అంతవరకే వారికి ప్రాప్తి అన్నట్లు అచిరకాలంలోనే పెద్ద ఉప్పెనలాగ ఆ నగరం మీదకు యుద్ధంవచ్చి పడింది. జూలై ఏడవ తేదీన అకస్మాత్తుగా జపాన్‌వారు దాడి ప్రారంభించారు. చాంగాన్ ప్రాణం బిగపట్టుకొని కళ్లింత చేసుకొని పరుగెత్తుకుంటూ వచ్చి ఈ వార్త తెలిపాడు. మియావోచెన్ తాతగారివద్దకు పరుగెత్తింది.

"ఇకనైనా ఈ ప్రయాణం మానివేయమన్నావా? ఇక్కడ నా అవసరం చాలా ఉంటుంది," అన్నది.

ఇలాంటి దండయాత్ర త్వరలో జరుగగలదని ఆయన లోగడే విన్నాడు. అందువల్ల సాధ్యమైనంత శీఘ్రంగా

ఆమెను దూరంగా సురక్షితప్రదేశానికి పంపడం అవసరమని ఇంకా గట్టిగా నిశ్చయించుకున్నాడు. అద్భుత సౌందర్యం, అసమాన ప్రతిభగల ఆమెయే నిజానికి తన నిక్షేపం.

''వీలులేదు. నీవు వెళ్లవలసినదే. ఇక్కడ ఉండటానికి వీలులేదు.'' అన్నాడు అచంచల గంభీర స్వరంతో

# తృతీయాధ్యాయము

సాయంకాలం మూడుగంటలవేళ అమెరికాసంయుక్త రాష్ట్రంలో మిషిగన్ రాష్ట్రంలోని ఆన్ ఆర్బర్ స్టేషన్ లోకి రైలు మెల్లిగా ప్రాకివచ్చి నిలబడింది. షియూవో చెన్ ప్లాట్‌ఫారంమీద అడుగుపెట్టింది. ఆ అపరిచిత నూతన నగరంలో తన ఒంటరితనం తెలుచుకొని ఆమె కంగారుగా, చిరాకుగా ఉంది. ఇంతలో ఒక చైనాదేశపు యువకుడు ఆమె వద్దకు వచ్చి, "డాక్టర్ వాంగ్ మీరేనాండి?" అని సాదరంగా ప్రశ్నించాడు.

"ఔనండి. నాపేరు షియూవో చెన్ వాంగ్," అని ఆమె జవాబు చెప్పింది.

"నాపేరు చెన్. ఆన్ ఆర్బర్‌లోని చైనీస్ విద్యార్థుల పక్షాన మీకు స్వాగత మివ్వడానికీ, మా అందరి అభివందనలు మీకు తెలుపడానికీ వచ్చాను."

ఆమె పెట్టెలు వగైరాలు స్టేషన్ వెలుపల కారులోకి చేర్చడానికి అతడు సహాయపడ్డాడు. రెండు ప్రక్కల స్టోరులు, దుకాణాలు ఉన్న ఒకవిశాలమైన వీధిగుండా కొంతదూరం వారిద్దరు ఆ కారులోనే ప్రయాణం చేశారు.

"మిషిగన్ విశ్వవిద్యాలయం ఎక్కడ ఉన్నది?" అని

"మన మిప్పుడు ఆ విశ్వవిద్యాలయావరణలోనే ఉన్నాము."

"మిషిగన్ విశ్వవిద్యాలయమనే పేరుకూడా ఎక్కడ కనిపించలేదే?"

అతడు నవ్వాడు. "మీరు చైనాలోని విశ్వవిద్యాలయాలకే అలవాటు పడ్డారు. వాటిచుట్టూ ఎత్తైనగోడలు, గేట్లపైన ఆ సంస్థల పేర్లు వ్రాసిన పెద్దపెద్ద బోర్డులు ఉంటాయి. కాని, మీరిప్పుడు అమెరికాలో ఉన్నారు కనుక, ఇచటి క్రొత్తపద్ధతులు మీకు క్రమంగా పరిచయ మవుతాయి. అమెరికా విశ్వవిద్యాయాల భవనాలు సాధారణంగా నగరంలోని అనేక ప్రాంతాలలో చెల్లాచెదరుగా ఉంటాయి."

మరునాడు ఉదయం ఆమె తనపేరు రిజిష్టరుచేయించుకొనడానికి విశ్వవిద్యాలయపు ఆసుపత్రికి వెళ్లింది. ఆ ఆవరణ చాలా విశాలంగా ఉన్నది. ఆమె ఒకభవనం నుండి మరొక భవనంవద్దకునడచిపోతూ ఉంటే, తనతాతగారి సవారీ కుర్చీగాని, కనీసం ఒకరిక్షాగాని ఉంటే బాగుండుననుకున్నది. ఆ వైద్యకళాశాలాధికారి( Dean)తో మాట్లాడి, తాను ప్రత్యేకంగా అభ్యసింపదలచుకొన్న విషయాలను నిశ్చయించుకొన్నతరువాత, దారిలో వీరిని వారినీ అడుగుతూ ఆ పాఠాలుచెప్పే వివిధ భవనాలకువెళ్ళి చూచివచ్చింది. ఆ నాడు ప్రొద్దుగ్రుంకేసరికి ఆమె పూర్తిగా అలసిపోయింది.

చదువు మూడువారాలు సాగింది. షియూవో చెన్‌కి ఏమీ సంతృప్తిగా లేదు మళ్ళీ ఆ విద్యాశాలాధికారిని చూడడానికి వెళ్ళింది. దయార్ద్రహృదయుడైన ఆవృద్ధుడి దగ్గరకు ఆమె నిర్భయంగా వెళ్ళగలదు. "డాక్టర్ ఇంగ్లండ్! ఈ మూడు వారాల్లో నాశక్తి వంచన లేకుండా కృషి చేశాను. కాని, నేను నేర్చుకున్నది మాత్రం ఎక్కువ లేదు. నాకు వైద్యంలో కూడా కొంత అనుభవం ఉన్నది. చైనాలో రోగులు ఎక్కువ; వైద్యులు చాలా తక్కువ. అందుచేత నేను ఇంటర్న్‌గా ఉన్నప్పుడే ఆపరేషన్ గదిలో సహాయపడడానికి కూడా నాకు అవకాశం ఇచ్చేవారు. ఇక్కడ, మిషిగన్‌లో నేను ఉండేకాలం చాలా తక్కువ. ఈ సమయం పూర్తిగా సద్వినియోగం కావాలని నా కోరిక," అన్నది.

ఆయన తల ఊపుకున్నాడు, "అవునమ్మా! నీవు చెప్పినది నిజమే. నీవు పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీకోసం కృషి చేయడం మంచిది," అన్నాడు.

అప్పటి నుండి ఆమె ఆవైద్య విశ్వవిద్యాలయంలో చేర్చుకోనబడింది. ప్రతిదినం ఉపన్యాసాలకు హాజరయేది. లేబరేటరీలలో కూడా ఆమెకు కొంత పని కల్పించబడింది. రోజులు, వారాలు, చురుకుగా గడిచిపోతున్నవి.

* * *

శుక్రవారం ఆమెకు చాలా ముఖ్యమైనరోజు. ఆ నాడు విదేశాల నుంచి టపా వస్తుంది. ఈ శుక్రవారం

షియూహోచెన్ వసతి భవనానికి దారిపొడుగునా పరుగిడు తున్నట్టు వెళ్ళింది. ఆ క్రిందటి శుక్రవారం ఆమెకు ఆశా భంగం కలిగింది. ఆమె బల్లవద్దనున్న ఉత్తరాల సొరుగంతా నీలం, ఎరుపుగీతల కవర్లతో నిండిపోయి ఉండడం చూచింది. ఆదుర్దాగా చిన్న కిటికీ తెరిచింది. ఒక ఉత్తరం తాతగారి దగ్గర నుంచి; రెండు కాయ్ వ్రాసినవి. ఒకటి తన పూర్వసహాధ్యాయి వ్రాసింది. కాయ్ ఉత్తరాల్లో మొదటిది తీసి చదవడం ప్రారంభించింది. ఆమె వేళ్లు వణికిపోతున్నవి. ఆమె ముఖం వివర్ణమయింది.

"ప్రియమైన షియూహోచెన్!

"నీ ఉత్తరాలు ఆకొన్నవాడికి రొట్టెలాగ, దప్పిగొన్నవాడికి పానీయంలాగ ఉపయోగపడుతున్నవి. నీవు నన్నుగురించి బెంగపెట్టుకున్నట్లు వ్రాశావు. నా బెంగసంగతి ఆ భగవంతుడికే తెలుసు!

"మా అమ్మ సూచౌలో ఆమె సోదరి ఇంట క్షేమంగా ఉన్నట్టు వ్రాసింది.

"నేను గడచిన సెప్టెంబరులో పెకింగ్ నగరం విడిచి వచ్చినప్పటినుంచి, షాంఘైలో ఒక సైన్యానికి నాయకుడుగా ఉన్నాను. ఇది ఐదువేలమంది కళాశాల హైస్కూలు విద్యార్థులతో కూడిన దళం......"

తరువాత ఒకవారం రోజులకు వ్రాసిన రెండవ ఉత్తరంలో, తాను అప్పుడొక ప్రచ్ఛన్న సైన్యానికి నాయ

కుదుగా ఉన్నట్టు వ్రాశాడు. షాంఘైపై బాంబులయుద్ధాన్ని గురించిన అతడి అభివర్ణనలను, ఆ శవాల గుట్టలను, ఆ ప్రజాఘోషను గురించి ఆమె చదవలేకపోయింది. అతడు ఎంత ప్రమాదకరస్థితిలో ఉన్నదీ దానిని బట్టి ఆమె ఊహించుకొన్నది. ఆ రోజు మొదలు అతడిని గురించి ఆమె చాలా భయపడుతూంది.

మరో రోజున వచ్చిన కాయ్ ఉత్తరంలో అతడి తల్లి మరణించిందన్న విషాదవార్త తెలియ వచ్చింది. జపాన్ వాళ్లు సూచౌమీద వేసిన ఒక బాంబుకి ఆమె బలి అయింది.

ఆరోజు టపాలోనే ఆమెకు తాతగారివద్ద నుంచి వచ్చిన ఉత్తరంలో చాంగాన్ అకస్మాత్తుగా జబ్బుచేసి చని పోయాడని చదివింది. పరిశోధనశాలలోని బోనులలోఉన్న వందలకొలది ఎలుకలు, గినీపందులు, కుందేళ్ళు ఉయ్యాల లూగుతూన్న నాలుగుకోతులమధ్య ఉన్నప్పుడు ఆమె ఈ ఉత్తరాలు చదివింది. అక్కడ ఇంకెవరూ మానవులు లేక పోవడం వల్ల ఆమె ఏకకాలంలో తెలిసిన ఈ రెండు విషాద వార్తలను భరించలేక వెక్కి వెక్కి ఏడ్చింది.

జూన్ నెలలో ఒక శుక్రవారంనాడు వసతి గృహాల పోస్టాఫీసుకువెళ్లి చూచేసరికి ఆమె ఉత్తరాల అర నిండుగా ఉంది. ఆదుర్దాగా అన్నింటినీ బయటికి లాగి వెతికింది. ఆమె తాతగారి వద్దనుండి మూడుఉత్తరాలు వచ్చినవి. కాయ్ వద్దనుంచి మాత్రం ఈ తడవకూడా ఏమీ లేదు.

తన గదిలో కూచుని ఆమె ఆ ఉత్తరాలను తేదీల వారీగా పేర్చి, మొదటి ఉత్తరం విప్పి ఇలా చదివింది: "తల్లీ! ఏమయినా సరే నీవు ఈ వేసవిలో చైనాకు తిరిగి రావడానికి వీలులేదు. మరొక సంవత్సరంపాటు ఎలాగైనా అమెరికాలోనే ఉండు. ఇక్కడ యుద్ధం చాలా భయంకరంగా ఉంది. జపాన్ వారి ఆక్రమణలో ఉన్న పెకింగ్ నీకు వాసయోగ్యమైన ప్రదేశంకాదు. పైగా నీవు రాకూడదనడానికి మరొక కారణం కాయ్..." ఆ పైన అతడీ విషయం వివరించలేదు. ఆదుర్దాగా ఆమె రెండో ఉత్తరం విప్పింది. ఈ ఉత్తరంలో భాష మొదటి దాన్నికన్న నిష్ఠురంగా, నిర్దాక్షిణ్యంగా ఉంది. తాను అమెరికాలోనే ఉండాలన్నమాట ఇందులో శాసిస్తున్న ధోరణిలో ఉంది. కాయ్ ని గురించి ఒక్కముక్క కూడా లేదు.

భగవంతుణ్ణి ధ్యానంచేస్తూ మూడో ఉత్తరం విప్పింది. అందులో ఇలా ఉంది.

"నా చిట్టి తల్లికి! ఈ ఉత్తరం చదివేటప్పుడు, ధైర్యంగా ఉండు. ఎంతో సంతాపకరమైన వార్త నేను నీకు వ్రాయవలసి వచ్చింది. అది నీకు చాలా బాధకలిగిస్తుందని నాకు తెలుసు, మనకు ఎన్నటికీ బోధపడని మానవ జీవిత వైపరీత్యాలలో ఇది ఒకటి అని గ్రహించి, దానికి తగిన నిర్లిప్తతతోనే దీనిని నీవు స్వీకరించాలి.

"ఏప్రిల్ 23 వ తేదీన కాయ్ యుద్ధంలో మరణిం

చాడు. ఈ విషయం నేను రెండు వారాల క్రిందట వ్రాసిన ఉత్తరంలోగాని, గతవారం వ్రాసిన ఉత్తరంలో గాని నీకు వ్రాయవలసింది. కాని, ఆ రెండు తడవలూ కూడా నాకు ధైర్యం చాలలేదు. నేను నీమీదనే ప్రాణాలు పెట్టుకొని ఉండడమే దీనికి కారణం. నీకీవార్త ఎంత సంతాపకరమైనదీ తల్లీ! నాకు తెలుసు.

"కాయ్ మన దేశపు ప్రచ్ఛన్న సైన్యంలో చాలా ముఖ్యమైన ఉద్యోగిగా పనిచేస్తూ ఉండేవాడని నీకు తెలుసుగద! అందుచేత జపాన్ వారు త్వరలో అతడి ఆచూకీ తెలుసుకొని పట్టుకొనక తప్పనిసరి అయింది. కాయ్‌కి ఈ సంగతి తెలుసు కాని, ఆ ప్రమాదాన్ని అతడు లక్ష్యం చెయ్యలేదు. జపాన్ వాళ్ళు అతణ్ణి ఖైదీగా పట్టుకొని, చాలా రోజులపాటు అనేకవిధాల అతడి వద్దనుంచి రహస్యాలు రాబట్టాలని చూచారు. ఎంత ప్రయత్నించినా, ప్రచ్ఛన్నంగా యుద్ధం చేస్తూన్న ఇతరులను గురించి అతడేమీ చెప్పలేదు. చివరికి నాలుగు వారాల క్రిందట వాళ్లు అతణ్ణి బయటికి తీసుకుపోయి తుపాకీతో కాల్చి చంపారు.

"కాయ్ గొప్పతనం అతని మరణానంతరం గాని తెలుసుకోలేక పోయినందుకు ఇప్పుడు నేను చాలా విచారపడుతున్నాను. నీవు అతడితో స్నేహం చేస్తున్నావని కోపగించుకున్నందుకు నేను చాలా పశ్చాత్తాప పడుతున్నాను. ఈనా బాధను గ్రహించి నా పొరపాటును మన్నించడానికి ప్రయత్నించగలవా తల్లీ!..."

ఆమె వెనక్కి ప్రక్కమీద విరుచుకు పడిపోయింది. ఇంటి కప్పువంక శూన్యదృక్కులతో చూస్తూంది. క్రమంగా ఆమె ఉత్తరంలో చదివినమాటలు ఒక్కొక్కటే ఆమె మనస్సులో తిరుగుతున్నవి. "కాయ్ మరణించాడు! కాయ్ మరణించాడు!" అని ఆమె బిగ్గరగా అరచింది.

* * *

జూన్ నెల మధ్య పియావోచెన్ మిషిగన్ విశ్వవిద్యాలయపు పట్టభద్రఅయింది. పట్టాలు తీసుకొనడానికి గాను అందమైన గౌనులు, టోపీలు ధరించి వరుసగా వేదిక పైకి వెళ్ళినవారిలో వైద్యపట్టం పొందిన చైనాయువతి ఒక్కపియావోచెన్ మాత్రమే. అందుచేత ఆమె పట్టం తీసుకొన్నప్పుడు హర్షధ్వానాలు ద్విగుణీకృతమయినవి.

పట్టం తీసుకోగానే, న్యూయార్కులో తన జ్ఞాతి తమ్ముడి కూతురయిన ఆన్‌లీన్ వద్దకు వెళ్ళవలసినదిగా ఆదేశిస్తూ ఆమె తాతగారు ఉత్తరం వ్రాశాడు. ఆన్‌లీనే ఈమెకు మొదట విశ్వవిద్యాలయంలో ప్రవేశం కలిగేటట్లు చేసింది. ఈమె న్యూయార్కు నగరంలో ఒకహోటల్ యజమాని అయిన యాంగ్‌ఛేని వివాహమాడి, ఐదేళ్ళక్రితమే షికాగో నుండి న్యూయార్కు వెళ్ళింది.

చివరకు నిరాశతో నిస్పృహతో పియావోచెన్ రైలుదిగి, గ్రాండ్ సెంట్రల్ స్టేషన్ ద్వారంగుండా మెల్లగా బయటికి వస్తూంది. ఆన్‌లీను, యాంగ్‌ఛే, వా

చిట్టికూతురు డాలీ ఆమెకు స్వాగతమివ్వడానికి వచ్చారు. ఆ యువతు లిద్దరు వెనుక ఒకరి ఫొటో ఒకరు తీసుకు ఉంచుకున్నారు. వాటి సహాయంతో షియావోచెన్ ఆ గుంపులో కలిసిపోయేలోగానే వారిద్దరు పరస్పరం గుర్తుపట్టుకోగలిగారు. ఇద్దరు అభినందన పూర్వకంగా చేతులు ఊపారు. అయితే, షియావోచెన్ హృదయం దుఃఖంతో చాలా బరువుగా ఉండడం వలన ఆమె పెద్ద ఉత్సాహం ప్రకటించలేక పోయింది. కాని, వారి కుటుంబంలో కలిపి పోయిన మీదట ఆమె హృదయభారం కొంత తగ్గింది. కొద్ది క్షణాల్లోనే డాలీ ఆమెకు చిత్రంగా బాగా చనువై పోయింది.

న్యూయార్క్ నగరంలోని రాక్ ఫెల్లర్ కేంద్రాన్ని, అతి కాంతిమంతంగా వెలిగిపోయే బ్రాడ్వే (వీథి) నీ, నలభై రెండవ వీథిలోని ప్రపంచ చతుష్పథాన్ని (Cross Roads of the Word) తొలిసారి షియావోచెన్‌కి చూపించాలనే సంకల్పంతో యాంగ్ చే కారును వాటి మీదుగా తోలుతున్నాడు. కాని, షియావోచెన్ దారిపొడుగునా డాలీతో ఆడుకుంటూ ఆ మహానగరశోభను తలయెత్తి చూడలేదు. కారులో చాలాదూరం వెళ్ళినమీదట, చివరికి వారు నాట్ వీథిలో ప్రవేశించగానే, "ఇప్పుడు మనం చైనాటౌన్ లోకి వచ్చేశాం," అన్నాడు యాంగ్ చే. షియావోచెన్ ఆశ్చర్యంగా కిటికీలోంచి చూస్తూంది. పెద్దపెద్ద గొట్టపు దీపాల పేర్లుగల హోటళ్ళ ముందు చైనాపిండివంటల పేర్లన్నీ

వ్రాసిపెట్టి ఉన్నవి. అద్దాల అరలలో చైనా ఆహార పదార్థాలు ఆకర్షకంగా అమర్చబడి ఉన్నవి. మరికొన్ని దుకాణాలలో చైనానుండి వచ్చిన రకరకాల చిత్రవస్తువులన్నీ ఉండడం చూడగానే పియావో చెన్‌కి స్వదేశంలో ఉన్నట్టే ఉంది.

కారు బేయక్ వీథిలోకి మళ్లి, గోధుమ వన్నె రాళ్ళతో కట్టిన ఒక భవనం ముందు ఆగింది. ఆ మహాభవనంలో యాంగ్ కుటుంబం మూడవ అంతస్తులో ఐదుగదుల భాగం ఒకటి అద్దె తీసుకుని ఉన్నారు. గదులన్నీ విశాలంగా, కొత్తరకపు కుర్చీలతో, బల్లలతో కలకల లాడుతున్నవి.

ఆ రోజు సాయంకాలం యాంగ్ చే వారి నందరినీ విందుకి హోటలుకు తీసుకు వెళ్ళాడు. ఆ హోటలు చూసేసరికి పియావో చెన్‌కి పెకింగ్‌లోని తన తాతగారి భవంతి జ్ఞాపకం వచ్చింది.. వాళ్ళు తిరిగి ఇంటికి వచ్చే లోపుగా పియావో చెన్‌ని ఆన్‌లీన్: "నివ్వూ డాలీ ఒక గదిలో పడుకుంటారా?" అని అడిగింది. ఈ సూచన పియావో చెన్‌కి ఆనందం కలిగించింది. ఆమె డాలీని స్నానం చేయించి నిద్రకు సిద్ధం చేసింది. ఆమెను పడుకోపెడుతూ ఉండగా, డాలీ తన చేతులు ఎత్తి "డాక్టరు పిన్నీ! మరి నువ్వు తెల్లవార్లూ నా దగ్గిరే పడుకుంటావా?" అంది.

"అవును తల్లీ!"

"రోజూ కూలా నువ్వు నా దగ్గిరే పలుకో డాక్టర్లు చిన్నా!" అంటూ డాలీ నిద్ర పోయింది.

సెవెన్త్ ఎవెన్యూ లోకల్ రైలు వర్త్ స్ట్రీట్ వద్ద నున్న స్టేషన్‌లో ఆగింది. వందల కొలది ప్రయాణికులతో పాటు పియావోచెన్ కూడా దిగింది. ఆకురాలు కాలపు గాలి చలి చలిగా వీస్తూంది. ఆమె నేవీబ్లూ రంగు పట్టు జాకెట్టు వెచ్చగా శరీరానికి అంటి పట్టుకునేటట్టు కుని ప్లాట్ ఫారం మీదనించి గబగబా బయటికి వస్తూంది.

దాదాపు మూడు నెలలు ఈ పడుచు లేడీ డాక్టరు తన పిన తండ్రి కూతురు ఇంట్లో అతిథిగా గడిపింది; ఒక దినం గడచిన కొద్దీ ఈమె ఆందోళన అధిక మవుతూంది. ఆన్‌లీన్, ఆమె భర్త ఈమెకు సంతోషం కలిగించాలని ఎంతో ప్రయత్నిస్తున్నారు. ఈమె తమ వద్ద ఉండడం తమకు ఎంతో సౌఖ్యంగా ఉన్నదనీ, ముఖ్యంగా డాలీకి ఈమె కలిగిస్తూన్న ఆనందం, తన వల్ల వారికి అయే అధిక వ్యయం కన్న ఎన్నో రెట్లు అధికం అనీ వారమెకు ఎన్నో సార్లు చెప్పారు. ఎంత చెప్పినా, ఇతరులపై ఆధారపడి ఉన్నానన్న ఈమె విచారం మాత్రం తగ్గలేదు. ఒక విధంగా మనస్సుకు సంతృప్తి కలిగించుకోనగోరి, తాను యాంగ్ టే హోటలులో పనిచేస్తానని పట్టు పట్టింది. వేసవిలో కొందరు పని వాళ్ళు సెలవు తీసుకొని వెళ్ళడం వలన కొంత కాలం అలాంటి అవకాశం ఆమెకు లభించింది. కాని,

:లవలు పూర్తి అయి, వాళ్ళు తిరిగి వచ్చిన తరువాత తన
ోసం వాళ్ళలో ఎవరినైనా పనిలోంచి తగ్గించడానికి
మాత్రం ఆమె అంగీకరించలేదు.

ఆమెకు వైద్యం చెయ్యాలనే ఉంది. కాని,
లైసెన్సు సంపాదించనిదే వీలులేదు. వైద్యరంగంలో
ఆమె అప్పుడు చేయగలిగిన దల్లా ఏవైనా ఆసుపత్రులకు
పర్యవేక్షకురాలుగా వెళ్ళి వస్తూండడం మాత్రమే. కాని,
దీనివల్ల తాను క్రొత్తగా గణించే జ్ఞాన మేమీ లేదని అచిర
కాలంలోనే ఆమెకు అర్థమైపోయింది.

* * *

ఇప్పుడామె ప్రతిదినం ఎక్కడో దూరాన 168 వ
వీధిలో ఉన్న వైద్య కేంద్రానికి భూగర్భంలోని సురంగపు
రైలుమీద వెళ్ళి వస్తూంది. చివరికి అక్కడ ఎంబ్రియో
లాజికల్ పరిశోధన శాలలో పని చేయడానికి ఆమెకు అవ
కాశ మిచ్చారు. ప్రసూతి శాఖకు, స్త్రీల వ్యాధుల
శాఖకు అధ్యక్షుడైన డాక్టర్ కింగ్ ఆమె అసాధారణ
ప్రజ్ఞలను అచిరకాలంలోనే గ్రహించి ఆమె పరిశోధనలను
శ్రద్ధగా కనిపెట్టిచూస్తూ ఉండేవాడు. ఆపరేషన్లు చేసే
టప్పుడు చూడడానికి, సహాయపడడానికి పరిశోధన శాలలో
సాంకేతిక నిపుణులకు అవసరమైనపుడు సలహా లివ్వడానికీ
కూడా అచిర కాలంలోనే ఆమెకు అవకాశ మిచ్చాడు.

పరిశోధనల విభాగంలో ఏర్పడిన ఒక క్లిష్ట సమస్యను

ఆమె శాస్త్రీయ పద్ధతులపై సక్రమంగా విశదీకరించి ఆ ప్రయోగాలకు సరియైన విధానాన్ని సూచించడం ఒక రోజున డాక్టర్ కింగ్ ప్రత్యక్షంగా చూచి, "డాక్టర్! నీవు మాకు చాలా సహాయకారిగా ఉన్నావమ్మా! మేము నీ ఋణం ఎలాగ తీర్చుకో గలమా అని ఆలోచిస్తున్నాను. త్వరలోనే నాకు ఆ అవకాశం కలుగుతుం దనుకుంటున్నాను. ఇటీవల ఒక పెద్ద ఔషధ పారిశ్రామిక సంస్థవారు నా దగ్గరకువచ్చి వారికి కొన్ని సమస్యల విషయంలో మన సహాయం కావాలని కోరారు, ఆ సంస్థ చాలా నిజాయితీ గలదని తెల్సుకున్న తరువాత ఒక పరిశోధన కేంద్రం ఏర్పాటు చేయవలసినదిగా వారికి సలహా యివ్వదలుచు కున్నాను. ఆ వ్యవహారమంతా నీ పర్యవేక్షణ క్రింద జరిగించాలని కూడా నేను సిఫార్సు చేశాను. ఈ పనికి నీకు వారు మంచి పారితోషికం ఇస్తారు."

"ధన్యవాదాలు డాక్టర్ కింగ్! ప్రస్తుతస్థితిలో ఇది నాకు ఎంత గొప్ప సహాయమో బహుశః మీకు తెలియదు," అని యించు మించు హర్షాశ్రువులతో కృతజ్ఞత ప్రకటించింది.

"అమ్మాయీ! నిన్ను గురించి నీవు అనుకునే దాని కన్న నాకు ఎక్కువ తెలుసు. నీ సంపూర్ణ చరిత్రను వాకబు చేయకుండా యింత ముఖ్యమైన పనిని నేను నీకు అప్పగిస్తానను కున్నావా?" అన్నాడు డాక్టర్ కింగ్.

ఆ సాయంకాలం ఆమె బరువు దించిన హృదయంతో సంతోషంగా యింటికి వెళ్ళింది. కొన్ని నెలలుగా ఎన్న డెరుగని అనందం ఆమెకు మళ్ళీ ఆ వేళ కలిగింది. ఆమె భవిష్యత్తును గురించి కలలు గనడానికి ఆనాడే మళ్ళీ ఆరంభం.

*          *          *

ఒకరోజున ఆసుపత్రిలోని హోటలులో ఆజాను బాహువైన అందమైన ఒక చైనాయువకుడు తనను తానే షియూవోచెన్‌కు పరిచయం చేసుకున్నాడు. "చూడండి! నాపేరు పీటర్‌లీ! మిమ్మల్ని కలుసుకోవాలని చాలా కాలంగా అనుకుంటున్నాను. ఇక్కడ నేను శరీరశాస్త్రంలో సహాయాచార్యుడుగా పని చేస్తున్నాను," అన్నాడు చిరు నవ్వుతూ.

"మీ పరిచయం కలిగినందుకు సంతోషం. ఇక్కడ నేను ప్రసూతి, స్త్రీల వ్యాధులశాఖలలో పరిశీలకురాలుగా "ఉంటున్నాను," అని ఆమె జవాబు చెప్పింది.

ఆనాడు సంతోషంగా భోజనం ముగిసిన తరువాత, ఆనాటి సాయంకాలం ఆమె తన పరిశోధనశాలకు రావడానికి వీలుంటుందా అని అతడు ఆమెను సవినయంగా ప్రశ్నించాడు. ఆమె అతడి ఆహ్వానాన్ని ఆమోదించింది తీరా ఆమె వెళ్ళేసరికి అక్కడ ఉచ్చైశ్రవాల్లాగ ఎక్కడా మచ్చామరకాలేని తెల్లని యూనిఫారాల్లో పధ్నాలుగురు

స్త్రీలు పీటర్ లీ సహాయ సాంకేతిక నిపుణులుగా పనిచేస్తు న్నారు. ఆతడు వారిని సగౌరవంగా పిలిచి, షియూవో చెన్‌ని వారందరికి పరిచయం చేశాడు. పిదప తా నక్కడ చేస్తూన్న కొన్ని ప్రయోగాలను ఆమెకు చూపించాడు.

మూత్రపిండాన్ని కోసివేసినా పూర్ణారోగ్యంతో బ్రతికి ఉన్న ఒక కుక్క అక్కడ ఉన్నది. శరీరం వెలుపల ఉన్న ఒక ప్లాస్టిక్ అవయవంలోకి ఆ కుక్క రక్తం పంపుచేయ బడి, అచట పరిశుద్ధమయి తిరిగి దానిరక్తనాళాల్లోకి పంప బడుతూన్నందు వల్ల ఈ అతి విచిత్ర సంఘటన సాధ్య మయింది. మరొక ప్రయోగంలో, ఊపిరితిత్తుల పనిని ఒక యంత్రం నిర్వర్తిస్తూంది. మరొక ప్రయోగంలో గుండె కాయకు బదులుగా మరొక కృత్రిమ పరికరం పనిచేస్తూంది.

ఇట్టి ప్రముఖ పరిశోధనలను తన జాతికి చెందిన ఒక వ్యక్తి సాధించడం షియూవో చెన్‌కి విశేషగర్వకారణంగా కనిపించింది. ఆ పరిశోధనశాలా సందర్శనం వల్ల విసకట కలిగించే అనుదిన కార్యక్రమంతో కూడిన తన జీవితంలో ఆనాడు అత్యానందంగా గడిచింది.

"డాక్టర్! మీరు ప్రతిదినం ఇక్కడికి దయచేయా లని నాకోరిక. డాక్టర్ కింగ్ పరిశోధన శాలలో మీరు చేసిన ప్రశంస్య కృషిని గురించి నేను విన్నాను. మాకు కూడా మీరు విలువైన సలహాలు ఇవ్వగలరని నా ఆశ."

సాధారణంగా మధ్యాహ్న భోజనం వారిద్దరూ ఒక

చోటే చేసేవారు. సాయంకాలం అతడు తరచు ఆమెవెంట వెళ్లి ఆమెతోపాటుగా యాంగ్ టీ హోటలులోనే రాత్రి భోజనం చేసేవాడు. అతడు క్రమంగా తనను ప్రేమిస్తున్నాడన్నభావం ఆమెకు కలిగింది. కిస్మస్ సెలవల్లో అతడు శాన్ఫ్రాన్సిస్కోలో ఉన్న తన తలిదండ్రుల వద్దకుపోకుండా న్యూయార్క్‌లోనే ఉండిపోవడం ఈ అభిప్రాయాన్ని ఇంకా బలపరిచింది.

సెలవలు వారం రోజులలో వారు చాలాసార్లు కలుసుకున్నారు. చివరికి సంవత్సరాది రోజున అతడామెను హోటల్ న్యూయార్కర్‌లో ఫ్రెటర్నిటీ డాన్సుకి తీసుకు వెళ్లాడు. "ఔల్డ్ లాంగ్ సైన్" అనే గీతానికి అనుగుణంగా చివరి డాన్సుచేస్తూన్నప్పుడు, తనను వివాహం చేసుకోవలసినదని ఆయన షియావోచెన్‌ని అడిగాడు.

ఆమె మౌనముద్రదాల్చి నృత్యం సాగిస్తూ, కొంతసేపటికి జవాబు చెప్పింది: "పీటర్! నేను ప్రస్తుతం ఈ ప్రశ్నకు ఏ విధమైన జవాబు చెప్పలేను. మనం పరస్పరం తెలుసుకొనవలసిన విషయాలు ఇంకా చాలా ఉన్నవి. అందుచేత ఆలోచించుకొనడానికి కొంత వ్యవధి అవసరం."

సంవత్సరాది మరునాడు డాలీకి గొంతు నొప్పి చేసింది. తరువాత మూడురోజులు ఆమెకు కొంచెం జ్వరం కూడా తగిలింది. తరువాత పైకి బాధలేమీ కనిపించలేదుగాని క్రమంగా ఆమెలో జీవశక్తి క్షీణించి పోతున్నట్టు కని

పించింది. తెల్లగా పాలిపోయింది. ఆకలి లేదు. మనోహర మైన ఆమె మందహాసం క్రమంగా మాయమై పోయింది.

ఒకనాడు ఉదయం డాలీ నిద్ర లేచేసరికి చాలా నలిగి పోయి ఉంది. కనురెప్పలు, ముఖము బాగా ఉబ్బి ఉన్నవి. నిద్ర లేస్తూనే పియాంగ్‌చెన్ కోసం ప్రక్కలో చేతులతో ఇటూ అటూ వెతుక్కుంటూ "పిన్నీ! నా తలలో నొప్పి పులుతూంది," అని ఏడ్చింది.

డాలీ పరిస్థితి ఇలా అకస్మాత్తుగా చెడిపోవడం మూత్ర పిండ వ్యాధికి సూచకం అవడం వలన పియాంగ్ చెన్ కంగారు పడింది. ఇలా జరుగుతుందేమో అన్న భయం ఆమెకు అంతకుముందే ఉన్నా, అట్టి లక్షణాలు కనిపించ డానికి ఇదే మొదలు. ఆమె ఆన్‌లీన్ దగ్గరకు పరుగెత్తింది. ఆ క్రితం రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు నాటకం చూచి రావడం వల్ల ఆమె ఇంకా నిద్ర లేవలేదు. తలుపు తట్టి, సమాధానం లేనందున, పియాంగ్‌చెన్ లోపలికి వెళ్ళి, ఆమెను కదిలించి లేపి, "ఆన్‌లీన్ అక్కా! డాలీకి బాగా సుస్తీచేసింది." అన్నది.

ఆన్‌లీన్ మంచం మీంచి చివాలున లేచి, చెల్లెలి వంక శూన్యదృక్కులు ప్రసరిస్తూ. "ఏమిటే నువ్వనేది? రాత్రి బాగా ఆరోగ్యంగానే ఉన్నదే!" అంది.

"లేదు లేదు. సంవత్సరాది క్రిందటి రోజున గొంతు వాచినది మొదలుకొని ఆమె ఆరోగ్యం బాగుండటంలేదు.

ఈ మధ్య నీకు తీరుబాటు ఎక్కువ లేక పోవడం వలన ఆమె పరిస్థితి నీవు గమనించలేదు. నేను తిరిగి వచ్చేదాకా నువ్వే ఆమెను జాగ్రత్తగా కనిపెట్టి ఉండు,'' అంటూ ఆమె డాలీ మూత్రం పట్టిన సీసాతో వైద్య కేంద్రానికి పరుగెత్తింది. అక్కడ దానిని పరీక్ష చేయిస్తే, అందులో చీము, రక్తం కూడా ఎక్కువగా ఉన్నాయని తేలే సరికి, ఆమె హృదయం కృంగిపోయింది. వెంటనే తిరిగి షైనా టౌనుకు వచ్చింది. పిల్లను ఉయ్యాలలో పడుకోబెట్టి ఊపుతూ ఆన్‌లీన్ యింకా ఆ రాత్రి దుస్తులలోనే ఉంది. ఆ మాతృనేత్రాలలో యిప్పుడు ఆందోళన కనిపిస్తోంది.

ఉబ్బి ఉన్న ఆ పిల్లను వేరే ప్రక్కవేసి పడుకో బెట్టిన తరువాత ఆమె బాధ్యత మళ్ళీ పియావోచెన్ స్వీకరించింది. "ఆన్‌లీన్! శ్రద్ధగా విను! డాలీకి నెఫ్రిటిస్ వ్యాధి తీవ్రరూపంలో వచ్చింది. నెఫ్రిటిస్ చాలా ప్రమాదకరమైన మూత్ర పిండ వ్యాధి. అంచేత వెంటనే డాలీని ఆసుపత్రికి తీసుకుపోవాలి,'' అన్నది.

తరువాత ఒక గంటసేపు టెలిఫోను దగ్గర కూచుని, డాలీని వైద్య కేంద్రంలో చేర్చడానికి అవసరమైన ఏర్పాట్లన్నీ ఫోను ద్వారానే చేసి వేసింది. నెఫ్రిటిస్ వ్యాధిలో ప్రత్యేక నైపుణ్యం గల వాడు ఆమెకు చికిత్స చేసేటట్టు కూడా ఏర్పాటు చేయించుకుంది.

డాలీ ఆసుపత్రిలో ఉన్నంతకాలం పియావోచెన్

రాత్రి భోజనానికి చైనా టౌన్‌కి రాలేదు. ప్రతిరోజు సాయంకాలం డాలీ గదికి వెళ్ళి నిద్ర పట్టే వరకు ఆమెతో ఆడుతూ, ఏదో చదివి వినిపిస్తూ కాలక్షేపం చేసేది.

ఇది పీటర్‌కు చాలా బాగుంది. అతడు ప్రతి సాయంకాలం తన పరిశోధనశాలలో పని పూర్తికాగానే వచ్చి పియూవో చెన్‌ని కలుసుకునేవాడు. రాత్రి వారిద్దరు ఒకే చోట భోజనం చేసేవారు.

పీటర్ సూచనను గురించి ఆమె చాలా ఆలోచించింది. వాళ్ళిద్దరూ ఎన్నడూ మాట్లాడుకోని విషయాలు ఇంకా చాలా ఉన్నవి. ఏప్రిల్ మధ్యలో ఒకరోజున వారు వేయించిన పీతలతో చేసిన రుచికరాహారం తీసుకుంటూన్న సమయంలో అతడు పియూవో చెన్‌ను జవాబుకోసం మళ్ళీ వత్తిడి చేశాడు. ఆమె మళ్ళీ డొంక తిరుగుడు జవాబే చెప్ప డానికి తీర్మానించుకొన్నది: "ఒకవృత్తిని అవలంబించ దలుచుకొన్న స్త్రీకి వివాహాన్ని గురించిన నిర్ణయం చాలా క్లిష్టమైన సమస్య. నేను గృహిణినైతే నాప్రస్తుత వైద్యపరి శోధనలు కొనసాగించడం చాలాకష్టం. కాని, ఈ రెండు పనులు కూడా సక్రమంగా నిర్వర్తించగలగడానికి అవసర మైన ఏత్యాగమైనా నేను చేయదలుచుకున్నాను," అన్నది.

"అదేమన్నమాట? అర్థం లేనిమాట! స్త్రీకి గృహిణీ ధర్మమే ముఖ్యం. నీవు వైద్యాన్ని పూర్తిగావిడిచి పెట్టగలవనే నేను ఆశిస్తున్నాను."

అకస్మాత్తుగా ఆమెకు ఆకలి తీరిపోయింది. భోజనపు పళ్లాన్ని ప్రక్కకు త్రోసివేసింది. ఈ వైఖరిచూచి, "ఏమిటి కథ? ఆకలిగా లేదా? డాలీకి ఆరోగ్యం కలుగుతూందా? నీవు ఇతరుల బిడ్డను గురించి అనవసరంగా చాలా ఆందోళన పడుతూన్నట్టు కనిపిస్తూంది," అన్నాడు.

"ఔను, పీటర్! డాలీని గురించి నేను చాలా బాధ పడుతున్నాను. ఈ వేళే నిన్ను గురించి ఆమెకు చెప్పాను. ఎప్పుడైనా ఒకసారి అలా వచ్చి ఆమెకు కాస్త ధైర్యం చెప్పు."

"బాగానే ఉంది. నాకు తీరుబాటెక్కడ? పైగా పసిపిల్లల విషయం నేను ఏమంత పట్టించుకోను."

అంతవరకు పీటర్ పట్ల షియూ-చెన్‌లో ఏ మాత్రమైనా ప్రేమ ఉంటే, అది కాస్తా ఈ మాటలతో తుడిచి పెట్టుకుని పోయింది. ఆ రోజున అతడికి "గుడ్ బై" చెప్పేటప్పుడు ఆమె దుఃఖాన్ని బలవంతంగా మింగి, భూసురంగపు రైలుకి మెట్లుదిగి వెళ్ళిపోయింది.

జూన్ నెల మధ్యకు డాలీ బాగా పాలిపోయి, నీరసించింది.

ఒకనాడు సాయంకాలం చాలా నిస్పృహతో ఉన్న సమయంలో షియూ-చెన్ తన తాతగారికి ఇలా వ్రాసింది:

"ప్రియమైన తాతయ్యా! నెఫ్రిటిస్ వ్యాధి నివార

ణకు స్పష్టంగా ఉపయోగపడగల ఔషధమేదీ లేదని న్యూయార్క్‌లోని మా ప్రముఖ వైద్య కేంద్రంలోని సుప్రసిద్ధ వైద్యులంతా చెపుతున్నారు. కొన్ని యేళ్ళ క్రిందట నెఫ్రిటిస్ వ్యాధితో బాధపడుతున్న ఒక స్త్రీ విషయంలో పాశ్చాత్య వైద్యులు పూర్తిగా ఆశవదులుకున్న తరువాత నీవామెను కాపాడిన సంగతి నాకు జ్ఞాపకం ఉన్నది. డాలీ వ్యాధి విషయంలో నువ్వు మాకేమైనా సలహా లివ్వ గలవా?...

"దయచేసి నీ ప్రత్యుత్తరం వెంటనే విమానం టపాలో పంపు.!"

ఆ రోజులలో పెకింగ్‌కి ఉత్తరాలు చేరడం క్రమ క్రమంగా అనిశ్చితమై పోతూంది. వాటిలో చాలా భాగం, జపాన్‌వారి ఆక్రమణలో ఉన్న ఆ నగరానికి చేరేలోగానే అగ్ని పాలవడమో, అపహరింప బడడమో జరుగుతూంది. రోజులు, వారాలు గడచి పోతున్నవి. వాంగ్‌కంగ్ దగ్గర నుంచి జవాబు లేదు.

ఒక నాడు ఉదయం పరిశోధనాలయానికి వెళ్ళగానే ఆమె కొక సైపు చేసిన ఉత్తరం అందించారు. ఆ నాడు సాయంకాలం డాక్టర్ కింగ్‌ని అతడి ప్రయివేటు ఆఫీసులో కలుసుకోమని అందులో వ్రాసి ఉంది. ఇది ఆ పరిశోధ కోద్యోగం సంబంధమై ఉంటుంది. అనుకున్నది. కాని, మధ్యాహ్నం కాక పూర్వమే డాలీ ఉన్న వార్డులోకి రమ్మని

కబురు వచ్చింది. ఆ పిల్ల సుమారొక గంటనుండి కక్కు-కుంటూంది. డోకులు కట్టించడానికి చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఇవి అంత్య కాలపు చిహ్నాలు కావచ్చు. మధ్యాహ్న విరామసమయం పూర్తి అయిన కొంత సేప టికి హఠాత్తుగా డోకులు ఆగిపోయి బాగా తెలివివచ్చింది. యాంగ్ చే, ఆన్ లీన్ ఇది చూచి సంతోషపడి, భోజనం చేయడానికి వెళ్ళారు. పియావో చెన్ డాలీకి కబుర్లు చెపు తూంది. తొమ్మిది గంటలకు ఆమె తలిదండ్రులు తిరిగి వచ్చారు. డాలీ ప్రశాంతంగా నిద్రపోతూండడం చూచే సరికి వారి ఆందోళన చాలా భాగం తగ్గింది. ఆ రోజైనా ఇంటికి వెళ్ళి హాయిగా నిద్రపొమ్మని వాళ్ళిద్దరు పియావో చెన్ని బలవంతం చేశారు. డాలీ విషయం శ్రద్ధగా చూడ డానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేసి ఉండడం వల్లను, కొన్ని నాాలుగా విశ్రాంతి లేక తాను పూర్తిగా అలసిపోయి ఉన్నందు వల్లను పియావో చెన్ వాళ్ళ సూచనను అంగీ కరించి, చైనా టౌన్ కి వెళ్ళడానికి భూమి అడుగు రైలు స్టేషనుకి బయలు దేరింది.

మరునాడు ఉదయం నిద్ర లేచి చూచే సరికి యాంగ్ చే గాని, ఆన్ లీన్ గాని ఇంటికి రాక పోవడం ఆమెకు ఆందోళన కలిగించింది. అతి వేగంగా స్నానంచేసి, బట్టలు వేసుకుని, ఉదయోపహారం సంగతే మరచిపోయి, రైలు స్టేషనుకి పరు గెత్తింది.

ఆ బాల వైద్యశాల గేటు వద్ద డాక్టర్ హాప్కిన్స్ని

ఆమెకు ఎదురయాడు. "నీ కోసమే చూస్తున్నా నమ్మా. పాపం మీా పాప డాలీ చనిపోయింది. ఇక్కడ మేం చేయ గలిగిన వన్నీ చేశాం. లాభం లేక పోయింది", అన్నాడు.

తీరా డాలీ అంత్య క్రియల రోజున పియూావో చెన్ ఉత్తరానికి వాంగ్ కంగ్ జవాబు చేరడం విధి వైపరీత్యంలా కనిపించింది.

"పసిపిల్ల జబ్బును గురించి నీవు వ్రాసిన విషయాలు నాకు చాలా విచారం కలిగించినవి. ఆమె మూత్ర పిండాలు చెడిపోతే, ఎండ బెట్టిన మూత్ర పిండాల పొడిని ఆమెకు ఔషధంగా వాడాలి. మన నీచింగ్ పండితుని సూక్తులు జ్ఞాపకం చేసుకో. తల నొప్పి రోగికి మేదస్సుతోను, అజీర్ణ వ్యాధికి గర్భకోశముతోను ఔషధం తయారు చేసి వాడాలని ఆయన సిద్ధాంతం. తల్లి! వెంటనే ఆమెకు ఎండబెట్టిన మూత్ర పిండపు ఔషధం ఎక్కువగా యిచ్చే ఏర్పాటు చెయ్యి. నువ్వు వ్రాసిన లక్షణాలనుబట్టి, అట్టే వ్యవధి లేనట్టు కనిపిస్తూంది...."

చైనా దేశపు ప్రాచీన వైద్య గ్రంథాలలోని ఈ వైద్య సిద్ధాంతం డాలీ మరణానికి క్రిందటి రోజున డాక్టర్ కింగ్‌ని చూడడానికి వెళ్ళాలనుకున్నప్పుడు ఆమె మనస్సులో ఆడు తూంది. ఆలస్యానికి క్షమాపణ కోరుతూ, ఆమె పరిశోధన శాలనుండి ఫోన్ చేసే సరికి, "ఫరవాలేదు, నీ ఆందోళన నేను గ్రహించగలను. ఇప్పుడు రాగలవా?" అని డాక్టర్ కింగ్ ఎంతో ఆదరంతో జవాబు చెప్పాడు.

ఎందుకో ఆయన ఉత్సాహంతో పొంగిపోతున్నాడు. "చివరకు నీకు రీసెర్చి ఫెలోషిప్‌కి సంబంధించిన ఏర్పాట్లన్నీ చేశామమ్మా. ఇకమీదట పనిచేయవలసినది నీవు గనుక, నీ అభిప్రాయాలేమిటో చెప్పు," అన్నారు.

ఆమె కళ్ళు ఒక్కసారిగా వేడెక్కినవి. చెక్కిళ్ళ వెంట బొటబొట కన్నీళ్ళు కారుతున్నవి.

"ఏమిటమ్మా? ఏమి జరిగింది? ఈ ఉద్యోగం నీవు కావాలని కోరుకున్నదేగా! విచారమెందుకు?"

ఆమె కళ్ళు తుడుచుకుని సేద దేరి, "మా అక్కగారి బిడ్డ నెఫ్రైటిస్ వ్యాధితో ఇటీవల ఇక్కడే మరణించిన సంగతి మీకు తెలుసుగా డాక్టర్! మేమెంతో ఆశతో ఆ పాపను ఈ వైద్యకేంద్రానికి తీసుకువచ్చాము. కాని, ఆమెకు చికిత్సచేయడానికి తగినసమందే లేకపోయింది."

"ఔనౌను నాకు తెలుసు," అంటూ ఆమె వంక జాలిగా చూచాడు డాక్టర్ కింగ్

వెంటనే ఆమె ప్రారంభించింది: "ఈవ్యాధి బాగా ప్రబలంగానే వ్యాప్తిలో ఉన్నదనుకుంటాను. నేను సాహసంగా మాట్లాడుతున్నానంటే మన్నించండి. ఈ వ్యాధికి తగిన చికిత్స రూపొందించడం కోసం నేను పరిశోధన చేయాలనుకుంటున్నాను."

ఆమె ముందుగా మూత్రపిండ వ్యాధులను గురించి

అంతవరకు జరిగిన పరిశోధనల వివరాలన్నింటిని క్షుణ్ణంగా పరామర్శించింది. సీచింగ్ వైద్యసూత్రాలలో నుండి తన తాతగారు పంపిన ప్రాచీన విధానాల ధోరణిలోనే ఇంచుమించు ఈ పరిశోధనల ఫలితాలు కూడా కనిపిస్తూ ఉండడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది.

పరిశోధనకు ఉపయోగించే జంతువులలో ఈ నెఫ్రిటిస్ వ్యాధి లక్షణాలను బలవంతంగా కల్గించి, ముందుగా వాటితో ప్రయోగాలు చేయడమే సక్రమమైన శాస్త్రీయపద్ధతి అని ఆమె నిశ్చయించుకున్నది. మూత్ర పిండాలకు చెరుపుచేసే వివిధ ఔషధాలతో కొన్ని నెలలపాటు ప్రయోగాలుచేసిన మీదట ఆమె ఒక శస్త్రవిధానమొకటి కనిపెట్టింది. దాని వలన మూత్రపిండాలు అధికంగా పనిచేస్తూ, వేగంగా వార్ధక్యలక్షణాలను పొందేటట్లు చేయగలిగింది. ఆ విధంగా అట్టి మూత్ర పిండాలు వ్యాధిగ్రస్తాలవుతున్నవి. అచిర కాలంలోనే డాలీలాగ మూత్రంలో ఆల్బుమిన్, నెత్తురు, చీము కనిపిస్తూ రక్తపుపోటు హెచ్చుగా ఉన్న వేలకొలది ఎలుకలను ఆమె పరిశోధనాలయంలో సిద్ధం చేసుకున్నది.

కసాయి దుకాణాలకువెళ్ళి జంతువుల తాలూకుపచ్చి మూత్ర పిండాలను తీసుకొనివచ్చి, వాటిపై పొరను జాగ్రత్తగా తొలిగించి, ఆ పైన వాటిని కొద్దిపాటి వేడిలో బాగా ఎండిపోయేటట్టు చేసింది. పిమ్మట అనేక రకాల ద్రవ పదార్థాలలోనికి వాటి సారం తీసింది.

ఆ మూత్ర పిండ సారద్రవాలలో ఒక్కొక్కటే ఆ

రోగం గల ఎలుకలకు వాడి చూడడానికి కొన్ని నెలలు పట్టింది. కాని, ఆ ఎలుకలకు రోగం నయం అవడానికి మారు, వాటిలో చాలాభాగం చనిపోయినవి.

సాయంకాలం ఆమె తన గదిలోనే ఏకాంతంగా కూచుని వైద్యం చేసే లైసెన్సు పొందటానికిగాను పాసు అవవలసి ఉన్న పరీక్షకు చదువుకుంటూ కాలక్షేపం చేస్తూంది.

ఈ పరీక్షలు మన్‌హాటన్‌కి మధ్యగా ఉన్న ఒక పాడుపెట్టబడిన నాటక శాలలో ఏర్పాటు చేయబడినవి. ఆమె ద్వారంవద్దకువెళ్ళి, తన ప్రవేశ పత్రము, గుర్తుకోసం దానికి అంటించిన ఫోటో చూపించిన మీదట లోపలికి వెళ్ళ వచ్చునని సంజ్ఞ చేశారు. వారి సూచనప్రకారం లోగడ రంగస్థలంగా ఉపయోగపడిన వేదికపైకి వెళ్ళింది. అక్కడ వరుసలు వరుసలుగా దగ్గర దగ్గరగా డెస్కులు, కుర్చీలువేసి ఉంచారు. ప్రధానపరీక్షకోద్యోగి లౌడ్ స్పీకర్లో మాట్లాడడం మొదలు పెట్టాడు: "దయచేసి శ్రద్ధగా వినండి! దంత వైద్యం చేయడానికి లైసెన్సు కోరుతున్నవారు దయచేసి డెస్కులమీద తెల్ల కాగితాలు ఉన్న వరుసలోకి వెళ్ళి కూచోండి. సామాన్య వైద్యం చేయడానికి లైసెన్సుకోరు తున్నవారు దయచేసి ఎర్ర కాగితాలు గల డెస్కులున్న స్థానాల వద్దకు వెళ్ళండి. శరీరమర్దన చికిత్సా శాస్త్రంలో ప్రాక్టీసు చేయదలచినవారు పసుపు కాగితాలు గల స్థానాల వద్దకు వెళ్ళి కూచోండి......"

ఈ సూచనల ననుసరించి, ఆ హాలులోని సాంద్ర జనసమూహమంతా సుళ్ళు తిరగడ మారంభించింది. పిమూవోచెన్ ఎర్ర కాగితం గల డస్కు దగ్గర తనకుర్చీ వెతుక్కుని కూచోడానికి పది నిముషాలు పట్టింది. "ఈ దరఖాస్తుదారు లందరూ ఎలాగో డాక్టర్లు కాలేరన్నమాట మాత్రం నిజం," అనుకుంది ఆమె తనలో తాను.

పరీక్షాపత్రంలో ప్రథమ ప్రశ్న ఏడవనరముయొక్క పుట్టుకను, మార్గమును, శాఖోపశాఖలను విశదీకరించవలసి నదిగా కోరుతున్నది. రెండవ ప్రశ్న మెదడు మొదటగల రంధ్రాలను గురించి, అవి వేటికి ద్వారాలైనదీ వివరించ వలసినదిగా కోరుతూంది. "ఈపేప రేమంత కష్టంగాలేదు," అనుకుంటూ ఒక్కొక్క ప్రశ్నకే జవాబులు వ్రాయడం మొదలు పెట్టింది.

మొదటిరోజు పరీక్ష కేవలం శారీరకశాస్త్రంలోను, శరీర నిర్మాణ శాస్త్రంలోను మాత్రమే. రెండవరోజు జీవ రసాయన శాస్త్రంలోను, మానసికవ్యాధులను గురించిన శాస్త్రంలోను పరీక్ష జరిగింది. చివరిరోజున ప్రశ్నపత్రాల్లో ప్రజారోగ్యాన్ని, ఔషధశాస్త్రాన్ని, రోగక్రిమి శాస్త్రాన్ని గురించిన ప్రశ్నలు ఉన్నవి. మూడవరోజు పరీక్ష ఆమె కేమీ లెక్కలేకపోయింది. ఆ శాస్త్రాల్లో సర్వం ఆమెకు క్షుణ్ణంగావచ్చు. అన్నిప్రశ్నలకు బాగానే వ్రాసింది. కాని, చిట్టచివరి ప్రశ్నమాత్రం ఇలా ఉంది: – "పాశ్చరిల్లా పెస్టిస్ అనే అంటువ్యాధి సోకినట్లు గుర్తించేవిధానం ఏమిటి ?"

ఈ ప్రశ్నకు సమాధానం తనకు తెలియదని ఆమె వెంటనే నిశ్చయం చేసుకుంది. ఆ ప్రశ్నకు ఎలాగైనా జవాబును యోచించడం కోసం మెదడును బాధించిన కొద్దీ ఆమె నుదుటిపైన చెమట బొట్లు పొడుచుకువచ్చినవి. తాను వ్రాయగలిగిందేమీ కనిపించలేదు. ఆమె నీరసం వచ్చి ముందున్న డస్కుమీదకు వ్రాలింది.

వెంటనే ఒక పర్యవేక్షకుడు ఆమె దగ్గరకు వచ్చి, "ఏమండీ సుస్తీగా ఉందా?" అని మెల్లగా ప్రశ్నించాడు.

"సుస్తీ ఏమీ లేదండీ! ఆఖరు ప్రశ్నకు నాకు సమాధానం తెలియలేదు," అంది.

"ఈ ప్రశ్నపత్రంలో సమాధానం వ్రాయలేని ప్రశ్న మీకు అది ఒక్కటే అయిఉంటే, మీరు చాలా అదృష్టవంతులన్నమాట!" అని ఆయన ముఖమంతా విప్పారేటట్టు నవ్వుతూ అన్నాడు.

ఆమె కడసారి ఆ హాలులోంచి వెలుపలికి వస్తూ ఉండగా, అందమైన ఒక చైనా యువకుడు తన హాటు కొసను స్పృశించి ఆమెకు అభివాదనం చేస్తూ, "క్షమించండి! నన్ను నేనే మీకు పరిచయం చేసుకుంటున్నాను. నా పేరు హెర్బర్ట్ లిన్. నేను ఇక్కడ భవన నిర్మాణపు ఇంజనీరింగ్ పరీక్షకు వచ్చాను. మీరుకూడా రోజూ ఇక్కడకు వస్తూండడం చూస్తున్నాను. ఇక్కడకు వస్తూన్న వారిలో చైనా దేశీయులు మీరొక్కరే అనుకుంటాను. మీరే పరీక్షకోసం వచ్చారు?"

ఆమె మొదట చకితయై, కొంచెం సంశయించి, తరువాత ఇలా జవాబు చెప్పింది:

"నాపేరు పియావోచెన్ వాంగ్. నేను వైద్యపరీక్ష కోసం వస్తున్నాను."

"భేష్ బాగుందండి! నేనూ మొదట డాక్టర్నే కావాలనుకున్నాను. కాని, ఒకసారి మానవరక్తంచూసే సరికి, కళ్ళు పైర్లు గ్రమ్మి నేను ఆ వృత్తికి పనికిరానని వదిలేశాను," అన్నాడు.

ఇద్దరూ పకపక నవ్వారు. తరువాత కొంతసేపు ఏదో మాట్లాడుతూ, ఆ మూడు రోజుల పరీక్షలనుగూర్చి చర్చించుకుంటూ కొంతసేపు గడిపిన మీదట, "ఈ సమావేశానికి జ్ఞాపకార్థం ఈ పూట మన మిరువురం చైనా టౌన్‌లో ఒకే చోట భోజనం చేయడం బాగుంటుందనుకుంటాను!" అన్నాడు లిన్.

ఇక సాయంకాలంవేళల చదవవలసిన అవసరం తీరిపోయింది గనుక వారిరువురూ ఆ వేసవి సాయంసమయాల్లో చాలా సారులు కలిసి భోజనం చేస్తూండేవారు. హెర్బర్ట్ తనకన్న ఒకసంవత్సరం ముందుగా అమెరికా వచ్చాడని క్రమంగా ఆమె తెలుసుకొన్నది. అతడు మసాచూసెట్స్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్‌లో డాక్టర్ బిరుదము పొంది, సివిల్ ఇంజనీరింగ్‌లో ప్రత్యేక నైపుణ్యం సంపాదించాడు. తరువాత రెండు సంవత్సరాలుగా హార్వర్డ్ విశ్వవిద్యా

లయంలో బోధకుడుగా పనిచేస్తున్నాడు. ప్రస్తుతం న్యూయార్క్‌లో సివిల్ ఇంజనీరుగా ప్రాక్టీసు చేయదలుచుకున్నాడు. ఈలోగా తమవద్ద ఇంజనీరుగా పనిచేయవలసినదిగా ఎన్నో కంపెనీలు ఆయనను ఆహ్వానించినవి.

ఆమె కూడా తనను గురించి, తన వైద్యపరిశోధనలను గురించి, తన తాతగారిని గురించి అతడికి చెప్పింది: "మా తాత తన ఉత్తరాలలో అమెరికాలోని జీవన విశేషాలను గురించి వ్రాయమని తరచువ్రాస్తూంటాడు. ఆయన జీవితానుభవాన్ని ముగించేలోగా ఒకసారి అమెరికాను చూడడానికి రావచ్చుననే అభిప్రాయం ఆ ఉత్తరాలవల్ల నాకు కలుగుతూంది," అని కూడా ఆమె అన్నది.

"యుద్ధం త్వరలోనే పూర్తి కావచ్చు. అప్పుడు ఆయన నిన్ను చూడడానికి ఇక్కడికి వచ్చేందుకు అభ్యంతరమేమీ ఉండదు. నేను కూడా ఎలాగూ ఒకసారి ఆయనను కలుసుకోవాలనుకుంటున్నాను," అన్నాడు సాభిప్రాయంగా అతడు.

ఒకరోజున ఆమె తన గదిలోకి వెళ్ళేసరికి, ఉత్తరాల పెట్టెలో ప్రభుత్వపు ముద్రగల కవరొకటి కనిపించింది. దానిమీద అల్బనీ పోస్టు ముద్ర ఉంది. ఆ కవరే ముందు తీసుకుని, చింపి చదివింది: "న్యూయార్క్ రాష్ట్ర ప్రభుత్వ వైద్యశాఖవారు నీవు వైద్యపరీక్షలో ఉత్తీర్ణురాలవైనట్లు సంతోషముగా తెలుపుతున్నారు. ఇందుమూలముగా న్యూ

యూార్క్‌రాష్ట్రంలో వైద్యము, శస్త్రచికిత్సలు చేయడానికి అవసరమైన లైసెన్సుకు దరఖాస్తు చేసుకొనడానికి తగిన అర్హత నీకు కలుగుతున్నది.''

ఆమె హృదయం ఉప్పొంగిపోతూంది. వచ్చి పడక కుర్చీలో కూలబడింది. వెంటనే ఆమెకు తాతగారి విషయం జ్ఞప్తికి వచ్చింది. ''ఇక మా తాతను ఇక్కడకు పిలిపించే లోగానే నేను ఇక్కడ ప్రాక్టీసు ప్రారంభించవచ్చు. డబ్బు సంపాదించి, ఇంతకాలం నాకోసం ఆయనపడ్డపాట్లన్నిటికీ నా ఋణం తీర్చుకుంటాను,'' అనుకున్నది.

''విజయోత్సవ దినం'' సాయంకాలమే ఆ సంరంభం లోనే షియాంగ్ చెన్ తన తాతగారికి ఇలా ఉత్తరం వ్రాసింది: ''ఇక నీవు చైనానుండి బయలుదేరడానికి ఏ విధమైన అభ్యంతరం లేదు. దయచేసి అక్కడి వ్యవహారా లన్నీ ఎవరికైనా అప్పగించి, న్యూయార్క్‌కి రావలసినదని ప్రార్థన! తప్పకుండా బయలుదేరిరా తాతయ్యా!......''

యుద్ధం పూర్తిఅయిపోవడం వలన ఉత్తరాలు విమా నాలలో ఎగిరిపోతూ ఎంత దూరానికైనా అతిశీఘ్రంగా అంది పోతున్నవి. ఆట్టే రోజులు గడవకుండానే ఆమెకు ఆనందదాయకమైన సమాధానం కూడా వచ్చేసింది. ఆమె తాతగారు అమెరికా రావడానికి అంగీకరించాడు.

ఈ లోగా ఆమెకు హెర్బర్ట్‌తో సన్నిహిత పరిచయం

ఏర్పడింది. జీవితాన్ని గురించిన అతడి భావాలు కాయ్ భావాలవలెనే ఆమెను ఆకర్షించినవి. పసిపిల్లలంటే అతడికి ప్రాణం. పిల్లలు వీధిలో ఎక్కడ కనిపించినా ఆగి వారితో మాట్లాడతాడు; ఆడతాడు. స్త్రీలు వివాహం చేసుకున్నా తామభ్యసించిన వృత్తి నిరాక్షేపణగా చేసుకో వచ్చునని అతడి అభిప్రాయమైనట్లు కూడా ఆమె గ్రహించింది. అన్నిటికన్న ముఖ్యమైనది ఆమె వైద్య పరిశోధనలను అతడు విశేషంగా ప్రోత్సహిస్తున్నాడు. తరచు అతడు పరిశోధనాలయానికే వెళ్ళి, అచటినుండి ఆమెను భోజనానికి పిలుచుకొని పోయేవాడు. ఆమె పీటర్‌ను గురించి యోచించింది. జీవితాన్ని గురించిన అభిప్రాయాలలో హెర్బర్టు అతడి వంటి వాడు కానందుకు సంతోషించింది. పైగా, ఇతడు చాలా వరకు కాయ్‌ని బోలిన వాడు. ఒక్క తేడా మాత్రమే ఉన్నది. ఆమెకు కాయ్‌పై గలిగిన ప్రేమ జాలిలోంచి ఉద్భవించింది. హెర్బర్టును తొలిసారి కలుసుకున్నప్పటి నుండి అతడు తనను ఆకర్షిస్తూనే ఉన్నాడని ఆమె సమీక్షించుకొన్నది. బహుశః, ఇతడిలో తన తాతగారిలో ఉన్న కొన్ని విలక్షణ గుణాలు కూడా ఉన్నవేమో!

వాంగ్ కంగ్ ప్రయాణంలో చాలా నలిగిపోయాడు. శాన్ ఫ్రాన్సిస్కోకు ఓడ ప్రయాణంలో నిరంతరం తన గదిలోనే ఉండి పోయేవాడు. ఇక అమెరికాలో, ఆ కోస్తా

నుండి ఈ కోస్టావరకు చేయవలసిన రైలు ప్రయాణంలో కూడా ఒక పెట్టెలో ఒంటరిగానే ప్రయాణం చేయవలసి వచ్చింది.

టెలిగ్రామ్ రాగానే షియావోచెన్ డాక్టర్ కింగ్ వద్దకు వెళ్ళి, తన తాతగారు వస్తున్నారనీ, ఆయన వచ్చిన తరువాత తనకు కొన్ని రోజులు సెలవు కావలసిన ఉంటుం దనీ చెప్పింది. ప్రస్తుతం, షికాగోనుండి వస్తున్న రైలుకై ఆమె గ్రాండ్ సెంట్రల్ స్టేషన్‌కువచ్చి నిరీక్షిస్తూంది. ప్రొద్దు క్రుంకి పోయింది. కమ్యూటర్లు చాలా మంది ఆమెను దాటి వెళ్ళి పోతున్నారు. రైలు దిగిన ప్రయాణీకుల ప్రవాహం క్రమంగా సన్నగిలిపోయి, పూర్తిగా తగ్గి పోయింది. కాని, ఆమె తాతగారు మాత్రం కనిపించ లేదు. ఆమె అప్పుడే గేట్లోనుండి వస్తూన్న ఆ రైలు కండక్టరు వద్దకు వెళ్ళి, "క్షమించండి. చైనా దేశపు వృద్ధ ప్రయాణి కుణ్ణి ఎవరినైనా మీరీ రైలులో చూశారా?" అని ప్రశ్నించింది.

"ఆహా చూచానే! ప్రత్యేకంగా ఆయన ఒక్కరే ఒక పెట్టెలో కూచున్నారు. ఇంకా దిగి రాలేదాండి?" అని అడిగాడు.

"లేదండి! అందుకే నేను కంగారు పడుతున్నాను."

"సరే రండి. కనుక్కుందాం," అన్నాడు కండక్టరు సాదరంగా. అతడు వెను దిరిగాడు. వా రిద్దరు గేట్‌లో

నుండి లోపలికి బయలుదేరారు. మెల్లగా వారు మెట్లు ఎక్కుతూ ఉండగా, సన్నని ఒక యువకుడు ఒక చేతితో రెండు చిన్న పెట్టెలు పట్టుకుని మరొక చేతితో వాంగ్ కంగ్‌కి ఆసరా యిస్తూ తీసుకు వస్తున్నాడు.

“తాతయ్యా!” అంటూ మియాంగ్‌చెన్ సంతోషంగా పరుగు పెట్టింది.

వాంగ్ కంగ్ నీరసమంతా ఒక్కసారిగా మాయమై పోయింది. ఆ యువకుడి పట్టులోంచి తప్పించుకొని, “తల్లీ! నా రత్నమాణిక్యం! నా కళ్ళ నిండా నిన్ను నింపుకోసే తల్లీ! నానా బాధలతో కూడిన ఈ ప్రయాణం చేయడానికి నీవు తప్ప ఈ లోకంలో ఇంకెవ్వరూ నన్ను ఒప్పించ లేరమ్మా. నువ్వు నాచేత ఏపనైనా చేయించ గల వని నేను ఎప్పుడూ చాంగాన్‌తో అంటూ ఉండే వాడిని,” అంటూ ఆ వృద్ధుడు ఆనంద పారవశ్యంతో వణికిపోయాడు.

తరువాత, ఆమె పరోపకార పారీణుడైన ఆ యువకుడికి ధన్యవాదాలు చెప్పి, ఎర్రటోపీ ఊగులాడిస్తూ అతడి వద్ద సెలవు తీసుకున్నది. మనుమరాలు, తాత స్టేషన్‌లో నుండి నలభై రెండవ వీథిలోకి వచ్చారు. అచటి రంగు రంగుల విద్యుద్దీప సౌందర్యం, అసంఖ్యాకములైన కార్ల హడావిడి, పాదచారులైన బాటసారుల సందడి చూచి వాంగ్ కంగ్ ఆశ్చర్యచకితుడై “చిట్ట చివరికి, ఈ వృద్ధాప్యంలో నా కళ్ళు ఈ మహానగరాన్ని చూడ వచ్చిన వన్న

మాట! నువ్వీ నగరాన్ని గురించి నాకు చాలా సార్లు చాలా గ్రంథం వ్రాశావు. కాని, వంద గ్రంథాలైనా ఒక్క క్షణంసేపు చూచిన ఈ దృశ్యంతో సరిపోలవమ్మా!" అన్నాడు.

"ఆ కోస్తా నుండి ఈ కోస్తా దాకా రైలులో ప్రయాణంచేసి రావడంవల్ల, ఈ పాటికే నువ్వు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో చాలా భాగం చూచి ఉండాలి!" అన్నది మనుమరాలు.

"ఒక్క విషయం మాత్రం చూచానమ్మా! మానవులు ఎక్కడ ఉన్నా ఏ జాతికి చెందిన వారైనా వారి స్వభావాలన్నీ ఒకే రకంగా ఉంటాయని ఇప్పటికే నేను గ్రహించానమ్మా! ఆ కుర్రవాణ్ణి చూడు, ఎంత బుద్ధిమంతుడో! పాపం షికాగోనుండి ఇక్కడిదాకా నాకు ఎంతో సహాయపడ్డాడు. నిజానికి అతి నిష్ఠాగరిష్ఠులైన బౌద్ధులు కూడా అపరిచిత వ్యక్తుల పట్ల ఆదరణ చూపడంలో ఈ కుర్రవాడి కన్న అధికంగా ఏమీ చేయలేరు. కాలిఫోర్నియాలో దిగినప్పటి నుంచి ఇదే నాకు కలిగిన అనుభవం అమెరికనులు పరోపకార బుద్ధిగలవారిలా గున్నారమ్మా!" అన్నాడు దృఢంగా.

"ఔను తాతా! నాకూ అదే అభిప్రాయం ఏర్పడింది. ఇక మనం త్వరగా చైనాటౌన్‌కు వెళ్ళిపోవాలి. ఆన్‌లీన్ ఈ వేళ మనమిద్దరం తమ ఇంట్లోనే భోజనం చెయ్యాలన్నది."

"చైనా టౌన్ ఏమిటమ్మా?" అని కుతూహలంగా ప్రశ్నించి, "త్వరగాపద, అదేమిటో చూద్దాం!" అన్నాడు.

"అలాగే! అయితే మనం భూసురంగం రైలు మీద వెళదాం," అని అటు దారి తీసింది షియావో చెన్.

భూసురంగపు రైలు క్రిక్కిరిసిపోయి ఉంది. ఇనప కడ్డీని గట్టిగా పట్టుకుని ఎలా నిలబడవలసినదీ షియావో చెన్ తాతకు చూపింది. ఒక్క ఊపుతో రైలు బయలుదేరింది. దాంతో వాంగ్ కంగ్ టోపీ ఎగిరి దూరంగా పడింది. ఆయన వణుకుతూ షియావో చెన్ ఆసరాకోసం తారట్లా డుతూ, "ఈ నరక కూపంలోంచి నన్ను త్వరగా బయట పడెయ్యమ్మా! ఈ కుదుపుతో నాలో ప్రాణం కడబడు తూంది. ఇంక కొంత సేపు ఈ బండిలో ఇలాగే ప్రయాణం చేయవలసివస్తే నా ప్రాణం పోతుంది," అన్నాడు.

ఇంతలో ఒక యువకుడు లేచి నిలబడి తన స్థానాన్ని వాంగ్ కంగ్‌కి ఇచ్చాడు. వాంగ్ కంగ్ ఆ కుర్రవాడికి వంగి అభివందనం చేసి కూర్చున్నాడు. చైనాలో పెద్ద వాళ్లు చిన్న వాళ్ళకు ఈ విధంగా నమస్కరించే ఆనవాయితీ లేక పోవడం వల్ల, షియావో చెన్ తన తాతగారిలో గలిగిన మార్పును, సంతోష పూర్వకమైన ఆశ్చర్యంతో గ్రహిం చింది.

ప్రస్తుతం, ఆమె ఆయన యెదుట, పైన వ్రేలాడే తోలు పట్టుకొని నిలబడి ఉంది. అతడు ఆమె రెండవ చేతిని

పట్టుకొని, "నన్నెలాగైనా ఈ బండిలోంచి త్వరగా బయట పడెయ్యవమ్మా! ఈ తొందర పాటు బండి నా అస్తిపంజరాన్నంతా కుదిపివేసి ఎముకల పట్లు తప్పించేస్తూంది." అందు వలన పై స్టేషనులో రైలు ఆగగానే పియావోచెన్ సామాను తీసుకుని, ఆయనను చేయిపట్టుకొని సురంగంలోంచి పైకి రోడ్డు మీదకు తీసుకువచ్చి, అక్కడ ఒక టాక్సీ కారు మాట్లాడి అందులో ఆయనను ఎక్కించి, తానెక్కింది.

"ఈ బండీ వాడితో కూడా, బండీని కొంచెం నెమ్మదిగా తోలమని చెప్పు తల్లీ! నా ముసలి శరీరం ఇక ఏ మాత్రం కుదుపు భరించలేదు," అన్నాడు.

టాక్సీ మాట్ వీథిలోకి ప్రవేశించేసరికి, "వచ్చేశాం తాతా చూడు! ఇదే చైనా టౌన్," అంది. ఆయన దీర్ఘంగా నిశ్వసించాడు. రకరకాల చైనా మాంసపు కూరలు ఆయన నాసా రంధ్రాలకు విందు చేస్తున్నవి. "అయితే, యిక మనం దిగి నడుద్దామమ్మా! ఈ అదిరిపాటు బండ్లలో అతల కుతలం అవడం కన్న ఈ కాస్త దూరం నడవటమే మంచి దనుకుంటాను," అన్నాడు.

హోటళ్ళు, రెస్టారెంట్ల మీదుగా, నడచిపోతూ ఉంటే ఆ సువాసనలకు ఆయన గర్భ కోశం అలజడి ప్రారంభించింది. ఆకలి లేని వారికి కూడా ఆకలి పుట్టించగల ఘుమ ఘుమలాడే మాంస భక్ష్యాలను వీథ మీదనే అద్దాల బీరువాలలో

అమర్చి ఉంచిన ఒక హోటలు కేసి చూసి, "యిలాంటి చోట కడుపు నిండా ఒక్క సారి భోజనం చేస్తే మళ్ళీ నాకు కొంత ప్రాణం చేరుకుంటుందమ్మా!" అన్నాడు.

"తాతయ్యా! ఈ వేళ యాంగ్ టే బావ మన యిద్దరి కోసం తన హోటలులో ప్రత్యేకంగా విందు భోజనం తయారు చేయిస్తున్నాడు," అన్నది మనుమరాలు.

"ఔనౌను నేను మరిచి పోయానమ్మా!" అని ఆయన సద్దుకున్నాడు.

వారిద్దరు ఆన్ లీన్ ఉండే భవనంలో మూడవ అంతస్తు మెట్లెక్కుతున్నారు. ఆమూడవ అంతస్తు మెట్ల మొదట వాంగ్ కంగ్ ఒక్కసారిగా ఆగి, ఇనుప కడ్డీ పట్టుకుని ఆయాసపడుతూ, "ఇదేమిటమ్మా? ఇక్కడి వాళ్లు ఇంటి మీద ఇల్లు, ఇంటిమీద ఇల్లు కడతారెందుకు? ఇదేమంత తెలివైన పనిలాగ కనిపించడంలేదు," అన్నాడు.

"అదికాదు తాతయ్యా! ఇలాంటి నగరాలలో జనాభా ఎక్కువ, జాగా తక్కువ అవడంవల్ల, స్థలం చాలా ప్రియం. అందువల్ల వీరిలా కట్టవలసి వస్తూంది."

"ఓహో! అలాగా? అయి ఉండవచ్చు," అంటూ ఆయన మళ్లీ మెట్లెక్కడం ప్రారంభించాడు.

యూంగ్ టే ఆ రాత్రి ప్రత్యేకంగా తన హోటలులో అత్యద్భుతమైన విందు భోజనం తయారు చేయించాడు.

మాననీయుడైన తన నూతన అతిథికి ప్రత్యేకంగా గౌరవ నీయమైన ఆసనం ఏర్పాటు చేశాడు. విందు జరిపే ప్రదేశ మంతా అందంగా చైనా రాజభవనాల ధోరణిలో అలంక రించాడు. పరిశుభ్రమైన దుస్తులు ధరించి, నలుగురు సేవ కులు నానారకాల చైనా పిండి వంటలు, మాంసపు కూరలు వడ్డన చేయడం మొదలు పెట్టారు.

అతిథులలో చాలాభాగం వెళ్ళిపోయిన తరువాత, ఆయన ఆ హోటలులో ఒకమూల యాంగ్ చేతో కూచుని కొంతసేపు మాట్లాడాడు. అక్కడ చాలా బల్లల ముందు అమెరికనులు కూచుని ఉండడం చూచి, "మన ఆహార పదార్థాలు ఈ అమెరికనులు కూడా ఇష్టంగా తింటారా?" అని యాంగ్ చేని ప్రశ్నించాడు.

"ఔనండి. మన పచన పద్ధతి, మన భక్ష్యాలు క్రమంగా వారిని బాగా ఆకర్షిస్తున్నవి," అని జవాబు చెప్పాడు యాంగ్ చే.

"అందులో ఆశ్చర్యమేమిటి? మన పాక కళ అనేక శతాబ్దాల తరబడి అద్భుతంగా అభివృద్ధి చెంది, అనుప మానంగా తయారయింది," అన్నాడు వాంగ్ కంగ్.

కాని, వాస్తవంగా జరిగిన దేమిటంటే ఆయన చైనా టానులో కొన్ని నెలలుగడిపినమీదట, అప్పటికీ యాంగ్ చే భాగంలోనే ఉంటున్నా, భోజనం మాత్రం ఎప్పుడో గాని అతడి హోటల్లో చేసేవాడుకాడు. ఇతర హోటళ్ళ అంత

కన్న ఇంకా ఎక్కువ శ్రద్ధగా చైనా పచన పద్ధతులు అవ లంబిస్తున్నాయన్న అభిప్రాయం ఆయనకు ఏర్పడింది. కాని, విదేశీయుల మహానగరం మధ్య ఒక లంకలాగ ఏర్పాటు చేసిన ఒక నమూనా చైనాలో నివసించడమనే మోజు క్రమంగా తగ్గిపోయి, ఆయన భావాలు తిరిగి స్వదేశంమీాదికి పారడం ప్రారంభించినవి.

వసంత ఋతువులో ఒకనాడు ఉదయం, ఆయన ముఖమల్ టోపీ, కిందవరకు జీరాడే పొడుగైన అంగీ, పట్టు చెప్పులు ధరించి బద్ధకంగా, మెల్లగా వీధివెంట బయలు దేరాడు. దాదాపు రెండు జాముల వేళకు సెల్ వీధిలోని దిగువ అంతస్తులో ఉన్న, తనకు ప్రియమైన ఒక హోట లుకు చేరుకున్నాడు. ఒక మూలగా, కిటికీప్రక్కనున్న ఒక బల్లమీాద కూచుని, మియావోచెన్‌ను తనతోపాటు చైనాకు తిరిగి రమ్మని బలవంతం చేయడమా, చేయకపోవ డమా అని తనలో తానే తర్కించుకుంటున్నాడు. "రమ్మన డమే మంచిది. స్వదేశంలో తన వైద్యసేవ ఎంత అమూ ల్యమో ఆమెకు తెలుసు. అందువల్ల ఇక్కడ ఆమెకు సుఖం లేదు," అని నిశ్చయించుకున్నాడు.

ఆయనకు ఎదురుగా కూర్చున్న ఒక వృద్ధుడు వెళ్లి పోవడానికి లేచి, టోపీ తీసి తల చీడ గోక్కుంటూ ఉండ డంతో, వాంగ్ కంగ్ దృష్టి ఆ ఆలోచనల మీాదనుండి అతడి వంకకు మరలింది. వాంగ్ కంగ్ వెంటనే బల్ల మీాదనుండి లేచి, అతడికి దగ్గరకు వెళ్ళాడు. "నువ్వు పురా

తనపు చైనా మనిషివి లాగున్నావే? ఇప్పటికీ పిలక ఉంచుకుని జడవేసుకుంటున్నావా? మన చైనాలోనే విప్లవానంతరం పిలకలు కత్తిరించి వేసుకోమని బలవంతం చేస్తున్నారు తెలుసా?'' అన్నాడు ఆ వృద్ధుడితో.

ఆ వృద్ధుడు మందహాసంచేసి, ''చైనా దేశస్థుడు ఎక్కడ ఉన్నా చైనావాడే. నేను ఇప్పటికి నలభై యేళ్ళుగా అమెరికాలో ఉన్నాను. ఈ చైనా టౌన్ దాటి బయటికి వెళ్ళలేదు. నేను చనిపోయేవరకు ఈ జడను ఇలాగే ఉంచుకుంటాను,'' అన్నా

వాంగ్ కంగ్ ఆ వృద్ధుని బోడితలను జాగ్రత్తగా పరిశీలించి, ''నీ తలకు చీడ ఉన్నదయ్యా!'' అన్నాడు.

''ఔను. ఉన్నది. చాలా సంవత్సరాల నించి ఉంది. అమెరికామందులు, చైనా మందులు కూడా లెక్కలేనన్ని కొనిరాశాను. మాట్ వీథిలో ఉన్న డాక్టర్ చూ వద్దకు కూడా వెళ్ళాను. కాని, తగ్గలేదు. అందుచేత అది కనిపించకుండా ఉండడానికే టోపీ పెడుతున్నాను,'' అన్నాడా వృద్ధుడు.

''నాకు కూడా కొంచెం వైద్యం తెలుసు. ఇలా కూచుని, నన్ను పరీక్షగా చూడ నియ్యి,'' అని వాంగ్ కంగ్ ఒక్క క్షణంచూచి, వెంటనే హోటలు వెయిటర్ దగ్గరకు వెళ్ళి వ్రాసేందుకు సిరా, కుంచె ఇమ్మని అడిగాడు. ''నేను నీ కొక మందు వ్రాసి యిస్తాను. ఈ కాగితం ఆ

సందు మలుపులో ఉన్న మందుల దుకాణానికి తీసుకు వెళ్ళి చూపించు. వాళ్ళే మందు చేసి ఇస్తారు. దాన్ని తీసుకు వెళ్ళి బాగా కలిపి, ప్రతిరోజు రాత్రి పూట పడుకోబోయే టప్పుడు ఆ చీడ ఉన్నచోట బాగా రుద్దు," అని ఆ కాగితం ఇచ్చాడు.

ఆ వృద్ధుడు అతడికి పుష్కలంగా కృతజ్ఞతాభివందనాలు చేసి, ఆ మందు తప్పకుండా వాడతానని చెప్పి వెళ్ళి పోయాడు. ఈ తతంగం అంతా అక్కడ ఉన్న వారు చాలా మంది చూచారు. ఇంచు మించు రోజూ ఆ హోటలుకి వచ్చి భోజనం చేస్తూన్న అందమైన, విలువైన దుస్తులు ధరించిన ఈ పెద్ద మనిషి గొప్ప చైనా దేశపు వైద్యుడని ఆ నోట ఆ నోట వాళ్ళందరికీ తెలిసింది. చాలా మంది ఆయన వద్దకు వచ్చి నమస్కరించి తమ తమ రోగాలను గురించి ఆయనకు చెప్పి, ఆయన సలహా కోరుతున్నారు. ఇక్కడ కూడా తన వృత్తి సాగించడానికి తాత్కాలికంగా దొరికిన అవకాశానికి సంతోషిస్తూ, ఆయన వారిలో ఒక్కొక్కరినే పరీక్ష చేయడం ప్రారంభించాడు.

* * *

ఆ రోజు సాయంకాలం ఆయన బాగా ప్రొద్దు పోయిన తరువాత తన బసకు వెళుతూ, కొన్ని నెలలుగా తాను ఎన్నడూ ఎరుగని హృదయానందం, సంతృప్తి అనుభవించాడు. మెట్ల దగ్గరకు వచ్చి అచటి కడ్డీని ఆను కొని నిలబడి తన అలవాటు ప్రకారం తనలో తానే గట్టిగా ఇలా అను

కున్నాడు: "నేను, నా మనుమరాలు భిన్నమైన మా యిరువురి వైద్య విధానాలను సమన్వయంచేసి మా పెకింగ్ నగరంలోని ప్రజలకు సేవచేస్తూ ఉంటే ఎంత ఆనంద కరంగా ఉంటుంది!"

*            *            *

షియావోచెన్ ఈ వేళ ఉదయం రోజూ కంటె పెంద రాడే తన పరిశోధనాలయానికి వస్తూంది. ఇంకా ఏడు గంటలైనా కాక పూర్వమే ఆమె ఎలివేటర్ (లిఫ్టు) మీదకు ఎక్కి చిట్ట చివరి అంతస్తులో ఉన్న తన పెద్ద ఎలుకల రాజ్యాన్ని చూచుకొనడానికి ఆదుర్దాగా వెళుతూంది. అందులో ఒక ఎలుకల ముఠా ప్రవర్తన యిటీవల చాలా ఆశ్చర్య కరంగా ఉంది. ఈ ముఠాలోని ఎలుకలన్నిటికీ షియావోచెన్ ఇటీవల తయారు చేసిన మూత్రపిండ సారాన్ని ఇంజక్షన్ చేసింది. ఇందులోని ఎలుక లన్నింటికీ మెడల్లో ఒక్కొక్క చీటీ కట్టి ఉంది. ఆ చీటీ మీద "కె. ఇ. 469" అనే గుర్తు వ్రాసి పెట్టింది. బయటి దుస్తులు మార్చుకొనకుండానే ఆమె ఆ దుర్దాగా ఆ ఎలుకల ముఠా వద్దకు వచ్చింది.

అక్కడ కనుపించిన దృశ్యం ఆమెకు అమితానందం కలిగించింది, చేతులు పైకి ఎగరవేసి సంభ్రమాశ్చర్యాలతో వెనుకకు తిరిగి వచ్చింది. 469 వ నెంబరు ముఠాలోని ఎలుకలన్నీ బోనుల్లో ఒక దాని మీద నుంచి ఒకటి దూకుతూ గంతులువేస్తూ హుషారుగా ఆడుకుంటున్నవి.

యితర జట్లలోని ఎలుకలు మూత్రపిండ వ్యాధి మూలంగా నీరసంతో ఉసూరు మంటూ చావు కొరకు ఎదురు చూస్తున్నవి. వెంటనే ఆమె పరిశోధనశాల దుస్తులు వేసుకొని ఆ "కె. ఇ: 469" నెంబరు ఎలుకలను పరీక్షించడం ప్రారంభించింది. రెండు గంటల తరువాత తన పరిశీలన ఫలితాలను సమన్వయం చేసి చూచుకునే సరికి ఆ జట్టు ఎలుకలకు ఇంజక్షన్ చేసిన మూత్రపిండ సారపు ప్రభావం వల్ల వాటి మూత్రంలో చీము, రక్తము పూర్తిగా మాయమైపోవన్న సంగతి తేలింది.

వెంటనే ఆమెకు డాక్టర్ కింగ్ జ్ఞప్తికి వచ్చాడు. ఆయనను టెలిఫోన్‌లో పిలిచి "పరిశీలన ఫలితాలు విస్పష్టంగా తేలినవి.' అని చెప్పింది.

ఆయన వెంటనే వచ్చి ఆమె రికార్డులన్నీ సమీక్షించాడు. "అవును ఈ ఫలితాలు చాలా ఉత్సాహకరంగానే ఉన్నవి. కాని, ఈ నీ చివరి ప్రయోగ ఫలితం కేవలం దైవికంగా జరిగిన సంఘటన అయే అవకాశం కూడా లేకపోలేదు. అందువల్ల, ఈ ప్రయోగాన్నే నీవు వరుసగా, జాగ్రత్తగా కొన్ని సార్లు చేసి చూచిన మీదట గాని ఈ పరిశోధనా ఫలితాన్ని ప్రకటించడానికి వీలులేదు," అన్నాడు.

డాక్టర్ కింగ్ యింకా గుమ్మం దిగక పూర్వమే, ఆమె మళ్ళీ ఫోను దగ్గరకు వెళ్ళి, తన తాతగారిని పిలిచింది.

"తాతయ్యా! నా పరిశోధనాలయంలోని ఎలుకల మూత్ర పిండ వ్యాధిని నివారించగల మూత్ర పిండ సారాన్ని నేను కనిపెట్టినట్లే తాతయ్యా!" అంటూ ఆనందంగా చెప్పింది.

వాంగ్ కంగ్ ప్రశాంతంగా వేదాంత దృష్టితో, "మంచిది తల్లీ! కాని, ఒక కార్యం నిర్వహించడమే మానవుని వంతమ్మా! ఆ కార్యాన్ని సఫలం చేసే పని భగవంతుడిది. పైగా, ఎలుకల విషయం వేరు. మానవుల సంగతి వేరు. నీ ఎలుకలపైన పనిచేసిన ఈ మందు. మానవులకు కూడా అంత శక్తిమంతంగాను పనిచేస్తుందని రుజువు చేసే వరకు నీపని తీరలేదు. దేవాలయానికి ఏడంతస్తుల గాలిగోపురం కట్టించడానికన్న, ఒక్క మానవుని ప్రాణం కాపాడడం ఎక్కువ గొప్ప సంగతని మాత్రం గుర్తుంచుకో," అన్నాడు.

"అవును. నాకు తెలుసు తాతయ్యా!" అంది ఆమె వినయ స్నిగ్ధస్వరంతో.

ఆ తరువాత తన విజయాన్ని గురించిన శుభవర్తమానం వెంటనే వినవలసిన మూడవవ్యక్తి అయిన హెర్బర్టుకి ఫోన్ చేసింది. "నేను నీకొక శుభవర్తమానం తెలుపుతాను; మరి ఈ వేళ సాయంకాలం వచ్చి నన్ను విందుకి తీసుకు వెళతావా?" అంది సంతోషంగా.

ఆనాడు సాయంత్రం అతడు ఆమెతో, "మనఇరువురి వృత్తులు మనను దూరం చేస్తున్నవి," అన్నాడు.

"ఔను బహుశః ఇంకా ఎక్కువదూరం కూడా చేయవచ్చు. నేను ఇటీవల తయారుచేసిన మూత్ర పిండ సారం చాలా ఉపయోగకారి అయేటట్లున్నది. అందువల్ల నేనీ ప్రయోగాలను ఇంకా వివిధ సందర్భాలలో జాగ్రత్తగా చాలాసార్లు చేసిచూడవలసి ఉంది. అప్పుడు గాని అసలు ఎలుకలమీద కూడా పూర్తిగా సంతృప్తికరంగా, నిస్సందేహంగా పని చేస్తుందని చెప్పడానికి వీలులేదు. ఆ తరువాత దానిని మానవులకు వాడి చూడవలసి ఉంటుంది."

ఇదంతా ఆమెకు ఎంత ప్రాణప్రదమైన విషయమో అర్థం చేసుకోగలగడానికి అవసరమైనంతవరకు ఆమె తత్త్వం అతడికి తెలుసు. కాని ఆమె అతని అభినందనను మధ్యలోనే అటకాయించింది.

"హెర్బర్ట్! మళ్ళీ ఒక్కొక్కప్పుడు ఈ త్యాగాలన్నీ చేయడం ఉచితమేనా అని కూడా నాకు అనిపిస్తూ ఉంటుంది. గత సంవత్సరం వైద్యపరీక్షలో పాసవడానికి నేనంత చదువూ చదివినా, ఇంతవరకు నేను సొంత ఆఫీసు పెట్టుకొని ప్రాక్టీసు ప్రారంభించలేకపోయాను. మా తాతయ్య కొన్ని నెలలుగా ఇక్కడ ఉన్నా, బహుస్వల్పకాలం మాత్రమే నేనాయనతో గడపగలిగాను. నేను చైనాకు తిరిగి రావాలని ఆయన అభిప్రాయం. అయితే, ఆమాట ఆయన నాతో గట్టిగా అనలేదు.

"అయితే, చైనా వెళ్ళిపోతా వన్నమాట!" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఆయన సలహాను నేను తిరస్కరించలేను-హెర్బర్ట్! చైనాలో మన ప్రజలకు వైద్యసహాయం చాలా తక్కువగా ఉంది. ఇక్కడ లెక్కలేనంతమంది వైద్యులున్నారు. అక్కడ చాలా తక్కువ." అని అతనివంక సాభిప్రాయంగా చూచి, మళ్ళీ "హెర్బర్ట్! నీ వంటివాళ్ళు, నావంటివాళ్ళు ఇక్కడ ఉండిపోవడం చాలా పొరపాటని తరచు నాకు అనిపిస్తూ ఉంటుంది. మనలాగ వైద్యంలోను, ఇంజనీరింగ్ లోను ఉన్నత విద్యాభ్యాసం చేసే అదృష్టం మన చైనా యువజనుల్లో లక్షకు కోటికి ఒక్కరికి కూడా లభించదు. అందువల్ల మన మీా ఉన్నత విద్యవలన కలిగే ప్రయోజనాలను మన దేశస్థులకు లభింపజేయడం, అందుకోసం చైనాకు తిరిగి వెళ్ళడం అవసరమని నీకు మాత్రం అనిపించడం లేదా? హెర్బర్ట్?" అని ప్రశ్నించింది.

"లేదు పియావోచెన్! నాకలా అనిపించడంలేదు. నాకు చైనాకు తిరిగి రావాలని ఎంతమాత్రం లేదు. నా బంధువులందరు ఇక్కడే సంయుక్తరాష్ట్రంలోనే ఉన్నారు. మేమంతా ఇక్కడ సుఖంగా ఉన్నాము. ఇక్కడ మనకు ఎవరివలన ఏవిధమైన భయంలేదు. ప్రజాస్వామ్య ప్రభుత్వ రక్షణలో ఉండడం వలన ఇక్కడ మనను పీడించేవారెవరూ లేరు. పైగా, నావృత్తికి చెందిన నిపుణులు ప్రస్తుతం చైనాకు అవసరమని కూడా నేను అనుకోను," అన్నాడు.

ఆరోజు సాయంకాలం వారు విడిపోయినప్పుడు ఇద్దరూ మనస్సుల్లో ఎంతో బాధతో విడివడిపోయారు.

*    *    *

469 నెంబరు మూత్ర పిండ సారం, మూత్ర పిండ వ్యాధిగల ఎలుకలకు అమోఘంగా పని చేస్తున్నదని, అపకారం ఏమీ కలిగించడం లేదనీ పిమ్మట చేసిన ప్రయోగాల వల్ల నిస్సందేహంగా రుజువయింది. ఇక అనంతర చర్య దీర్ఘకాలం ఆ ఔషధాన్ని మానవులపై ప్రయోగించి చూడడం. ఈ కార్యక్రమం కూడా అమెరికాలోనే పూర్తి కావాలి. అందువల్ల తాను చైనాకు తిరిగి రావడానికి మరి కొన్ని నెలలు పడుతుందని ఆమె తనతాతగారితో చెప్పింది. వెంటనే ఆయన ఆ సూచనను ఆమోదించడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. ఆ పరిశోధనను పూర్తి చేయకుండా అక్కడితో ఆపివేస్తే, మహాపాపం చేసినట్టవుతుందని కూడా ఆయన అన్నాడు. అది ఎంతవరకు ఉపయోగపడేది వెంటనే ప్రయోగాలుచేసి చూస్తే, బహుశః చాలా ప్రాణాలను కాపాడే అవకాశం కలుగవచ్చు.

తాను ఎలాగూ మరికొంతకాలం అమెరికాలో ఉండదలుచుకొన్నది గనుక, వైద్యం కూడా మొదలుపెట్టడం మంచిదని ఆమె నిశ్చయించుకొన్నది. చివరికి ఆ శుభదినం వచ్చింది. మల్బరీ వీధిలో ఒక పెద్దభవనంలో మొదటి అంతస్తులో చిన్నభాగం అద్దెకు తీసుకుని, ప్రాక్టీసు పెట్టింది.

పెకింగ్‌లో వాంగ్ కంగ్‌కు గల సువిశాలమైన కచేరీకీ, ఈ ఇరకాటపు ఆఫీసుకు ఎక్కడా పోలికే లేదు. అందుచేత, అసలు తాతగారిని తీసుకొనివచ్చి తన కచేరీ చూపడం ఆమెకు ఇష్టంలేదు. కాని, ఆయన పట్టుపట్టడం వల్ల అలంకారాలు, హంగులు పూర్తిగా సమకూర్చిన తరువాత ఆయన్ని తీసుకువెళ్ళింది.

మళ్ళీ ఆయన ఆమెకు ఆశ్చర్య కలిగించాడు: "ఎంత అద్భుతంగా ఉన్నదమ్మా! ఇప్పుడు నువ్వు వైద్యం ప్రారంభించడంతో నా సంతోషానికి, గర్వానికి అంతులేదమ్మా!" అన్నాడు.

ఆమె అమితోత్సాహంతో మొట్ట మొదటి రోజు ప్రాక్టీసుకువెళ్ళింది. ఆ రోజున తనవద్దకు రోగులు వస్తారని ఆమె అనుకోలేదు. ప్రాక్టీసు ప్రారంభించిన మొదటి రోజులలో కొన్నివారాలు, నెలలపాటుకూడా ఒక్క పేషెంటైనా లేకుండా కూచున్నామని, ఆమె వైద్యమిత్రులు కొందరు ఆమెకు చెప్పారు. కాని, ఆనాడు తీరా ఆమె తనకొత్త ఆసుపత్రిలో ప్రవేశించేసరికే, ఐదుగురు రోగులు తనకోసం కనిపెట్టుకొని ఉండడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది.

"ఈ ఆసుపత్రిని గురించి అప్పుడే మీకెలా తెలిసింది? మిమ్మల్ని ఎవరైనా ఇక్కడికి పంపారా?" అనివారిని ప్రశ్నించింది.

"ఈ ఆసుపత్రిని ప్రారంభిస్తున్న సంగతి మేము వార్తా పత్రికలో చదివాము," అన్నారు వారు.

"వార్తా పత్రికలోనా ?"

"ఔను. చైనా టౌన్ వార్తాపత్రికలో."

"చిత్రంగా ఉన్నదే. నేనావార్త పత్రికలో ప్రకటించలేదే," అనుకుంటూ దీర్ఘంగా ఆలోచించి ఏదో అర్థమయినట్లు తల ఊపుతూ, "తాతయ్యా! నువ్వు చాలా గమ్మత్తయినవాడివి! అప్పుడే నువ్వే చైనా టౌన్‌లోను, ఇక్కడి పత్రికలలోను కూడా పెద్ద పలుకుబడి సంపాదించేశావు. ఎప్పుడైనా నీ సహాయం లేకుండా నేను ఏమీ చెయ్యలేను తాతయ్యా!" అనుకున్నది.

నడివేసవికాలం. బయట ఎండ సురసురలాడుతూంది. రోగులు వేచిఉండే గదిలో ఎలక్ట్రిక్ ఫాన్ తెరిపిలేకుండా తిరుగుతూంది. కడపటి రోగిని బయటికి పంపి, ఆసుపత్రి మూసి వెళ్ళడానికి సన్నాహాలు చేసుకుంటూంది మియా వోచెన్

నెలలకొద్దీ శ్రమపడి పరిశోధనలు చేసినమీదట, ఆమె "కె. ఇ. 469" మందుతో ఎలుకలలో సాధించినఫలితాలు యథాతథంగా మానవుల మూత్రపిండరోగాల విషయంలో సాధించడానికి వీలు లేదని స్పష్టంగా తేలిపోయింది. ప్రస్తుత పరిశోధనలను అంతటితో ముగించి, చైనాలో తిరిగి వాటిని కొనసాగించే అవకాశం కలిగించుకోనడానికి ఆమె

నిశ్చయించుకున్నది. వసంత ఋతువులో చైనాకు తిరిగి వెళ్ళడానికి తాత, మనుమరాలూ తీర్మానం చేసుకున్నారు.

కొన్ని వారాలుగా హెర్బర్ట్ ఆమె వద్దకు రావడం లేదు. చైనాకు తిరిగి వెళ్ళడాన్ని గురించి లోగడ వారిద్దరికి జరిగిన విరస ప్రసంగం తరువాత. మళ్ళీ వారిద్దరూ కలుసుకోలేదు. అతడికి ఇక తనను గురించిన ఆసక్తిలేదనే ఆమె సంతాపకర నిశ్చయం.

ఆమె ఆఫీసు తలుపుమూసి, వెయిటింగ్ రూమ్‌లోకి వచ్చింది. అందులో కూడా లైట్లు ఆర్పివేయబోతూండగా. "దయచేసి ఇంకొక్క పేషెంటును కూడా చూడాలి డాక్టర్!" అన్నమాట వినిపించింది.

అనుకోకుండా, హఠాత్తుగా ఆ సుపరిచిత కంఠ స్వరం విని, ఆమె వెనుదిరిగి హెర్బర్టును చూచింది. చివరికి పేషెంట్ వెళ్ళిపోయినప్పటినించి అతడక్కడ వేచిఉన్నాడు. ఆమె తన కలవరపాటును సద్దుకొని ప్రశాంతంగా, "చిత్తం. చిత్తం. లోపలికి దయచేయండి," అంది.

ఆఫీసులో ఆమె తన డాక్టర్ జాకెట్ విప్పివేసి, మామూలు తెల్లకోటు తొడుగుకొనడానికి పోతూండగా హెర్బర్ట్ ఆమెను వారించి, చిరునవ్వుతూ, సానునయంగా, "డాక్టర్! నేను నిజంగా సుస్తీగా ఉండే, నీచికిత్సకోసం వచ్చాను. కాని, నీస్టెతస్కోపుగాని, నీ థర్మామీటరుగాని నాకక్కరలేదు," అంటూ ఆమెను సమీపించి, వణికి

పోతూన్న ఆమె చేతులు పట్టుకున్నాడు. "నాకు కావలసిన ఔషధం నువ్వే!" అన్నాడు.

ఆమె తన బల్లవద్ద కూర్చుంది; కళ్ళు చెమ్మగిల్లినవి. "నామాటలు శ్రద్ధగా విను. నీవు చైనాకు తిరిగివెళ్ళడాన్ని గురించి ప్రసంగించినప్పుడు, నా మొరటు తనపు ప్రవర్తనకు క్షమాపణ కోరుకుంటున్నాను. ఆ విషయం నీవు ఎంత ముఖ్యంగా భావించినదీ నేను గ్రహించలేకపోయాను. గడచినకొలదీ వారాలలో నేను అంతులేకుండా ఆలోచించాను. నా ఒంటరితనం అతిభయంకరంగా పరిణమించింది. నాజీవితం నీతోనే ముడిపెట్టుకొని ఉన్నదని నాకిప్పుడు వ్యక్తమయిపోయింది. నీవు చైనాకు వెళ్ళదలచుకుంటే – నీకు నాపైన దయతప్పకుండా ఉంటే – నేనూ చైనా వచ్చేస్తాను," అన్నాడు.

ఆమె ఇక కన్నీళ్ళను నిలువరించుకోలేక పోయింది. ఇటీవల కొన్నివారాలుగా నేనూ "భీకర ఏకాంతవాసం అనుభవించాను. అయితే, నీ సంకల్పానికి విరుద్ధంగా నీవు ప్రవర్తించడం ఇప్పటికీ నాకు ఇష్టంలేదు."

"చైనా వెళ్ళాలనే ఇప్పుడు నా సంకల్పం," అని మెల్లగా అన్నాడు. పిమ్మట తనకుర్చీని ఆడమ్స్ బల్ల ప్రక్కన ఆమె వేపుకు లాక్కున్నాడు. "రెండు వారాల క్రిందట మీ తాతగారు నన్ను చూడడానికి వచ్చారు. అప్పటినుంచి మాయిరువురికి బాగా పరిచయ మేర్పడింది.

మధ్యాహ్న భోజనంగాని, రాత్రి భోజనంగాని ప్రతిదినం మేమిద్దరం కలిసే చేస్తున్నాం. ఆయన నిన్ను గురించిన సర్వం నాకు చెప్పారు. మన దేశంలో వైద్యరంగంలో నిపుణురాలవైన నీ అగత్యం, ఇంజనీరింగు రంగంలో నా అగత్యమూ ఎంత ఉన్నదీ ఆయన నాకు విశదీకరించారు. ఆయన బోధనలవలన నాకు వివేకోదయమయింది. నీవు సమ్మతిస్తే నేను కూడా నీతోపాటు రావడానికి సిద్ధంగా ఉన్నాను,''-అన్నాడు.

సమాధానం చెప్పకుండానే ఆమె లేచి, అతని సాచిన బాహువులలోకి ఒరిగింది. వారి అధరాలు ఒత్తుగా హత్తుకొన్నవి.

చైనాకు బయలుదేరడానికి పూర్వం తమ వ్యాపారాలను, వృత్తి వ్యవహారాలను సద్దుకొనడంలో హెర్బర్టు, షియావోచెనూ కూడా అనేక సమస్యలను ఎదురుకోవలసి వచ్చింది. ఎన్నో వీడ్కోలు విందులు, సమావేశాలు జరిగినవి. ఇంచుమించు ప్రతిరాత్రి షియావోచెన్ తన వైద్య వర్గాలతోనో, హెర్బర్టు తాలూకు ఇంజనీరు మిత్రులతోనో విందు భోజనమే చేస్తూంది.

పెకింగ్ నగరం చేరుకోగానే తాము వివాహం చేసుకో దలచుకున్నట్టు, ఆ ప్రేమికులు వాంగ్ కంగ్‌తో చెప్పారు. ఆయన వారి ప్రణయాన్ని సంపూర్ణామోదంతో ఆశీర్వ

దించి, తన పెద్ద కూతురికి కేబుల్‌వార్తపంపి ముందుగానే అక్కడ వివాహానికి తగిన ఏర్పాట్లన్నీ చేయించాడు.

మే నెలలో బాగా వేడిగా ఉన్న ఒకరోజు మధ్యాహ్నం, పియావోచెన్ తన ఆసుపత్రి ఎత్తివేసి, భారీ సామగ్రి అంతా అమ్మివేసి, మిగిలిన సామాను ట్రంకులలో సర్దుకుంటూంది. ఆమె తాతగారు తెరిచి ఉన్న ఒక కిటికీలో కూచుని విసనకర్రతో విసురుకుంటూ, వెలుపలికి చూస్తున్నాడు.

హెర్బర్టు గదిలో వచ్చాడు. అతడి చేతులలో పెద్దపుస్తకాల దొంతర ఉంది. తనవృత్తి వ్యాపారాలన్నీ ముగించుకొని, ప్రయాణానికి సద్దుకోనడంలో పియావోచెన్‌కి సహాయపడేందుకు వచ్చాడు.

ఇంతలో తలుపు చప్పుడయింది. పియావోచెన్ వెళ్లింది. ఒక సందేశహారి స్పెషల్ బట్వాడా జాబొకటి తెచ్చియిచ్చాడు.

ఆ పొడుగుపాటి కవరు మీద ఆమె చిరునామా వ్రాసి ఉంది. అది అమెరికా వైద్యశాస్త్ర పరిశోధకమండలి వారి వద్దనుండి వచ్చింది. కవరు చింపి చదివింది:

"ప్రియమైన డాక్టర్ వాంగ్!

"1948 మే 21 వ తేదీన అపరాహ్ణం రెండున్నర గంటలకు న్యూయార్క్ నగరంలోని వాల్డోర్ఫ్ ఎస్టోరియా

హోటలులో జరుగనున్న ఈ సంస్థ డెబ్బయ్యారవ జన్మదినో త్సవానికి మిమ్ము ఆనందంతో ఆహ్వానిస్తున్నాము.

"వైద్యపరిశోధన రంగంలో ప్రశంసనీయమైన కృషి చేసినవారికి ఈ సంస్థ ఇస్తూన్న బహుమానాలలో ఒకటి తమకు సమర్పించాలని మా బహుమానార్హ నిర్ణాయక సంఘం నిశ్చయించింది.

"ఆ శుభదినమున మీరు ఆ సమావేశానికి హాజరయి బహుమానమును స్వీకరించగలరని ఆశిస్తున్నాము"

భవదీయుడు,

ఎమ్. ఎఫ్. కెన్నడీ. ఎమ్. డి.

కార్యదర్శి,

ఈ ఉత్తరం చదవడం పూర్తికాగానే ఆమె చేతులు కంపించడ మారంభించినవి. ఆమె ముఖం ఎర్ర బడింది. "ఏమిటది? దుర్వార్త కాదుగద?" అని అదుర్దాగా ప్రశ్నించాడు హెర్బర్ట్. ఆమె మాట్లాడకుండా ఆ ఉత్తరం అతడికి అందించింది. ఒక్కసారి పైనించికిందికి చదివి, "భేష్! భేష్! భేష్!" అని కేకలు పెట్టాడు.

వాంగ్ కంగ్ ఆదుర్దాగా, "ఎమిట్రా ఆ గొడవ? నాకు చెప్పరా ఏమిటి?" అన్నాడు.

"క్షమించు తాతయ్యా! ఆనందంలో నాకు ఏమీ తెలియ లేదు. నా పరిశోధన ప్రసంశనీయమైనదని ఈ దేశం

లోని ఒక ప్రముఖవైద్య సంస్థ తీర్మానించింది. వారు నాకు ఏదో బహుమానం కూడా ఇస్తారట!" అన్నది. షియావోచెన్.

వాంగ్ కంగ్ ఆకర్ణాంతం నోరంతా తెరచి పరమానందంతో తెల్లమబ్బు పింజంలాంటి తలంతా ఊగిపోయేటట్టు నవ్వాడు. "ఈ అమెరికనులు ధర్మపరాయణుల్లాగా, ఉదారుల్లాగా కూడా కనబడుతున్నారు. జాతి, మత, విచక్షణ లేకుండా ప్రశంసార్హులైన వారి నెవరినైనా సత్కరించడం ఎంత గొప్ప విషయం! ఇల్లాంటి మర్యాదలు మనచైనా వాళ్ళు వీళ్ళ దగ్గర నేర్చుకోవలసి ఉంది," అన్నాడు.

ఆవైద్య పరిశోధన సంస్థ సమావేశపు రోజున ఒంటి గంటదాటిన కొంచెం సేపటికి యాంగ్ఛే, ఆన్‌లీన్ వచ్చారు. మొత్తం అయిదుగురితో కూడిన ఆ బృందం వాల్డోర్ఫ ఎస్టోరియా హోటలుకి బయలుదేరింది. తక్కిన కార్లన్నీ ఎంత వేగంగా వెళుతున్నా యాంగ్ఛే సాధ్యమైనంత నెమ్మదిగా కారు నడుపుతున్నాడు. అయినా, దారి పొడుగునా వాంగ్ కంగ్ కంగారుగా ఊగులాడుతూ వేగంగా దాటిపోతున్న టాక్సీల డ్రైవర్లను కేకలు వేస్తూనే ఉన్నాడు.

హోటలు సింహద్వారం వద్ద యాంగ్ఛే తన కారుని అచటి కార్ల కాపలావారికి అప్పగించాడు. వాళ్ళంతా సభామందిరంలో ప్రవేశించారు. వెంటనే షియావోచెన్ ఆ

లను గురించి మీరు చేసిన ప్రముఖ పరిశోధనలను గుర్తించి, ఈ అమెరికా వైద్య శాస్త్ర పరిశోధక సంస్థ మీకు ఈ బహుమానం సమర్పిస్తూంది.''

డాక్టర్ స్వాజ్ ఒక పెద్ద కవరును అందుకొని, కృతజ్ఞతా సూచకంగా నాలుగుమాటలు చెప్పాడు.

హర్ష ధ్వానాలు సద్దుమణిగిన తరువాత, సభాపతి మరల మైక్రోఫోను వద్దకు వచ్చారు. ఆ హాలులో ప్రశాంతి ఏర్పడేవరకు నిరీక్షించి, ఆయన ఇలా అన్నాడు: ''సహచర పరిశోధకులారా! మిత్రులారా! మన పరిశోధక సంస్థ స్త్రీని బహూకరించడానికి ఈ సంస్థ చరిత్రలో ఇదే ప్రథమ పర్యాయం. ఇక నే నీ సభాపతిత్వాన్ని సుప్రసిద్ధ పరిశోధకుడగు డాక్టర్ యూజీన్ కింగ్‌కి అప్పగిస్తున్నాను. ఈ బహుమానం పొందిన యువతిని ఆయన మీకు పరిచయం చేస్తారు,'' అన్నాడు.

డాక్టర్ కింగ్ మైక్రోఫోన్ దగ్గరకు వచ్చాడు. స్త్రీల వ్యాధుల విషయంలో చేసిన విశిష్ట పరిశోధనలవలన అంతర్జాతీయ విఖ్యాతి ఆర్జించిన డాక్టర్ కింగ్ పారిషదులు తనకు స్వాగతమిస్తూ చేస్తూన్న హర్షధ్వానాలు శాంతించే వరకు చిరునవ్వుతూ నిలబడి తరువాత ఇలా అన్నాడు:

''ఈ సంవత్సరం బహుమానం పొందుతూన్న నా స్నేహితురాలు ఇదివరకే అనేక పరిశోధక రచనలు ప్రకటించినందువల్ల నిజానికి ఇప్పుడు ఆమెను క్రొత్తగా పరిచ

యం చేయవలసిన అగత్యం లేదు. మూత్ర పిండవ్యాధుల విషయంలో ఆమె చేసిన అద్భుత పరిశోధనలను గురించి మీకందరికీ తెలుసు. ఎలుకలమీద చేసిన ఈ ప్రయోగాల ఫలితాలను మానవులకు చేసే చికిత్సలో ఉపయోగపడే టట్లు చేయాలంటే ఇంకా చాలా సమస్యలను పరిష్కరించ వలసి ఉన్నదని, పిమ్మట చేసిన మరికొన్ని పరిశోధనల వలన తేలింది. నేడు మన బహుమానమును పొందుతూన్న ఈ లేడీ డాక్టర్ ఈ విషయాన్ని ప్రథమతః కనుగొని ప్రక టించింది. ఈమె స్వదేశమైన చైనాలో స్థిరపడిన తరు వాత, ముఖ్యమైన ఈ పరిశోధనను కొనసాగించడానికి తగిన ఆర్థిక సౌకర్యాలు ఏర్పాటైనవని కూడా తెలుపడానికి ఎంతో సంతోషిస్తున్నాను. నేడీ బహుమానాన్ని ఈమెకు అందజేసే అవకాశం నాకు కలిగినందుకు ఆనందిస్తున్నాను.''

షియావో చెన్ మిశ్రమభావాలతో నిండిన హృద యంతో, వేదికపైకి వచ్చింది. సభయావత్తూ పెద్దగా హర్షధ్వానాలు చేస్తూ ఉండగా, డాక్టర్ కింగ్ అందించిన కవరు స్వీకరించింది. పిమ్మట సభాసదుల వైపు తిరిగి, హర్షధ్వానాలు సద్దుమణిగేవరకు నిలబడింది.

''డాక్టర్ కింగ్! సభ్యులారా! ఉదారులైన మీ అమెరికా ప్రజలు నేను చేసిన స్వల్ప పరిశోధనకు నాకీ ఘన మైన గౌరవం చేస్తూన్నందుకు కృతజ్ఞురాలను. ఈ పరిశోధ నల విషయంలో నేను డాక్టర్ కింగ్‌కి ఎంత ఋణపడి ఉన్నదీ, ఈ సమయంలో బహిరంగంగా వెల్లడించవలసి

ఉన్నది,'' అని ఆమె డాక్టర్ కింగ్ వంకకు తిరిగి, ''డాక్టర్ కింగ్! మీరు నాకు చేసిన సహాయానికి ధన్యవాదాలు. నేనీ నూతన విషయాలను కనుగొనడానికి అవకాశం కలిగించినది మీరు...'' మళ్ళీ, సభ అంతా దీర్ఘహర్షధ్వానాలు చేసింది. షియూవో చెన్ మళ్ళీ సభ సద్దుమణిగేవరకూ నిలబడవలసి వచ్చింది.

''నేను మీకు తెలుపవలసిన విషయాలు ఇంకా కొన్ని ఉన్నవి. చాలా సందర్భాలలో ఎందరో చేసిన త్యాగాల ఫలితంగా ఒక వ్యక్తి ఘన విజయం సాధించడం జరుగుతూ ఉంటుంది. ఏదో ఒకవిధమైన విజయం లభించినప్పుడు, వాస్తవంగా ఆగౌరవం పొందవలసినవారు సామాన్యంగా సజీవులై ఉండరు. కాని నేను అదృష్టవంతురాలను. ఈ నా విజయానికి అవసరమైన సర్వత్యాగాలను చేసిన వ్యక్తి నేడు ఇక్కడ మన మధ్యనే ఉన్నాడు. ఆయన పెకింగ్ నగరవాసి అయిన డాక్టర్ వాంగ్ కంగ్. పసికందునైన నాటినుండి ఆయన నన్ను పెంచి, నా విద్యాభ్యాసానికి అవసరమైన సర్వసౌకర్యాలూ కలిగించారు. అంతకన్న ఘనమైనవిషయం: చైనా వైద్యంలో తనకు గల అపారానుభవం వల్ల గ్రహించిన రహస్యాలన్నీ నాకు తెలిపి, ఈ నా పరిశోధనలకు ప్రాతిపదిక భావాన్ని కూడా ఆయనే నాకు సూచించారు.''

''మహాశయులారా! అట్టి మా తాతగారగు ఈయనను మీకు పరిచయం చేస్తున్నాను.''

సభ అంతటా మళ్లీ ఘనమైన హర్ష ధ్వానాలు చెల రేగినవి. హెర్బర్టు మెల్లగా వాంగ్ కంగ్‌ను వేదికపైకి తీసుకువెళ్లాడు. చైనాదేశస్థులైన ఆ ప్రాచీన – నవీన వైద్య నిపుణు లిరువురు చిరునవ్వుతూ, ప్రేక్షకులకు ఎదురుగా ఒకరిచేయి ఒకరు పట్టుకొని నిలబడ్డారు. ఆనందాశ్రుపూరిత నేత్రాలతో, కృతజ్ఞతాభరిత హృదయంతో వాంగ్ సగర్వంగా ఒక్కసారి మనుమరాలి వంక చూచి, పిదప హర్ష ధ్వానాలు చేస్తూన్న సభాసదులకు వంగి అభివందనం చేశాడు.

Sri Rama & Co., (Bharathamata Press), 39, Anderson St. Madras-1.

